# పీఠిక

ఈ నవలకు మొదట రఘునాథజీ అని పేరు. ఇప్పుడు మాతృకానుసారముగా "మహారాష్ట్ర జీవనప్రభాతము" అని అనువాదకులు మార్పు చేసినారు. సౌలభ్యమునకై "జీవన ప్రభాతము" అన్నారు.

శ్రీ శివ శంకర శాస్త్రి గారు ౧౯౧౩ లో వంగభాష నుండి దీనిని తెలిఁగించి ౧౯౧౪ లో ఆఖ్యాయికా పరంపరలో ప్రకటించినారు. బహుకాలము క్రిందటనే ప్రథమముద్రణ ప్రతులు చెల్లిపోయినను కారణాంతరములచేత ఇప్పటికిఁ గాని ద్వితీయముద్రణము వెలువడ లేదు.

శాస్త్రి గారు వంగభాష నభ్యసింపగానే ౧౯౧౨ లో "నీరద", "వంగవిజేత" అను నవలలను తెలిఁగించి, శ్రీ వేంకటపార్వతీశ్వరులు వీనినే ప్రకటించుచున్నట్లు తెలిసికొని తాము ప్రకటించుట మానినారు. తరువాత మహారాష్ట్ర జీవనప్రభాతము, రాజపుత్ర జీవనసంధ్య, మాధవీ కంకణము మొదలగువాని నాంధ్రీకరించి ప్రచురించినారు. తెనాలిలో ఆఖ్యాయికా నిలయము స్థాపించి తద్ద్వారా వీని నాంధ్రలోకమున కందించినారు. ఆరోజులలో చరిత్రాత్మక మైననవల

లన్ని సందఱికిని ప్రీతి నొందు. కావుననే శ్రీ రమేశ చంద్రుని ఐతిహాసికనవల నాంధ్రీకరించుట సంభవించినది.

శ్రీమాన్ వల్లభ అయ్యంగార్ దీనిని కన్నడ భాష లోనికి పరివర్తనము చేసి ప్రకటించినాడు.

ఈనవలలో మహారాష్ట్రవిజృంభణము, శివాజీఛత్రపతి పరాక్రమౌదార్యములు, హిందూసామ్రాజ్యసంస్థాపనాభిరతి, భారతరాజ్యాంగక్లిష్టపరిస్థితిగతులు, సుస్పష్టముగా వర్ణితములు.

ఆంధ్రులు శ్రీ శాస్త్రిగారి వచనరచనామాధుర్యము నాస్వాదించి ఆమోదము నొందుదురు గాక.

పిలకా గణపతి శాస్త్రి

రాజమహేంద్రవరము
ఏప్రిల్ ౧౯[illegible]

పదునాలవశతాబ్ది ఢిల్లీచక్రవర్తి మహమ్మద్ తుగ్లక్ దేవగఢనగరమును రాజధానిం జేయయత్నించి, వెనుకటి నామమును తొలగించి, దానికి దౌలతాబాద్ అను పేరు పెట్టెను. వానివెఱ్ఱిపనులు చూచి హిందువులు, ముసల్మానులును విసువు చెంది వానికి విరుద్ధముగా లేచిరి. హిందువులు విజయనగరము రాజధానిగా నూత్నసామ్రాజ్యమును స్థాపించిరి; ముసల్మానులు దౌలతాబాద్ రాజ్యము ను ప్రతిష్ఠించిరి. కాలక్రమమున నీరెండును దక్షిణదేశమునం బ్రసిద్ధి వహించెను. ఇంచుమించుగా మూడునందల సంవత్సరములదనుక ఢిల్లీచక్రవర్తులు దక్షిణదేశమును స్వాధీనము చేసికొనుటకై ప్రయత్నములు సలుపలేదు.

ఢిల్లీయుపద్రవమునుండి తప్పియున్నను దక్షిణహిందూరాష్ట్రములు విపత్తులకు లోనయి యుండకపోలేదు. హిందువులు తమదేశమునదుమ ముసల్మానులకు చోటిచ్చిరి; అప్పుడు వారి జాతీయజీవనము క్షీణించియుండెను. మహమ్మదీయులు ప్రబలులై యుండుటచే వారలు హిందువులను ధ్వంసము చేయుటకై నిరంతరప్రయత్నము సలుపుచుండిరి. కాలక్రమమున దౌలతాబాద్ రాజ్యము మహావృద్ధినొంది, తుదకుఖండములుగా విభక్తమయ్యెను. బిజాపూర్, గోల్కొండ, అహ్మద్‌నగర్ అను మూడుసంస్థానము లుద్భవించెను. ౧౫౬౪ సంవత్సరమున ముసల్మాను లెల్లరు నేకీభవించి తళ్ళికోటయుద్ధమున విజయనగరసైన్యము నోడించి, యారాజ్యము నంత మొందించిరి.

౧౫౯౦ సంవత్సరమున అక్బర్ చక్రవర్తి దక్షిణదేశమును స్వాధీనముచేసికొన నుద్యమించెను. వానిమరణమునకు పూర్వమే ఖాన్‌దేశ మంతయు, అహ్మదనగరరాజ్యమున చాల భాగమును ఢిల్లీకి స్వాధీనమాయెను వానిపౌత్రుండు షాహాజహాన్ ౧౬౩౬ సంవత్సరప్రాంతమున అహ్మదనగరమును పరిపాలించెను. దక్షిణదేశమందు బిజాపూర్ గోల్కొండ రాజ్యములు మాత్రము స్వాతంత్ర్యము వహించియుండెను.

ముసల్మానుసంస్థానములందు హిందువులు హీనస్థితిలో నుండలేదు. వారల రాజకీయవ్యవహారములు మహారాష్ట్రుల బుద్ధిబలముచేతనే నడచుచుండెను. ఒక్కొకరాజ్యము కొన్ని సర్కారులుగాను, ఒక్కొకసర్కారు కొన్ని పరగణాలుగాను విభక్తమయి యుండెను. ఈసర్కారులయందును పరగణాలయందును ముసల్మానులే కాక హిందువులు కూడ నధికారము కలిగియుండిరి. వారలే పన్ను రాబట్టి రాజకోశమునకు పంపుచుండెడివారు మహారాష్ట్రము పర్వతసంకులము; గిరిశిఖరములం దనేకదుర్గములు నిర్మితములై యుండెను. సుల్తాను లీదుర్గములను హిందువులచేతులలో నుంచుటకు సంకోచించెడివారు కారు. కిల్లాదారులుగా నుండుమహారాష్ట్రులు సాధారణముగా సాధారణముగా జాగీర్ల ననుభవించుచుండువారు. ఈ కిల్లాదార్లు, దేశముఖులును గాక, చాలమంది హైందవులు మన్సబ్‌దార్లుగా దర్బారులో నుందురు; వారు పందరో, అయిదు

వందలో, వేయియో, యెక్కువయో సైన్యముగల గుఱ్ఱపుదళ ములకు ప్రభువులై యుందురు. సుల్తాను నానతిచొప్పున నాయా సంఖ్య గల సేన వెంట బెట్టుకొని యుద్ధసమయము లందు వారు వానికి సాయము చేసి తీరవలెను. వారలును సైన్యవేతనార్థము, స్వవ్యయార్థము నొక్కొక జాగిరు ననుభవింతురు.

బిజాపూర్ సుల్తాను కొలువులో చంద్రరావు మోరే యనునతఁడు పండ్రెండువేల పదాతికసైన్యమున కధిపతి ప్రభువు నాదేశప్రకార మతఁడు నీరా వార్ణానదుల మధ్యప్రదేశమును జయింపగా సుల్తాను సంతుష్టుఁడయి, కొద్దికప్పము గ్రహించి యాభూమిని చంద్రరావునకే జాగిరుగా నిచ్చెను; అంతియే గాక చంద్రరావు సంతానము సప్తపురుషాంతరములవఱకును రాజబిరుదముతో నాప్రదేశమును స్వేచ్ఛగా పరిపాలించుకొనునట్లు లనుగ్రహించెను. ఇవ్విధమున నింబాళకరవంశీయు లగు రావునాయకులు ఫల్టన్ దేశముఖులై, దానిని శాసింపఁజొచ్చిరి క్రమక్రమముగా ముల్లరీ, ముళ్వార, కావసీ, ముధోల్, ఘట్టావయారి మొద లగు తావులందు వివిధమహారాష్ట్రవంశములు తల లెత్తెను. ఆకులమువారును బిజాపూర్ సుల్తాను కార్యములను నిర్వర్తించుచు, నప్పుడప్పుడు తమలోఁ దాము పోరుచుండిరి. జ్ఞాతివైరమును పోలినవిరోధము మఱేదియు లేదు; కావున పర్వతసాంద్రము లగు మహారాష్ట్ర కొంకణదేశములయం దెల్ల

డల నెల్లవేళల గొప్ప గోత్రములవారి నడుమ వైరము కొన్పిం చుచుండెను. విశేషరక్తపాత మయినను, నయ్యది దుర్లక్షణము కాక, సులక్షణమే. వ్యాయామముచే సంధిబంధములు దృఢ పడు నట్లు విపత్తులచేతను, యుద్ధములచేతను జాతీయజీవనబల ములు వృద్ధిఁ జెందెను. ఇవ్విధమున మహారాష్ట్రజీవన ప్రథమ రాగ రేఖలు శివాజీ యుదయించుటకు చాలమునుపే భారతా కాశము నలంకరించెను.

అహ్మద్ నగరసుల్తాను కొలువులో యాదవరావు, భోన్స్లా యను రెండుకుటుంబముల వా రుండిరి. పాలకడలిం బోలు యాదవరావు గోత్రమునకు సరి వచ్చు వంగసము మహా రాష్ట్రమునం దెచ్చట లేదు. దేవగఢలోని ప్రాచీన హిందూ రాజవంశమునుండి యీయన్వయ ముదయించె నని కొందఱు భావించుచున్నారు. భోన్స్లా యన్వవాయము యాదవరావు సంతతివలె నున్నతము కాకపోయినను, మొత్తముమీఁద ప్రధానాభిజనములలో నొకటి. యాదవరావు వంశమునుండి శివాజీమాతయు, భోన్స్లావంగడమునుండి జనకుఁడును సముద్భ వించిరి.

కొంకణదేశమున వానకాలమందు ప్రకృతి బహుభీష ణాకారము దాల్చును; ౧౬౬౩ సంవత్సరమున వసంతసమయ మునం దొక సాయంకాలమున నట్టి భయంకరాకృతి కన్పట్టు చుండెను. సూర్యు డస్తమించకున్నను, ఆకసమునఁ గ్రమ్మి యున్న కాఱుమబ్బులచే లోకమునఁ జీకటులు పర్వుచుండెను; ఎచ్చటను జీవజంతువుల సవ్వడి వినవచ్చుట లేదు; శీఘ్రముగాఁ బ్రచండవాతము విసరున ట్లుండెను. పర్వతముమీది కాలి ద్రోవలు కొంచెముగాఁ గానవచ్చుచుండెను; దూరమందలి మహీధరములు కృష్ణవర్ణము దాల్చుచుండెను; శైలశృంగముల నుండి ప్రవహించు సెలయేళ్లు లొకచో వెండితీగలవలెఁ గన్ప ట్టుచు, వేఱొకచో నంధకారమున లీనములగుచు, కేవలమర్మర ధ్వానముచేఁ దమయునికిని దెలుపుచుండెను.

పర్వతమార్గమున గుఱ్ఱమును వడివడిం దోలుచు నొక యాశ్వికుఁడు పయనము సేయుచుండెను. చెమటతోను నురుఁ గుతోను నిండియున్న తురగమును, బురద చిందిన వానిదుస్తు లను జూడ నతఁడు దూరప్రయాణము చేయుచున్నట్లు బోధ పడును. వాని కుడిచేతిలో నిడివియాఁటెయు, ఒఱలో ఖడ్గము, ఎడమచేతిలో కళ్లెము, భుజమున డాలును ఉండెను. దుస్తులు, పాగా రాజస్థాన దేశీయములు. వానివయస్సు పదునెనిమిది

సంవత్సరము లుండును; శరీరము పసిఁడిచాయ గలిగి, యున్నత
మైనది. పరిశ్రాంతిచేతనో యెండవేడిమిచేత నో గాని ముఖము
కొంచెము నలుపువాఱి యుండెను అట్లని లావణ్య
విహీనమై యుండె ననుటకు వీలు లేదు కన్నులు తేజో
వంతములు. ఆరౌతు హయమునకు విశ్రాంతి యొసఁగ
నెంచి, క్రిందికి డిగ్గి, వాగె వృక్షముపై కి విసరివేసి, బల్లెము తరు
మూలమున నిలిపి, రెండుచేతులతో ముఖమునందలి స్వేదము
దుడిచికొని, నల్లని శిరోజములను వెనుకకు సవరించుకొని,
యించుకతడవు నభోమార్గము విలోకింపఁ జొచ్చెను.

ఆకసము తీరు చాల భయంకరముగా నుండెను. త్వరలో
సుడిగాలి చెలరేఁగు ననుటకు సందియము లేకుండెను. అల్ల
నల్లనఁ బిల్లతెమ్మెరలు వీవసాగెను. నిరంతరతరుశ్రేణులనుండి
గంభీరధ్వని యుప్పతిల్లఁ జొచ్చెను; ఒకటిరెండుసారులు మేఘ
గర్జనము వినఁబడెను; ఎండియున్న వాని పెదవులపై రెండు
వర్షబిందువులు రాలెను. ఇఁక ముందునకుఁ జనుట నేమము
గాదు. ఆకసము నిర్మల మగువఱకును ఎక్కడనో వేచియుండుట
మేలు; కాని యతఁడు పోవుచున్నపని విలంబము నోర్వదు.
వాని బంపిన ప్రభు వేసాకునయినఁ జెవిఁ బెట్టువాఁడు కాఁడు;
అనుచరునకును కాలవిలంబనము చేయుటగాని, సాకులు చెప్పుట
గాని యభ్యాసములేదు కాఁబట్టి యారౌతు మరల
బల్లెము చేపట్టి, యెగిరి సైంధవము మీఁదఁ గూరుచుండి,

క్షణమాత్రము మిన్నువంకఁ జూచి, ప్రశాంతముగా నున్న గిరిప్రదేశము క్రమ్మఱఁ బ్రతిధ్వని లీనుచుండ వాజిని బరుగెత్తించెను.

కొంచెము సేపటికి ఝంఝూవాతము వీవ నారంభించెను. గగనమండలమునం దొక ప్రక్కనుండి మఱియొక ప్రక్కకు విద్యుల్లతలు మెఱయసాగెను; కొండలతో నిండి యున్న యా ప్రదేశము మేఘాడంబరమునకు బహు పర్యాయములు ప్రతిధ్వని చేయుచుండెను; కొండప్రాంతములనుండి చెవులు పగులునట్లు నిర్ఘోషము బయలువెడలఁ దొడఁగెను; సెలయేళ్ళయందలి సలిలము చెలరేఁగి నల్వంకల రాలుచుండెను; మెఱుపుఁదీగల కాంతిచేఁ జాల దూరమువఱకును ప్రకృతిసంబంధమగు నీఘోర పరిణామము దృగ్గోచర మగుచుండెను. నడుమనడుమ పిడుగుఁ జప్పుడుచే భూమి యదరుచు మరల శాంతి నొందుచుండెను. క్రమముగా వర్షధారలు కురిసి పర్వత ప్రదేశమును ముంచివేసెను; నిర్ఝరిణీసముదయము వెగ్గలముగాఁ బ్రవహించెను.

అశ్వారోహి రవంతయు వెనుదీయక జాగరూకతతో నరుగఁ జొచ్చెను. అప్పుడప్పుడు గుఱ్ఱము రౌతునుగూడ వాయువేగమునఁ గొండమీఁదినుండి క్రిందికిఁ గొట్టుకొని పోవునట్టు లుండెను. గాలితాకునఁ జెట్టుగొమ్మలు కొట్టుకొని వాని యుష్ణీషము ఛిన్నభిన్నమై యుండెను. ముఖమునుండి రెండు రక్త

బిందువులు కాఱుచుండెను. అట్లయ్యును, పూనినకార్యము నిలిపి యుంచుటకు వీలు లేకుండుటచే నతఁడు వృథాకాల క్షేపము సేయక, సాధ్యమగునంత వేగముగాఁ బ్రయాణము చేయుచుండెను. రెండు మూఁడు గడియలసేపు వర్షము కురిసిన తరువాత నభోమండలము నిర్మలము కాసాగెను. అంతలో వృష్టి గ్రక్కున నిలిచిపోయెను. అస్తాచల చూడావలంబి యగు జగద్బాంధవుని కాంతియందు గిరియు నవస్నపిత మహీరుహ నివహంబును వింతరంగు లీనుచుండెను.

ఆరోహుండు దుర్గమును జేరి, గుఱ్ఱము నాపి, తడిసి యున్న తలవెండ్రుకలను వదనముమీఁదనుండి యావలకుఁ ద్రోసికొని, క్రిందికి దృష్టి నిగిడ్చెను. కనుచూపుమేరలో రెండుమూఁడువేల యడుగుల యెత్తుగల పర్వతకూటములు కన్నులపండువుగాఁ బ్రకాశించుచుండెను; దట్టముగా నున్న వృక్షములు వర్షమునఁ దడిసి సూర్యరశ్మిలో మెఱయుచుండెను; కొండవాగులు వెల్లివిరిసి, గురుత్వముచే కొండకొమ్మల నుండి ప్రవహించుచు, సూర్యుని బంగరుకాంతియందు మిల మిలలాడుచుండెను; శైలములమీఁదను, శిఖరములమీఁదను మార్తాండరశ్మి నానావిధవర్ణములను దాల్చియుండెను; సెల యేళ్ళపై నింద్రధనుస్సు నాట్యమాడుచుండెను; పవనసంతాడితములై మేఘములు దూరముగాఁ బోయి వర్షరూపమున జాఱుచుండెను.

అతఁడీశోభం గాంచి, క్షణకాల మబ్బుర మొంది, దుర్గము నారోహింప సాగెను. అపుడు సూర్యభగవానుఁ డస్తమించుచుండెను. దుర్గరక్షకులకు త న్నెఱింగించుకొని యతఁడు లోపలఁ బ్రవేశించెను. తోడనే ఝుంఝుణధ్వానముతో దుర్గద్వారము మూసిరి.

కావలివాండ్రు తలుపులు మూసి, వానివంకకుఁ దిరిగి, "సరిగా వేళకు వచ్చినారు; ఇం కొక్కనిముసము జాగయిన యెడల మీ రీ రేయి దుర్గము వెలుపల నుండవలసి వచ్చునదే!" అని పలికిరి.

"అదృష్టమే! ఆనిముసము జా గయినది కాదు! ఏలిక యొద్ద జేసిన బాసను భవానీదేవి యనుగ్రహముచే నిర్వహించితిని. ఇప్పుడే కిల్లాదారుగారికిఁ బ్రభువునానతి తెలిపెదను."

"కిల్లాదారుగారు తమకోస మెదురుచూచుచున్నారు"

వెంటనే యాతఁడు కిల్లాదారుమేడకుఁ జని, వానికి నమస్కారము చేసి, మొలకట్టునుండి కొన్ని కాగితములు విప్పి, చేతి కందిచ్చెను. కిల్లాదారు మావళేజాతివాఁడు, శివాజీకి మిగుల నమ్మక మయినవాఁడు; అతఁడు పత్త్రికలకొఱకు నిరీక్షించుచున్నవాఁ డగుటచే, నయ్యవి చేతికి వచ్చినతోడనే, మనసు నిలిపి వానిని జదువఁజొచ్చెను.

ఢిల్లీచక్రవర్తితో యుద్ధము ప్రారంభమగుటయు, ప్రస్తుతావస్థయు, ననేకవిషయములును కాగితములయం దున్నవి.

కిల్లాదారా యుత్తరములను జదివి, పత్రవాహకునిదెస దృష్టి నిగిడ్చెను; పదునెన్మిది సంవత్సరముల వయస్సు గల వాని ముఖమండలము, విశాలనేత్రములు, నల్లనిశిరోజములును కిల్లాదారునకు విస్మయము గలిగెను. అంత నతఁ డా బాలకుని కాక వయస్కుని దెస మర్మభేద సమర్థ మగు తీక్ష్ణనయనద్వయము ను బ్రసారించి, "హవల్దార్, నీపేరు రఘునాథజీ! నీవు రాజపుత్రుఁడవా?" అని యడిగెను

రఘునాథుఁడు వినయముతో శిరము వాంచి ప్రశ్నలకు బదులు చెప్పెను.

"చూపులకు నీవు చిన్నవాఁడవు. కాని పనివచ్చినపుడు మాఱుమొగము పెట్టవని తోఁచుచున్నది."

"చిత్తము, ప్రయత్నలోప ముండదు, కార్యసిద్ధిమాత్రము భవానీదేవియనుగ్రహము ననుసరించి యుండును."

"సింహగడ దుర్గమునుండి తోరణదుర్గమున కింత త్వరగా నెట్లు రాఁగలిగితివి?"

"ప్రభుసన్నిధియందుఁ జేసిన ప్రతిజ్ఞనుబట్టి"

ఈప్రత్యుత్తరమునకు సంతసించి, కిల్లాదారు మందహాసముతో "ప్రయత్నమందలి పట్టుదలను నీయాకారమే చాటుచున్నది," అని పలికెను. రఘునాథుని దేహము తడిగానే యుండెను, ఫాలమున చిన్నగాయము కాన్పించుచుండెను.

సింహగడ, పూనాలను గూర్చియు, మొగలు మహారాష్ట్రరాజపుత్రులస్థితిని మొత్తమును గూర్చియు కిల్లాదారు చేసిన ప్రశ్నలకు రఘునాథుఁడు తగుసమాధానము చెప్పెను.

"అలాగయినచో రేపటియుదయమున నాసన్నిధికరమ్ము ఉత్తరములు మొదలగునవి సిద్ధముగా నుండును. శివాజీప్రభువుతో "దేవరవారు పంపిన హవల్దారు కష్టకార్యములకుఁ దగిన వాఁడే!" అని విన్నవింపుము. ఈప్రశంసా వాక్యమునకు రఘునాథుఁడు శిరస్సు వంచి కృతజ్ఞతా పూర్వక వందనము సమర్పించి, అనుజ్ఞ దీసికొని వెడలిపోయెను.

కిల్లాదారు శివాజీకి పరమరహస్యము లగు రాజకీయ వృత్తాంతములు దెలుపవలసి యుండెను. అతఁడు రఘునాథు నంతగాఁ బరీక్షించుటకుఁ గారణమిదియే. ఆవార్తలు పత్రికాముఖమునఁ దెలుప వలనుపడదు; కాకితములు శత్రువులచేతులలోఁ బడునేమో. రఘునాథునకావిషయములు చెప్పవచ్చునా యనియు, లంచములచేతఁ గాని మఱే యితరోపాయముచేత గాని యితఁడు శత్రువశవర్తియై, రహస్యములు వెలిబుచ్చుట సంభవించునా యనియు యోచించుచున్న కిల్లాదారు, రఘునాథుఁడు నిష్క్రమించినతోడనే మందహాసముతో, "ఇట్టివానిలో శివాజీ మహాపండితుఁడు, నిక్కముగా నక్కఱకు వచ్చువానినే పంపినాఁడు," అని తనలో ననుకొనెను.

రఘునాథుఁడు కిల్లాదారును వీడ్కొని, భవానీ మందిరాభి
ముఖుఁడై చనుచుండెను. ఈదుర్గమును జయించిన యనతికాల
మునకే శివాజీరాజు భవానీమూర్తి నొకదాని నచ్చటఁ బ్రతి
ష్ఠించి, అంబీర్ దేశీయుఁడగు బ్రాహ్మణుని రావించి, దేవీసేవ
యందు నియోగించెను. యుద్ధసమయములందు శివాజీ యీ
దేవిని బూజింపక యేపనిలోను బ్రవేశించువాఁడు కాఁడు.

రఘునాథుఁడు తడిసిన వెంట్రుకలను సిదుర్చుకొనుచు,
యావనోచితమగు నుల్లాసముతో మృదుస్వరమున రణగీతముఁ
బాడుచు మందిరమును జేరెను. అప్పు డచ్చట పురోహితుఁడు
లేకుండుటచే రఘునాథుఁడు చెంగటనున్న పూఁదోట కరిగి,
చెట్టుక్రింది రాతిబండమీఁదఁ గూర్చుండి, సేదదేరుచుండెను.

సంజవేళ నుద్యానమునఁ బుష్పములు గోయ వచ్చి
యున్న కన్నియ కంటఁ బడఁగా, నతఁడు మిగుల నచ్చెరు
వొందెను; మహారాష్ట్రకన్య కాదు; వేష భాషలనుబట్టి రాజ
స్థానదేశీయ యని స్పష్ట మాయెను. బహుకాలమునకు తన
దేశపు బాలను గాంచుటచే వాని హృదయ ముప్పొంగెను.
ఆమెసమీపమున కరిగి సంభాషింప వలె నన్న కోర్కె జనించి
నను, రఘునాథుఁ డాయభిలాష నణచుకొని, యథాస్థానమ్ము

నుండియే యామెను జూడసాగెను; చూచిన కొలది వాని హృదయ మాదిక్కునకే పరుగెత్తఁ జొచ్చెను.

కన్నియకు రమారమి పదునారు సంవత్సరము లుండును. పట్టును బరిహసింపఁ జాలిన యామె సిగశిరోరుహములు చెక్కిళ్ళమీఁదను, వీపుమీఁదను వ్రేలాడుచుండెను; నేత్రము లపూర్వకాంతుల నీనుచుండెను; కుంచెతో వ్రాసినట్లు కనుబొమలు చక్కని వంపుతో లలాటమున కెంతయు వన్నె వెట్టుచుండెను. ఆమె పెదవులు చిన్నవి ఎఱ్ఱనివి. సుందరపు చేతుల బంగారు కడియములు ప్రకాశించుచుండెను; కంఠసీమలో హారము వేలుచుండెను. ఆరాజపుత్రకుమారిని జూచిన కొలది రఘునాథుని మానసము సంచలింప సాగెను.

*

ఆమె కుసుమములు గోసి గృహమునకు మరలుచున్న సమయమున సమీపమున దీర్ఘకాయుఁడగు తరుణుఁడు తనక్రేవ తెప్ప వాల్చుక చూచుచుండుట కంటఁ బడగా, సిగ్గున మోము వాంచి, క్రమ్మఱ కన్నెత్తి వాని నవలోకించెను. అతఁడప్పటికి నదీతీరున నిలిచియుండెను; నల్లని వెండ్రుకల గుత్తులు వాని ముఖబింబముపైఁ గొంచెముగా వాలియుండెను; కోశమున ఖడ్గము, దక్షిణహస్తమున నిడివిబల్లెము నుండెను. బహుకాలమునకు స్వదేశీయయోధ నొకని మహారాష్ట్రదేశమున వీక్షించి, రాజపుత్రకుమారి తొలుఁదొల్త నబ్బుర

మొందెను; ఆతఁడు వాని యాకారమునకు సంచలించి యామె ననుమానమునుద్రేకమును గొని మాహావమునకుఁ జనెను

పిమ్మట రఘునాథునకుఁ దెలివి వచ్చెను. చింతామగ్నుఁడయి యతఁడు పురోహితుని దర్శించుటకు దేవాలయమునకు మెల మెల్లన నేగి, వానికోసము నిరీక్షించుచుండెను

పురోహితుఁడు అంబీర్ దేశీయుఁడగు బ్రాహ్మణుఁడు; నామధేయము జనార్దనదేవుఁడు సుప్రసిద్ధుఁడును, అంబీర్ ప్రభువు నగు జయసింహుని సభ్యులలో నితఁడొకఁడు. శివాజీ మిగుల బలవంత పెట్టుటచేత, జయసింహుని యనుమతి చొప్పున జనార్దనదేవుఁడు తోరణదుర్గమునకు విచ్చేసెను. ఆయనకు సంతానము లేకపోయినను, స్వదేశమును విడుచుటకు, గొంచెము ముందుగా నతఁడొక క్షత్రియకన్యను బోషించు భారము తనపై వేసికొనెను. ఆమె తండ్రి జనార్దనుని యాబాల్యస్నేహితుఁడు; ఆమె తల్లియు జనార్దనుని భార్యను అక్కా యని పిలుచుచుండెడిది. బాలికజననీజనకులు మృతి నొందగా, నిస్సంతానుఁడగు జనార్దనుఁడును, తత్పత్నియు క్షత్రియ బాలికను సంరక్షింపఁ దొడఁగిరి. తరువాత వారు తోరణదుర్గమున కేతెంచిరి.

పిదప జనార్దనుని భార్య కాలధర్మము నొందెను. వృద్ధునకు నరయూ బాలకంటె వేఱొండు స్నేహభాజనము లేకుం

డెను. సరయూబాల వానిని జనకునివలెఁ బ్రేమించుచు, నాలా గు
నసే సంబోధించుచుండెను. కాలక్రమమున నామె నిరుపమాన
సౌందర్యవతి యాయెను. దుర్గములోని కోపిద్బ్రాహ్మణు
లెల్లరు జనార్దనుని కణ్వముని యనియు, తత్పాలితకన్యను
శకుంతల యనియు పరిహసించుచుండిరి. అతఁడును కన్యా
సౌందర్యమును, ఆమెకుఁ దనయెడఁ గల యనురాగమును గని
సంతుష్టుఁడయి, రాజస్థానమును విడిచి వచ్చిన దుఃఖమును
మఱచిపోయెను.

రఘునాథుఁడు కొంతతడవు నిరీక్షించిన పిమ్మట
జనార్దన దేవుఁడు దేవీమందిరములోఁ బ్రవేశించెను. అతని
కేబదిసంవత్సరము లుండును; శరీరము పొడవుగాను దృఢము
గాను; వక్షస్థలము విశాలముగాను, బాహువులు దీర్ఘములు
గాను ఉండెను; నేత్రములయందు శాంతరసము చిప్పిల్లు
చుండెను. శరీరము బంగారుకాంతితో నొప్పుచుండెను. భుజ
ముపై యజ్ఞోపవీతము వ్రేలాడుచుండెను. జనార్దనుఁ డాలయ
ములోనికి వచ్చుట విలోకించి, రఘునాథుఁడు సంభ్రమముతో
కూరుచున్న చోటినుండి లేచెను.

సంక్షేపముగా స్వాగత మడిగినతరువాత జనార్దనుఁడు
శివాజీయనామయము నడుగగా రఘునాథుఁడు తగునుత్తర
మిచ్చి, యుద్ధమును గుఱించి తనకుఁ దెలిసినంతమట్టుకు
వృద్ధునితోఁ జెప్పి శివాజీప్రణామము నెఱింగించి, బ్రాహ్మణుని

చేతిలో బంగరుపుటుంగరము నిడి, "ఇప్పుడు ప్రభువుగారు యుద్ధముచేయనున్నారు; కావున వారికి జయము కలుగుట కయి మీరు భవానీదేవిని బూజింపవలెను. దేవీప్రసాదము లేని మనుష్యప్రయత్నములు నిష్ప్రయోజనములు. ఈలాగున రాజుగారు మీకు విన్నవింపుమని నాకానతి యొసంగినారు" అని పలికెను.

జనార్దనుఁడు నిసర్గగంభీరస్వరముతో నిట్లనెను. "వనాతన హిందూధర్మరక్షణార్థము మాబోంట్లు నిరంతర కృషి చేయవలెను. ధర్మమునకుఁ బ్రాకారస్వరూపముగా నున్న శివాజీ ప్రభువునకు జయము కలుగుటకయి తప్పక దేవీపూజ చేసెదను. ఈ సందర్భములో నెంతమాత్రము లోపము జరుగదని మహానుభావున కెఱిఁగింపుము."

"మఱియొక ప్రార్థన గలదు. వారు మహాయుద్ధమునఁ బ్రవేశింపఁ బోవుచున్నారు కావున నందలి ఫలాఫలములు ముందుగానే తెలిసికొనఁ గోరుచున్నారు. దూరదర్శులగు మిముబోటి దైవజ్ఞులు ఈవిషయములో ముఖ్యముగా వారి కోరిక చెల్లింపఁగలరు." అని రఘునాథుఁడు పలికెను.

జనార్దనుఁ డొక్కింతసేపు కన్నులు మూసికొనియుండి, పిదప గంభీరవాక్కుతో, "రాత్రివేళ, దేవీసాన్నిధ్యమున శివాజీప్రార్థన విన్నవించెదను. ప్రాతఃకాలమునఁ బ్రత్యుత్తరము తెలిసికొందువు" అని వచించెను.

అభివాదనము చేసి రఘునాధుఁడు వెడలిపోవ నుండ, జనార్దనుఁడు వాని నుద్దేశించి "ఇంతకుఁ బూర్వము నీ వీదుర్గమునకు వచ్చినట్లు కనఁబడదు; ఇదేనా ప్రథమాగమనము?" అని ప్రశ్నించెను.

"చిత్తము, ఈనాఁడే వచ్చినాను."

"దుర్గములో నెవ్వరితోనయినఁ బరిచయమున్నదా? ఉండుటకు తావు కలదా?

"పరిచితులు లేరు, క్రొత్తవాఁడను; రాత్రి యెక్కడనో తల దాచుకొని, ప్రభాతమున వెడలిపోవుదును."

వృథా క్లేశము నేల యనుభవించెదవు?"

"ఏలిక యనుగ్రహముండగా నా కే క్లేశము కలుగఁబోదు. మాబోంట్లు రాత్రు లీలాగుననే గడపవలసియుండును.

"వత్సా, యుద్ధసమయమందు కష్ట మనివార్యము, కాని యిప్పుడు నీవు శ్రమపడవలసిన పని లేదు. ఇచ్చటనే యుండుము. నా పెంపుడుఁగూతురు నీకు భోజనము పెట్టును. రాత్రి విశ్రమించి, దేవ్యాజ్ఞను తెల్పు శివాజీసన్నిధికిఁ గొనిపోవుదువు గాని."

ఆకస్మికముగా రఘునాధుని హృదయ ముప్పొంగెను, తొమ్ముపై నెవ్వరో మోదినట్లాయెను. అయ్యది వేదనయా? సంతోషపారవశ్యమా? జనార్దనుని పెంపుడుఁగూతు రెవ్వతె? ఆరామములోఁ గాన్పించిన రాజపుత్రకుమారి కాదుగద!

రేయి జాముప్రొద్దు పోవునప్పటికి సరయూబాల తండ్రియానతి చొప్పున నతిధి కాహారము సిద్ధముచేసెను. రఘునాథుఁడు భుజింపఁ గూరుచుండెను, సరయూబాల వానివెనుక నిలిచి యుండెను. ఆహారాతునకు నిజకుటుంబమునందలి రమణిచే భోజనము పెట్టించునాచార మిప్పటికిని మహారాష్ట్రమునఁ గలదు.

రఘునాథుఁడు భుజింప నారంభించెనే కాని వాని చిత్తము చలించుచుండెను. సరయూబాల శ్రద్ధాపూర్వకముగా వివిధఖాద్యములు నాయత్తపఱచి యుంచినను, తా నేమి తినుచుండెనో వాని కెఱుక లేదు. కౌతూహలముతో జనార్దనుఁడు రాజస్థానవృత్తాంతములు జెప్పుచుండెను. రఘునాథుఁడు నడుమ నడుమ నసంబద్ధముగా మాటలాడుచు, నన్యమనస్కుఁడై యుండెను.

భోజనము మయినతోడనే శ్వేతశిలావిర్మిత మగు పాత్రలో మంచిషర్బత్ వేసి సరయూబాల వానికిచ్చెను. అతఁ డాపాత్రవాహకురాలివంక సోద్వేగచిత్తుఁ డయి చూపులు ప్రసారించెను. అయ్యెడ నాల్గుకన్నులు కలసినవి! ఆమె ముఖమండలము లజ్జచే నెఱ్ఱవాఱెను. అంతట నామె మొగము వాంచి యావలకుఁ జనెను. రఘునాథుఁడును ఇంతిం తనరాని సిగ్గుతో సవనతవదనుఁ డాయెను.

వా స్త్రప్రక్షాళనార్థము సరయువు సలిలము గొనివచ్చెను. రఘునాథుఁడు దరసికుఁడు కాఁడు; ఈ పర్యాయము మొగము పై కెత్త లేదు. స్వర్ణకంకణవిభూషిత మగు నామెహ స్తము మాత్రము వాని కగపడెను. రఘునాథుఁడు నిట్టూర్పునిడెను.

వానికి పక్క వేసినది. కాని యాతఁడు శయనింప లేదు అల్లన ద్వారము దెఱచి చుక్కలవెలుతురులో పూఁదోఁట యందు విచరింపఁ జొచ్చెను.

నక్షత్రవిభూషిత మగు నభోమండలము దెస యప్పు వాల్చక చూచుచు నాతరుణయోధ యేమి చింతించుచు న్నాఁడు ? క్రమముగాఁ జీకటి దట్టము కాఁదొడఁగెను. అట్టి యెడ లోక మంతయు నిద్రావస్థయం దుండెను; కావలి వాండ్ర కంఠధ్వనిమాత్ర మప్పుడప్పుడు వినవచ్చుచుండెను; జాముజామునకు మోగు ఘంటారవముచే పర్వతము ప్రతి ధ్వనులు చేయుచుండెను. రఘునాథుడు నిద్ర మాని యేమి చింతించుచున్న వాఁడు ?

నేడు తా నాయుద్యానమునం దేల సంచరించుచున్నాఁడో వానికిఁ దెలియదు. నేటివఱకును రఘునాథుఁడు బాలుఁడే, కాని యాకస్మికముగా నీరోజున వాని శాంతజీవితా కాశమున నూతనద్యుతి వ్యాపించినది; వాని మనోవృత్తులు విజృంభించినవి. ఆనందమయ మగు నా రాజపుత్రకుమారీ మూర్తి వానిమానసమున పల్మాఱు మెలఁగజొచ్చెను. అకం

దోయి, ఆమధురాధరము, ఆనిబిడకేశపాశము, ఆసుందరని హస్తములు, ఆవిశాలలోచనములు, ఆలావణ్యము వానికన్నులకుఁ గట్టినట్లుండెను. రఘునాథుఁడు నింగిచాయఁ జూచి చూచి, గుండెలపై రెండుచేతులు వైచుకొని, ఏమేమో తలపోసెను.

అటుపిమ్మట రఘునాథుఁ డెట్లో మనస్సు కుదుర్చుకొని, మందిరమునకు మరలెను. మార్గమధ్యమున హారము గాన్పించుటయు, రెండు ముత్తెములతరువాత పవడముచొప్పున గ్రుచ్చి యున్నదాని నతఁ డానవాలు పట్టెను. సాయంతనమున సరయూబాలకంఠసీమయం దాసరము వ్రేలుచుండెను; ఆమె యజాగ్రతచే నది జాఱియుండును. దానిని గ్రహించి, రఘునాథుఁ డాకసముదిక్కు మొగంబై, "దైవమా, నాయాశ ఫలించుటకు మొదటి శుభసూచకమా యిది?" అని పలికెను.

తరువాత హారమును మెడలోఁ దాల్చి, రఘునాథుఁడు నిదురవోయెను; మఱునాటి యుదయమున మెలకువ వచ్చునప్పటికి జనార్దనదేవుఁ డేగుదెంచి, "మ్లేచ్ఛులతోడి యుద్ధమున విజయము, స్వజాతీయులతోడి సంగ్రామమున పరాజయము" అని నుడివెను.

దుర్గమును విడుచుటకు ముందుగా రఘునాథుఁడు సరయూబాలను సందర్శించెను. వెనుకటితీరున సరయూబాల

పూఁదోటలోనికిఁ బుష్పములు గోయ నేగినప్పుడు రఘు నాథుఁడు గూడ మందమందముగా నచ్చోటికి కరిగి, హృదయో ద్వేగము నడచుకొని, వడకుచున్న కంఠధ్వనితో, "భద్రసురాలా, రాత్రి యీయాహారము నాకిచ్చుట దొరకినది, దీనిని మీకీయ వచ్చితిని. అపరిచితుని చొరవ మన్నింప వలెను" అని వాక్రుచ్చెను.

ఈవినయవాక్కుల నాలకించి సరయువు నెనుదిరిగి చూడ నాప్రాయపుజోదు ప్రత్యక్షమాయెను. అప్పు డామె వదనము హ్రీంభరమున రక్తిమం దాల్చెను. రఘునాథుఁడు ధైర్య మవలంబించి క్రమ్మఱ నామెతో, "ఆ రాత్రి యయ్యానేని యీయాహారమును యథాస్థానమున నుంచెదను. మీకు భగ వానుఁడు సుఖము నిచ్చును." అని వచించెను.

సరయూబాల హృత్కంపముతో నొకసారి రఘునాథుని మోము వీక్షించుటయు, విశాలలోచనముల తేజఃపుంజము తనపైఁ బ్రసరించుటచే నతనిగుండెలు తటతట గొట్టుకొనెను; సిగ్గు మల్లడిగొన నామెయుఁ జూడ్కులు నేలవైపునకే వాల్చెను. అంగీకారలక్షణము కాన్పించుటచే రఘునాథుఁడు చంచల హస్తములతో ముత్తెములదండను యథాప్రదేశమున నునిచెను. ఆమె గాత్రమును స్పృశింప లేదు.

క్షణానంతర మతఁడు సరయువుతో, "ఇక నతిథికి సెల వీయవలెను" అని పలికెను. ఈపర్యాయ మామె సిగ్గును

తో ట్రసపాటును కొంతమట్టుకు తగ్గునడచుకొని, వాని యాస నము వీక్షించి, మరల దృక్కులు క్రిందకు మరల్చి, యవ్యక్త మధురస్వరముతో, "మీయనుగ్రహము లభించినది. తిరుగ దుర్గమునకు విచ్చేసినపుడు మా నాయనగారి మందిరమునకు దయచేయుదు రని నమ్ముచున్నాను" అని నుడివెను.

దప్పిచే వగచుచున్న వానకోయిలను ప్రథమవృష్టి బిందువు వోలెను, చీకటిలో త్రోవ దప్పిన పాంథుని రాగ రేఖల వలెను, సరయూబాల వచించిన యీతొలిపలుకులు రఘు నాథుని మానసమును సుధాప్రవాహమున జలకమాడించెను. అంతట రఘునాథుఁ డామెతో "భద్రురాలా, నేను పరదానుఁ డను, యుద్ధమే నాకు జీవనోపాయము. ఎన్నిటికయిన నిచ్చటికి రాఁగలనో లేనో తెలియదు. కాని నేను బ్రదికియున్నంత కాలము మీసౌజన్యము, సపర్య, న్వరూపము మఱపునకు రావు" అని చెప్పెను.

సరయూబాల మాఱుమాటాడలేక పోయెను; చూడగా నామె విశాలనేత్రములనుండి బాష్పబిందువులు రాలు చుండెను. వాని నయనములందును నీరు గ్రమ్మెను.

కొన్నిసంవత్సరములనుండియు శివాజీ దినదినాభివృద్ధి నొందు చున్నను, ఢిల్లీచక్రవర్తి యతనిని లోపఱుచుకొనుటకు ౧౬౬౦ సంవత్సరమునకు పూర్వము విశేషప్రయత్నము చేసినవాఁడు కాఁడు. ఆసంవత్సరమున సయిస్తఖాన్ "అమీర్ ఉల్-ఉమ్రా" అను బిరుదుతో దక్షిణ సుబాదారుగా నియమింపఁబడి, శివాజీని పరాభవింపఁ జక్రవర్తిచే నాజ్ఞాపింపఁ బడియెను. సయిస్తఖాన్ ౧౬౬౦ హాయనమున పునే, చాకణ్ దుర్గము లను మఱికొన్ని ప్రదేశములను వశపఱుచుకొని, మఱునటియబ్ద మున శివాజీని నిర్మూలింప నిశ్చయించెను. ఢిల్లీశ్వరుని యానతి చొప్పున మార్వాడ్ రాజు జస్వంతసింగు వత్సరమున ససైన్య ముగా వచ్చి సయిస్తఖానును గలిసికొనెను; కావున శివాజీ విపత్తులకు మేర లేకుండెను. మొగల్ రాజపుత్ర సైన్యములు పూనానగరసమీపమున శిబిరములు సంస్థాపించెను; సయిస్త ఖాన్ దాదాజీ కొణదేవుని మందిరమున, అనఁగా బాల్యకాల మున శివాజీ తల్లితో నివసించినహర్మ్యమున విడిసెను. అతఁడు శివాజీ నేర్పరితనమును జక్కఁగా నెఱిఁగియున్నవాఁడు, కావున మహారాష్ట్రుఁ డెవ్వఁడును అనుజ్ఞాపత్రిక లేకుండ పూనానగర ములోఁ బ్రవేశింపరా దని యాజ్ఞాపించెను. పూనానగర సమీ పమం దున్న సింహగడదుర్గమున శివాజీ సైన్యసమేతముగా

నుండెను. మహారాష్ట్రు లిప్పటికిని యుద్ధవ్యవసాయమున నాటి తేర లేదు; సుశిక్షితము లగు ఢిల్లీబలములతో సమ్ముఖయుద్ధము చేయుట యెట్లయినను పొసగదు. కావున స్వాతంత్ర్యసంరక్షణార్థము శివాజీకి బుద్ధిబలముకంటె వేఱొండుమార్గము లేకుండెను.

చైత్రమాసపుఁ గడపటిదినములలో రాత్రివేళ పరాక్రమశాలి యగు మొగల్ సేనాపతి సయిస్తఖాను తనమంత్రులతోఁ గూడఁ గొలువుదీరి యుండెను. నల్దిక్కుల దీపములు జాజ్వల్యమానములు. హర్మ్యపవనమునందలి ప్రసూనసౌరభమును హరించి గంధవహుఁడు జాలమార్గమున లోనికేతెంచి యెల్లరను బులకితగాత్రులఁ జేయుచుండెను. చీఁకటిలో నక్షత్రములు మాత్రము మినుకు మినుకు మనుచుండెను.

శివాజీని పరిభవించునుపాయ మాసభయందు చర్చకు వచ్చెను. అన్వరీ యను చాటుకారుఁడు "మన సేనయెదుట మహారాష్ట్రసేన పెద్దగాలియెదుట నెండుటాకులవలె నాశనమున కెగిరిపోవును; బెదరిపోయి భూమిలోనైన దాగును" అని నవ్వెను.

దాదాపు సంవత్సరమునుండి మహారాష్ట్రుల బలవిక్రమముల నవలోకించుచున్న వృద్ధసైనికుఁడు చాంద్‌ఖాన్ "వారికి రెండుసామర్థ్యము లున్న వని నాయభిప్రాయము" అని మెల్లగా ననెను.

సయిస్త ఖాన్ "ఎందుచేత?" అన్నాడు.

చాంద్ ఖాన్ "గత సంవత్సరము కొందఱు మహారాష్ట్రులు చాకణ్ దుర్గములోఁ బ్రవేశించినప్పుడు మన బలములన్నియు రెండుమాసములు మహాప్రయత్నముచేసి, యాదుర్గమును స్వాధీనముచేసికొన్న విధము దేవర వారిజ్ఞప్తియందుండవచ్చును. ఒకదుర్గమును జయించునప్పటికే చాలమంది భటులు నశించినారు. ఈవత్సరము మనసేనలను దేశమునందచ్చటచ్చట నిలిపియుంచినను, నేతాజీ యాకాశమార్గమున నెగిరిపోయి అహ్మద్ నగర్, ఔరంగాబాద్ వఱకును దేశమును మల మల మాడ్చినాఁడు," అని పలికినాడు.

సయిస్త ఖాన్ "చాంద్ ఖాన్ పెద్దవాఁడే! ఇప్పుడు కొండయెలుకను జూచి బెదరుచున్నాఁడా? పూర్వ మతనికీభయము లేదే?" అప్పటికి వానివదనము జేవురించెను, కాని మాటాడలేదు.

"జాహాపనా చక్కఁగా సెలవిచ్చినారు. మహారాష్ట్రులు మూషికవిశేషములు కొండయెలుకలవలె వారు బొఱియలలో దూఱియుండగలరు," అన్నాఁడు అన్వర్.

"కొండయెలుకలు పూనానగరముక్రింద రంధ్రము త్రవ్వి ప్రవేశించి యావలకుఁ బోవకున్న మనగతి యేమగునో!" అన్నాడు చాంద్ ఖాన్.

సయిస్తఖాన్ "ఇక్కడ వేలకొలది ఢిల్లీపిల్లు లున్నవి. మూషికము లేమియుం జేయనేరవు." అన్నమాటలకు సభా సదులెల్ల 'కేరామత్, కేరామత్' అని యఱచిరి.

మహారాష్ట్రులనుగూర్చి వివిధ ప్రసంగములు జరిగినతరు వాత యుద్ధక్రమము నిర్ధారణ సేయంజొచ్చిరి. చాకణ్ దుర్గము పట్టువడినది మొదలుగా సయిస్తఖాన్ తలంపు మాఱిపోయెను; దుర్గములను ముట్టడించుటవలన శీఘ్రముగా జయము సమకూడ దను నభిప్రాయము వానిమనస్సులో గాటముగా నాటుకొనెను.

"జాహాపనా, దుర్గము లే మహారాష్ట్రులకు పట్టుగొమ్మలు. వారెన్నడును సమ్ముఖ యుద్ధమునకు రారు; ఒకవేళ వచ్చి యోడినను వారికి వి శేషనష్టముండదు; దేశము పర్వతమయము; వారిసేన యొకచోటినుండి వేఱొకచోటికి పాఱిపోవు మార్గము మనము కనిపట్టలేము. కాన యొక్కటొక్కటిగా దుర్గములనెల్ల లోబఱచు కొందుమేని వారలు తప్పక ఢిల్లీకి లొంగవలసి యుండును," అని చాంద్ఖాన్ పలికినాఁడు

సయిస్తఖాన్ "ఏమి! యుద్ధములో నోడిపోయి మహా రాష్ట్రులు పలాయనము చేయునప్పుడు మనము వారిని దఱుమ లేమా? మనకు గుఱ్ఱపుదళమున్నదికదా; ఆదండు మహారాష్ట్రు లను ధ్వంసము చేయలేదా?"

"యుద్ధము జరిగినపక్షమున మనకు జయము తప్పదు; వెంటం బరుగెత్తంగలమేని మహారాష్ట్రులను నాశము చేయు

దును; దానికి సందేహము లేదు. కాని, యీపర్వతప్రదేశ
మున వారల వెన్నంటి పరుగెత్తి పట్టుకొనుపాటి రేవంతులు
హిందూస్థానములో లేరు. మనగుఱ్ఱములు పెద్దవి; అశ్వికులు
వివిధాయుధములు దాల్చువారు; సమభూమిపై మనవారి
నెదుర్కొనుట యెవ్వరికిని సాధ్యము గాదు. ఈకొండనేలమీద
మనయశ్వములు నడచుటయే కష్టము; మహారాష్ట్రుల చిన్న
గుఱ్ఱములు మేకలవలె నవలీలగా పర్వతముల నెక్కును; లేళ్ళ
వలె వాగులను పొదలను దాటును. జాహాపనా, నావాక్యము
లవధరింపుఁడు. శివాజీ సింహగడ్ దుర్గములో నున్నాఁడు.
ఆకస్మికముగా మన మాదుర్గమును ముట్టడిచేయుదుమేని
యొకటిరెండు మాసములలో నది మనకు స్వాధీన మగును,
శివాజీ బంది యగును, ఢిల్లీకి జయము సిద్ధించును. అట్లు
కా దేని, యీప్రదేశమున మహారాష్ట్రులకోసము నిరీక్షిం
చుచుఁ గూరుచున్న నేమి కాఁగలదు? వారిని తఱిమినను
నేమి లాభము? విలోకింపుఁడు: నేతాజీ యనాయాసముగా
మనదగ్గఱనుండి తప్పించుకొనిపోయి అహ్మదనగర్ నౌరంగ్
ఆబాద్ వఱకును దేశము కొల్లగొట్టినాఁడు. వానివెంటఁ బడిన
రుస్తుమ్ జమాన్ ఏమి చేసెను?"

నయిస్తఖాన్ క్రోధముతో "రుస్తుమ్ జమాన్ ద్రోహ
ము చేసినాఁడు, బుద్ధిపూర్వకముగా వానిని పోనిచ్చినాఁడు.
నేను వానికిఁ దగిన శిక్ష విధించెదను. చాంద్‌ఖాన్, నీవుగూడ

బహిరంగయుద్ధము వల దనుచున్నావు! ఢిల్లీశ్వరుని సైనికు లలో సాహసికుడు లేఁడా!" అన్నాడు.

చాంద్ ఖా నుమొగము మరల నెఱ్ఱవడెను. పరాఙ్ముఖుఁడై యతఁడు కంటఁ గ్రమ్మిన యశ్రుకణము దుడుచుకొని సేనాపతి వెనకుఁ దిరిగి, "దేవరవారి కాలోచన చెప్పుట కేవల మసాధ్యము. సేనాపతిగారు యుద్ధక్రమమును నిర్దేశింతురు గాక. ఆనతిచొప్పున నడచుట కీసేవకుఁడు పెడమొగము పెట్టఁడు" అని పలికెను.

ఇయ్యవసరమున సేవకుఁ డరుదెంచి, సింహగడదుర్గము నుండి మహాదేవజీ న్యాయశాస్త్రి యను బ్రాహ్మణదూత వచ్చి క్రింద నిరీక్షించుచున్నాఁ డని వార్తఁదెచ్చెను. నయిస్తఖాన్ ఆయనకొఱకుఁ బ్రతీక్షించుచున్నవాఁడు; కావున దూతను సభాభవనమునకుఁ గొనిరా నాజ్ఞ యొసగెను. ఎల్లరు రాయబారిని జూడ నుత్సుకులై యుండిరి.

అంతట మహాదేవజీ న్యాయశాస్త్రి సభాసదనము బ్రవేశించెను. ఆయన కొంచెము పొట్టివాఁడు; శరీరము నలుపు గాను, ముఖము సుందరముగాను, వక్షస్స్థలము విశాలము గాను, బాహువులు పొడవుగాను ఉండెను. నేత్రములు తీక్ష్ణ బుద్ధిని సూచించుచుండెను; వదనమున చందనపుబొట్టు నిడుపుగా నుండెను. దూదిచొక్కా తొడుగుకొని యుండుటచేత మేనితీరు స్పష్టముగా నగపడుట లేదు. తలమీఁది పెద్దపాగా

నీడలో మొగము మఱుగునకి యుండెను. సయిస్తఖాన్ దూతను సాదరముగాఁ గూరుచుండఁ బెట్టి, "సింహాగడవార్త లేమి?" అని యడిగెను.

మహాదేవజీ యీక్రిందిశ్లోకమును జదివెను:

వస్తి నద్యో దణ్డకేషు తథా పఞ్చవటీవనే;
సరయూవిచ్ఛేద దుఃఖం రాఘవ స్తు కథం న హేత్ ?

సింహాగఢ మొదలగు దుర్గము లనేక మున్నను పూనా మీచేతఁ జిక్కినది; శివాజీప్రభువు తద్వియోగసంతాపము నెట్లు మఱచును? అని భావము.

సయిస్తఖాను సంతుష్టుఁడయి "ఔను, ప్రధానదుర్గమును వశపఱచుకొన్నాను. ఇప్పుడు వారు యుద్ధముచేయుట వలన లాభములేదు; ఢిల్లీశ్వరునకు లొంగినచో నిప్పటికిని కొంచెము మేలు కలుగును. ఇట్లని మీప్రభువుగారితోఁ జెప్పుఁడు." అనెను.

మందహాసముతో బ్రాహ్మణుఁడు మఱియొకశ్లోకము చదివెను:

న విజ్ఞాపయితుం శక్తః స్వాభిలాషం హి చాతకః
జ్ఞాత్వా తు తం జలధరః పరితోషయతి యాచకన్

పూనా చాకణ్ దుర్గములను గోల్పోయి మా రాజుగారు సంధి వేఁడుటకుఁగూడ లజ్జించుచున్నారు; కాని తమ

వంటిపుణ్యపురుషులు నాకిమనోరథము గ్రహించి, యనుగ్రహ పూర్వకముగా నేదియొసగిన దానిని పరిగ్రహింతురు అని తాత్పర్యము.

నయిస్తఖాను సంతోషము పట్టలేక "పండితజీ, మీపాండిత్యమునకు నే నెంత సంతోషించితినో చెప్పజాలకున్నాను. ఓహో! మీసంస్కృతభాష యెంత మనోహరమయినది! ఎంత భావగర్భిత మయినది! నిజముగా శివాజీగారు సంధి నపేక్షించుచున్నారా?" అని యడిగెను.

మహాదేవజీ :

మృగరాజప్రతాపేన భయసంక్షుబ్ధచేతనః
త్రాహి! దేవ, త్రాహి రాజ న్నితి ధావన్తి భూచరాః

మీదోర్దండప్రతాపమును సైచ లేక వెఱచి మే మెల్లరము "త్రాహి, త్రాహి" యని మొత్తుకొనుచున్నాము అని యభిప్రాయము.

మరల నానందము పట్టనేరక నయిస్తఖాన్ మహాదేవజీని జూచి, "బ్రాహ్మణుఁడా, మీశాస్త్రాలోచనమునకు సంతుష్టిఁ జెందితిని. ఇప్పుడు మీరు సంధిప్రస్తావన దెచ్చుచున్నారు గదా. శివాజీ మిమ్ముఁ బంపినట్లు నిదర్శన మే మయిన నున్నదా" అనియెను

అంతట బ్రాహ్మణుఁడు గంభీర ముఖముతో వస్త్రము నుండి నిదర్శనాపత్త్రికను వెలువరించి వానిచేతి కిచ్చెను. నయి

సఖాన్ దానిని రెండు నిముసములసేపు తిరుగ వేసి బోర్ల వేసి పరీక్షించి చూచి, "మంచిది, మీరా లేమి చెప్పెదరు?" అని యాకూతని నడిగెను.

మొదలనే మీరు విజయము నొందితిరి. కావున నిక యుద్ధమువలన లాభము లేదని ప్రభువుగారు సెల విచ్చినారు."

"అచ్ఛా!"

"కాబట్టి సంధికొఱకు వారు నిరీక్షించుచున్నారు."

"షాబాష్!"

"ఇప్పుడే నియమములకు ఢిల్లీశ్వరుఁడు సంధి చేయ నంగీకరించునో వానిని వారు తెలిసికొనఁ గుతూహలులై యున్నారు."

"ముందుగా చక్రవర్తికి లోబడుట కంగీకరింపవలెను. అందులకు మీ ప్రభువుగారు సమ్మతించినారా?"

"వారిసమ్మతి గాని యసమ్మతి గాని తెలుపుటకు నా కధికారము లేదు. జాహాపనా యానతిచ్చిన సంగతు లెల్ల వారికిఁ దెలిపెదను; వారు వివేచించిన తరువాత అంగీకారమునో యనంగీకారమునో ప్రకటింతురు."

"మంచిది మొదటినియమము దెలిపితిని గదా. ఇక రెండు చక్రవర్తిసేనలు జయించిన దుర్గములు వానియధీనము నందే యుండును. మూడు. సింహగడ మొదలగుదుర్గము లొక టిరెండు మీరు విడిచిపెట్టవలెను"

"ఏ షేపి?"

"ఆసంగతి రెండు-మూడుదినములలో పత్రికాముఖమున దెలియఁజేసెదను. నాలుగు, మిగిలినదుర్గములు దేశమును మీ రాజుగారి యేల్బడియం దుండును; వారు వానిని జాగీరురూప మున ననుభవించుచు, అరిగాపై యుండవలెను. ఈనియమ ములను మీకృపున కెఱిగించి, వారు సమ్మతించిరో లేదో మూడునాల్గుదినములలో నాకుఁ దెలియఁజేయవలెను."

"చిత్తము. మఱి సంధి స్థిరపడువఱకును యుద్ధము చాలింపరా?"

"ఎన్నటికిని చాలింపము! మహారాష్ట్రులవంటి ధూర్తులు ప్రపంచములో లేరు వారిని మేము నమ్మము! సంధి నిశ్చయ మగువఱకును యుద్ధము నడచుచుండును. మీకు మేమునష్టము చేసెదము; చేత నయినయెడల మీరు మాకు చెఱుపు చేయ వచ్చును."

దూత "ఏవమస్తు" అని పలికి, వానికడ ననుజ్ఞ వడసి వెడలిపోయెను. ఆతనినేత్రములు నిప్పులు గురియుచుండెను.

మహాదేవజీ మెలమెల్లన హార్మ్యము డిగ్గి, ద్వారములను గదులను వేర్వేఱుగా పరికించి చూచుచు, వెలుపలికి వచ్చి నప్పటి రక్షకభటుఁడు విస్మయ మొంది "దూతమహాశయా, ఏమి చూచుచున్నారు?" అని యాతని నడిగెను.

దూరాత్ "ఈ హర్మ్యములో శివాజీప్రభువు శైశవమున నివసించెను. ఇదియును మీచేతులలోఁ బడినది. ఒక్కొక్కటిగా దుర్గముల నన్నిటిని లాగుకొందురు కాబోలు! అక్కటా!" అన్నాను.

రక్షకభటుఁడు నవ్వుచు, "దానికయి వృథా దుఃఖమేల? మీపనిమీఁదఁ బొండు" అనెను.

భూసురుఁడు పూనానగరీ జనసమూహములో శీఘ్రముగాఁ గలసిపోయెను.

౬

మహాదేవజీ పూనానగరవీధుల నొక్కొక్కటిగా వెనుక వేయఁ జొచ్చెను; పోవుచు నగరమును విశేషముగాఁ బరిశీలించుచు, వస్తువులు కొనుమిషతో రెండు దుకాణములను జేరి, మాటపై మాటమీద నానావిషయములను దెలిసికొనెను; పిమ్మట విపణిని దాటి రాజమార్గము నతిక్రమించి యొకగొందిలోఁ బ్రవేశించెను. అచ్చోట దీపము లాఱియుండెను. నాగరకులు తలుపులు మూసికొని నిజాగారములలో నిద్రించుచుండిరి.

బ్రాహ్మణుఁడు బహుదూరము చనెను. అయ్యది చీకటిరాత్రి. ఒకటిరెండు తారకలు మాత్రము మినుకుమినుకు

లోకము నావరించియుండెను. అట్టియెడ నాకస్మికముగా కేక వినఁబడెను; మహాదేవునియొడలు కంపింప సాగెను. జాగరూకతతో నతఁడు నిలువఁబడి యుండెను.

మరల నాశబ్దము చెవి సోకెను. మహాదేవుని మనస్సు కుదుట పడెను. యాత్రికుని కంఠధ్వని. వాఁడు బ్రాహ్మణుఁడు దాఁగియున్న సందులోనికే ప్రవేశించెను. ఆగొంది ముగ్గుల వంకరటింకర యయినది.

ఇటు నటుఁ జూచుచు కావలివాఁడు మహాదేవజీ నిలిచి యున్న వైపునకు దృష్టి నిగిడ్చెను; విప్రుని హృదయాందోలనము వర్ణింప నలవి కాదు. మహాధైర్యశాలి యగుటచే నతఁడూపిరి బిగఁబట్టి, కటారి మఱింత గట్టిగాఁ బట్టుకొని యుండెను.

చిమ్మచీకటిలో తలారి కేమియు నగపడ లేదు; వాఁడు మెల్లన మార్గము వెంట సాగిపోయెను పిమ్మట మహాదేవజీ మందమందముగా నీవలకు వచ్చి, లలాటమునందలి స్వేదమును దుడుచుకొనెను.

అనంతర మతఁడు సమీప గృహమును జేరి కవాటముఁ దట్టెను. తోడనే మహారాష్ట్ర సైనికుఁడు, నయిస్త ఖాను సేనలోనివాఁడు వెలుపలికి వచ్చెను. వారిద్దరును కడు మెలకువతో నగరమధ్యమందలి యొక విజన ప్రదేశమున కరిగిరి. పిదప వారికిట్లు సంభాషణ నడచెను.

"సమస్తము సిద్ధముగా నున్నదా?" అన్నాఁడు మహాదేవజీ.

"ఉన్నది" అన్నాఁడు సైనికుఁడు.

"అనుజ్ఞాపత్త్రము లభించినదా?"

"లభించినది."

మరల కాలిచప్పుఁడు స్పష్టముగా వినఁబడెను. ఈపర్యాయము క్రోధముచే మొగము జేవురింప మహాదేవజీ బాహుచేఁ బూని యెదుటికిఁ జని యంధకారములో నల్వంకలు వెదకెను. కాని యేమియుఁ గాన్పించలేదు. తుదకతఁడు ప్రత్యావర్తుఁడై సైనికుని జూచి, వట్టిచేతులతో వచ్చినావా?" అని యడిగెను.

చొక్కాలోనుండి వాఁడు చురకత్తిని తీసి బ్రాహ్మణునకుఁ జూపెను.

"మంచిది, మెలకువతో నుండుము. వివాహమెప్పుడు?"

"రేపు."

"అనుమతి పొందితివా?"

"ఆ!"

"ఎందఱు మనుష్యులు?"

"వాద్యకారులు పదిమంది, అస్త్త్రధారులు ముప్పదుగురు; ఇంతకంటె నెక్కువమంద వలదని యాజ్ఞాపించెను."

"చాలును! ఏవేళ?"

"రాత్రిజాము ప్రొద్దుపోయిన తరువాత".

"మంచిది ఈదిక్కునుండియే యూనీగింపు ప్రారంభ మగును."

"చిత్తము. జ్ఞాపక మున్నది."

"మేళగాండ్రు సత్తువకొలఁది వాయించవలెను"

"చిత్తము."

"చుట్టములుసాధ్యమగునంతవఱకు గుమిగూడవలెను."

"చిత్తము."

అంతట మహాదేవజీ మందహాసముచేసి, "ఈశుభకార్యమునకు నేనేపురోహితుఁడను! ఆవృత్తాంతము భారతఖండము నందెల్లెడల వ్యాపించును" అని వక్కాణించెను.

బలముకొలఁది విడిచిన బాణము బ్రాహ్మణునివక్షమునకు దగిలెను; ఆశరముచే తప్పక ప్రాణము పోవలసినదే; కాని కుర్తీ లోపల నున్న యినుపకవచమునకుఁ దగులుటచే నాశరము నేల రాలెను.

అటుపిమ్మట బల్లెపుఁబోటు! బ్రాహ్మణుఁడు కంతా ఘాతమునకు నేలపైఁ బడెను. కాని యావరవర్మ దుర్భేద్యమగుటచే బల్లెము శరీరములో దిగలేదు. మహాదేవజీ చప్పున లేచి చూడగా కట్టెదుట దీర్ఘకాయుఁడగు యోధ తీక్ష్ణ ఖడ్గము చేపట్టి నిలువఁబడి యుండెను అతఁడు చాంద్‌ఖాన్!

సభాభవనమున సయిస్తఖాను చాంద్ఖానును భీరువని యధిక్షేపించెను. యుద్ధములో చాంద్ఖాను కేశములు తెల్ల పడినవి, కాని యెవ్వడును వాని నిట్టు లవమానించి యుండ లేదు. సయిస్తఖాను పలికినమాటలు మానసమును వేధింపఁగా నతఁడు, "ఒరులతోఁ జెప్పున దేమి? కార్యముద్వారా యీ యపవాదము తొలఁగించుకొందును; కానియెడల గ్రుడ్డిగవ్వ చేయని ప్రాణములను యుద్ధములో విడిచెదను." అని భావించెను.

బ్రాహ్మణుని యాచరణమున వానికి సందేహము కలిగెను. అతఁడు శివాజీనిగూర్చి బాగుగా నెఱుఁగును. ఆతని యమానుషపరాక్రమము, దుర్గములు, అశ్వికసైన్యము, హిందూ ధర్మాసక్తి, రాజ్యస్థాపనాభిలాష, స్వాతంత్ర్యరక్షణప్రతిజ్ఞ— ఇవి యెల్ల వాని కగోచరములు కావు. మొగలులతో యుద్ధము ప్రారంభమయిన వెంటనే శివాజీ పరాజయము నంగీకరించి, సంధిప్రయత్నము సేయు ననుట కలలోనిమాట! దూత నిదర్శనాపత్రికను జూపెనే! ఈబ్రాహ్మణుఁ డెవ్వడు? ఈతని రహస్య వృత్తాంత మేది?

బాయబారి మాటలయందును వానికి సంశయ ముదయించెను. మహారాష్ట్ర నిందావాక్యములు చెవి సోఁకినంతనే బ్రాహ్మణుని నేత్రములు ప్రజ్వరిల్లెను; అదియును చాంద్ఖాను విలోకించెను. ఈ సందేహములను సయిస్తఖానుతోఁ జెప్ప

లేదు : సత్యము వధించి మరల తిరస్కారము నొంద నేల ? ఈ టక్కరి దూతను బట్టుకొందును గాక, ” యని తలపోసి చాంద్ ఖాను మహాదేవజీవెంట ననుసరించుచుండెను. చనుచు, బ్రాహ్మణుఁడు గొందులలోఁ బ్రవేశించునపుడు తాను సయితము మెల్లనఁ బ్రవేశించుచు, నిముసమైన నయినను మహారాష్ట్రుఁడు కనుచూపుమేర దాఁటి పోవకుండునట్లు జాగరూకతతో నడచుచుండెను.

సైనికునితో బ్రాహ్మణునకు జరిగిన సంభాషణ సమగ్రముగా నాలకించి, బుద్ధిమంతుఁ డగుటచే నతఁడు సమస్తము గ్రహింపఁ జాలెను; అంతఁ దనలో, “ఈటక్కరి దూతను సంహరించి, భటుని సేనాపతి సమ్ముఖమున కీడ్చుకొనిపోయెదను” అని యనుకొనెను.

కాని, ఆశ కేవలము వంచనాశీలము గదా !

మహాదేవజీ భూమిమీఁదినుండి లేచీలేవకముందు చాంద్‌ఖాన్ కుప్పించి యాతనిపై దుమికి ఖడ్గముతో సబలముగా దెబ్బ దీసెను. వెనుకటి సాయకము. బల్లెమువలెనే యాకత్తియు కవచనమునకుఁ దగిలి నిష్ఫల మయ్యెను.

“దుస్సమయమున నావెంట నంటి వచ్చితివి రా !” యని పలికి, మహాదేవజీ తనకుర్తీ ముంజేతులను పైకి ద్రోసికొని, వాడి కటారి మీఁది కెత్తెను. నిమేషమధ్యమున నతని

సంకాశ మగు ఛురికా ఘాతము చాంద్ ఖాను వక్షస్థలముపైఁ బడెను. తోడనే వాని కళేబరము భూమిపై దొరలెను.

బ్రాహ్మణుఁడు పండ్లు బిగియఁబట్టి యుండెను; అతని నేత్రములనుండి విస్ఫులింగములు వెడలుచుండెను. మహాదేవజీ చురక త్తిని దాఁచి, "ఓరీ సయి స్తఖాన్, మహారాష్ట్రులను నిందించుటచేఁ గలిగిన మొదటిఫల మిదియే! నీవు భవానీకళ్యాణమున రెండవఫలము ననుభవింతువులే!" అని మెల్లఁగా ననెను.

వీరోచిత మగు కార్యమున చాంద్ ఖాన్ ప్రాణములు విడిచిన సమయమున సయి స్తఖాన్ నిద్రించుచుండెను. సుఖస్వప్నములో నతఁడు శివాజీని బంధించినట్లు మురియుచుండెను.

మహారాష్ట్రసైనికుఁ డీవ్యాపారమును గాంచి విస్మితుఁడై, "ఇ దేమి! ప్రభువువా రిట్టి పని చేసినారు! ఈ వీవా ర్త వెల్లడి యయి, మనకార్యము చెడిపోవునే!" అని విన్నవించెను.

"ఎంతమాత్రము విఫలము కానేరదు. వీఁడు సభలో నవదూతుఁ డయినట్లు తెలిసికొంటిని. ఒక్కనాఁటికి వీఁడు సభకుఁ బోవకున్నను అచ్చటివాండ్రు సందేహింపరు. ఈ శవమును దగ్గఱనూతిలోఁ బాఱవేయుము. మఱి, నీవు జాము ప్రొద్దు పోయిన తరువాత నని జ్ఞ ప్తియందుంచుకొనుము."

"జేవు జాము ప్రొద్దుపోయిన తరువాత"

బ్రాహ్మణుఁడు నిశ్శబ్దముగా నచ్చోటు బాసెను. మూఁడు నాల్గుచోట్ల రక్షకభటులు వానిని నిలిపిరి; నయిస్తె ఖాను స్వహస్తములతో లిఖించిన యనుజ్ఞాపత్రికను వారలకుఁ జూపి, మహాదేవజీ సురక్షితముగా పూనానగరమునుండి వెడలిపోయెను.

౭

చెక్కిటఁ జేయి పెట్టుకొని యొక్కటే తీరున యోజించుచు రాజా జస్వంత సింగు గుడారములోఁ గూరుచుండియుండెను. ఆయనయెదుట దీపము వెలుఁగుచుండెను. అచ్చట నింకెవ్వరును లేరు. మహారాష్ట్రదూత దర్శనార్థము వచ్చెనని వార్త వచ్చెను. జస్వంతసింగు కూడ దూతకయి నిరీక్షించుచుండుటచే రాయబారిని వెంటనే లోనికిఁ దీసికొని రా నాజ్ఞ యొసఁగెను.

మహాదేవజీ న్యాయశాస్త్రి పటకుటీరములోఁ బ్రవేశించెను; జస్వంతసింగాతని సాదరముగాఁ గూరుచుండ బెట్టెను. ఇర్వురు నుపవసించిరి.

ఇంచుక తడవు జస్వంతసింగు నీరవుఁడై యేమో చింతించుచుండెను. మహాదేవజీ నిశ్శబ్దముగా నాతనిదెస తీక్ష్ణవీలోకనములఁ బఱపుచుండెను. తరువాత జస్వంతసింగు

బ్రాహ్మణునితో, "మీ ప్రభువుగారి పత్రిక నాకుఁ జేరినది" అనెను.

"మత్తే సంగతి ముచ్చటించుటకును ప్రభువు గారు నన్నుఁ బంప లేదు: దుఃఖించుటకయి పంపినారు" అన్నాడు దూత.

"పూనా, చాకణ్ దుర్గములు మాత్రము మాచేతఁ జిక్కినవి. ఇంతమాత్రమున కేనా ఖేదము?" అన్నాడు సింగు.

"దుర్గములు పోయిన వని వారు సంతాప పడుట లేదు. ఇంకను చాల దుర్గము లున్నవి."

"మొగలులతోడి యుద్ధమునఁ జిక్కుకొని వారు పొక్కుచున్నారా?"

"ఆపద వచ్చినప్పుడు ఖేదము నొందుట వారిపని కాదు."

"అట్లయిన సంతాప మేల?"

"హిందూ రాజతిలకము, క్షత్రియకుల చూడామణి, సనాతనధర్మరతా దీక్షితులు నగువారు మ్లేచ్ఛ దాసులై యుండుటకు స్వామి వారు చింతించుచున్నారు!"

జస్వంతసింగు ముఖమంగలము కొంచె మెఱ్ఱవాఱెను. మహాదేవజీ దానిని జూచీచూడని విధమున గంభీరస్వరముతో నిట్లు చెప్పసాగెను. "ఉదేపూర్ రాణావంశమునుండి వివాహ

మాడిన వారు, మార్వాడ్ రాజచ్ఛత్రము మస్తకముపై వ్రేలాడువారు, రాజస్థానమున యశస్సు నిండినవారు, సిప్రా తీరమున నెవ్వారి విక్రమము నవలోకించి ఔరంగ్‌జేబ్ భయ విస్మయములకు లోనయ్యెనో, భారతఖండ మెవ్వారిని సనాతన హిందూ ధర్మరక్షకులనుగా భావించుచున్నదో, ఊరూరను, ఇంటింటను ఎవ్వారికి జయము కలుగవలె నని హిందువు లెల్లరు నీశ్వరుని ప్రార్థించు చున్నారో అట్టివారు నేడు మునల్మానుల పక్షమునఁ జేరి, హిందువులతో యుద్ధము చేయుటఁ గాంచి, ప్రభువుగారు ఖేదము నొందుచున్నారు. రాజన్, నేను సామాన్యుఁడను. ఏమి పలుకుచున్నానో నాకే తెలియుట లేదు. అపరాధ మయ్యెనేని క్షమింపుఁడు! మంచిది, ఈ యుద్ధసన్నాహ మేల? ఈసైన్యాధిపత్య మేల? ఈ విజయ పతాక లెందుల కెగురుచున్నవి? స్వాధికార వ్యాపనార్థమా? హిందూ స్వాతంత్ర్య సంరక్షణార్థమా? క్షత్రియోచిత యశో పార్జనము కొఱకా? దేవరవారు క్షత్రకులపుంగవులు వివేచించి చూడుఁడు. నేను కేవల మజ్ఞుఁడను!"

జస్వంతసింగు అధోవదనుఁడయి యుండెను. మహా దేవజీ యింకను జెప్పసాగెను. "తమరు రాజపుత్రులు మహా రాష్ట్రులు రాజపుత్రుల పుత్రులు; తండ్రికొడుకులకు యుద్ధము సంభవింపదు. భవానీదేవి స్వయముగా నిట్టి సంగరము నిషే ధించినది. తమ రాజ్ఞాపింపుఁడు. మేము మీరు చెప్పినచొప్పున

నడతుము. అనాథభారతఖండమునకు రాజపుత్రుల గౌరవమే యలంకారప్రాయమై యున్నది. రాజపుత్రుల యశోగీతములను మారమణు లిప్పటికిని పాడుచున్నారు. రాజపుత్రులే యుదాహరణముగా మాబాలకులు శిక్ష నొందుచున్నారు. క్షత్రియ కులావతంసమా, రాజపుత్రరక్తముతో మాఖడ్గములు కలుషితములు కాకమున్నే, మహారాష్ట్ర సామ్రాజ్యము నశించి పోవును గాక! మేము బల్లెములను, కత్తులను వదలి మరల నాగలిపట్ట నేర్చుకొందుము గాక!”

అంతట జస్వంతసింగు కన్నులు పై కెత్తి మెల్లగా, “దూతమహాశయా! మీమాటలు కడు మధురముగా నున్నవి. కాని నేను ఢిల్లీశ్వరుని కొలువులో నున్నాను; మహారాష్ట్రులతో యుద్ధము చేయుదు నని వచ్చితిని.” అని పలికెను.

“ఇట్లే వందలకొలఁది స్వధర్మపరాయణుల నంత మొందింతురు! హిందువులు హిందువులతలలు నఱకులాడుకొందురు బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుని గుండెమీఁద బాఁకు నిలుపును, క్షత్రియరక్తముతో క్షత్రియరక్తప్రవాహము మిళిత మగును, తుదకు మ్లేచ్ఛునకు సంపూర్ణ జయము సిద్ధించును!”

జస్వంతసింగు వదనము కషాయకాంతి వహించెను. కాని యతఁడు కోపము నణఁచుకొని, కొంచెము కర్కశస్వరముతో, “యుద్ధము కేవలము ఢిల్లీశ్వరునికొఱకుఁ గాదు; నేను మీప్రభువుతో నే మని స్నేహము చేయుదును? శివాజీ

మహాధూర్తుఁడు. అతఁ డీనాఁటిమాటను రేపు సులభముగా నతిక్రమింపఁగలఁడు" అని వచించెను.

ఈ వాక్యములకు నేత్రములు ప్రజ్వరిల్ల మహాదేవజీ గంభీరవాక్కులతో ని ట్లనెను: "మహారాజా, అవధరింపుఁడు, నిష్కారణముగా నిందించుట తమకుఁ దగినది కాదు. శివాజీ హిందువుల కిచ్చిన వాగ్దాన మెన్నఁడై న మీఱియుండెనా? బ్రాహ్మణసన్నిధియందుఁ జేసిన ప్రతిజ్ఞను, ఎన్నఁడేని మీఱి యుండెనా? దేశములో ననేకగ్రామములు లున్నవి; ఊరూరను దేవాలయము లున్నవి, శివాజీ సత్యమును పాలించుటకు, బ్రాహ్మణుల కాశ్రయ మొసంగుటకు, హిందువుల కుపకారము చేయుటకు, గోవత్సాదికములను రక్షించుటకు, దేవ దేవీపూజలు సల్పుటకు నెన్నఁడేనిఁ బరాఙ్ముఖుఁ డయ్యె నేమో విచారింపుఁడు. ఇఁక ముసల్మానులతో యుద్ధమా? జయ మొందిన వారికిని పరాజితులకును నడుమ నేదేశమం దయినను సఖ్యము కలదా? గృధ్రము సర్పమును బట్టుకొన్నప్పు డానాగము మృతి నొందినట్లు పడియుండును; చచ్చినది కదా యని విడచిన తోడనే పన్నగము తనశత్రువును కా టందును: ఇయ్యది ద్రోహాచరణమా? స్వాభావికరీతియా? శ్వానము శశకమును బట్ట యత్నించును; ఆత్మరక్షణార్థము కుందేలు కొంతప్రయాణ పడును. ఈదిక్కుగాఁ బోవునట్లు కాన్పించి, చప్పున రెండవ వైపుగాఁ బాఱిపోవును: ఇది ధూర్తతయా? స్వాభావికరీతియా?

సమస్తజీవజంతువులకును ప్రాణసంరక్షణార్థము జగదీశ్వరుఁడు నేర్పిన యుపాయము మనుష్యులకు మాత్రము నేర్పలేదా? మన ప్రాణములకుఁ బ్రాణము, జీవనమునకు జీవనస్వరూపము నగు స్వాతంత్ర్యమును ముసల్మానులు కొన్నివందల సంవత్సరముల నుండి హరించుచున్నారు; అట్టివాండ్రతోడనా మనకు సఖ్యము అట్టివాండ్రతోనా మన సత్యపరిపాలనము ? వాండ్రు రుధిరస్వరూప మగు మనబలమును, దేశగౌరవమును, ధర్మమును నాశము చేయుచున్నారు, అట్టి వాండ్రచేతులఁ బడకుండ స్వాతంత్ర్యమును, స్వధర్మమును, జాతీయగౌరవమును రక్షించుట కేయుపాయము నవలంబింతుమో, యది నింద్యమా ! జీవనసంరక్షణార్థము పలాయనైకపరాయణ మగు కురంగశీఘ్రగతి ద్రోహాచరణ మనిపించుకొనునా? శాబకప్రాణోద్ధరణార్థము విహంగము వ్యాధుని వేఱొకదిక్కున కెలయించుకొనిపోవ యత్నించుట గర్హ్య మగునా? క్షత్రియప్రభూ, ముసల్మానులు మహారాష్ట్రులను కపటులన నిందించుట యహరహము వినుచున్నాను; కాని హిందూప్రవరా, తమరు హిందూజీవనసంరక్షణైకగతిని నిందింప వలదు. శివాజీని గర్హించవలదు.", ప్రజ్వరిల్లుచున్న మహాదేవజీనేత్రద్వయము బాష్పాకులిత మయ్యెను.

బ్రాహ్మణుని కన్నీటిని జూచి జస్వంతసింగు వేదన నొంది, "దూతచూడామణీ, నేను తమకుఁ గష్టము కలుగఁ జేయఁదలఁచలేదు, అన్యథా మాటలాడి యుంటినేని, క్షమిం

పుడము. రాజపుత్రులు స్వాతంత్ర్యము నిలుపుకొను చున్నారు, కాని వారలు పరాక్రమము, బహిరంగయుద్ధము తక్క వేఱొక యుపాయము నెఱుగరు. మహారాష్ట్రులు కూడ దానినే యవలంబించి అట్టి ఫలములను పొందలేరా?" అని పలికెను.

"మహారాజా, రాజపుత్రులకు నిప్పుడైశ్వర్యము కలదు, అనేకదుర్గములున్నవి, పెద్ద నగరము లున్నవి. బహుసంవత్సరములనుండి పారంపర్యముగా రణశిక్ష వచ్చుచున్నది. మహారాష్ట్రులకు వీనిలో నున్న దేది? వారు దరిద్రులు, చిరపరాధీనులు వారల కిదియే ప్రథమయుద్ధప్రయత్నము. మీరు పురాతనరీతి నియుద్ధము చేయుదురు; ప్రాచీన దుర్ధర్ష తేజోవిక్రమంబులను బ్రకటింతురు. రాజపుత్రవాహినీ సమ్ముఖంబున ఢిల్లీశ్వరధ్వజిని పలాయితమగును. మా దేశముపై శత్రువులు దాడి చేసి వచ్చినప్పుడు మేమేమి చేయఁగలము? పారంపర్యాగత మగు రణశిక్ష యూ లేదు, విశేషసైన్యమూ లేదు; ఉన్న సైనికులైన యుద్ధము నెన్నడును జూచినవారు కారు. ఢిల్లీశ్వరుఁడు కాబూల్, పంజాబ్, అయోధ్య, బీహార్, మాళవ, రాజస్థాన్ మొదలగు ప్రదేశములనుండి మహాయోధులను, విచిత్రధాటిగల యుద్ధాశ్వములను, రణగజములను, ఫిరంగులు, బందూకులు, మందుగుండుసామానును, వందలకొలది శకటములతో వెండి బంగారు నాణెములనుబంపునపుడు దరిద్రులగు మహారాష్ట్రులేమి చేయఁగలరు? వారలకట్టి మహాయోధులు లేరు, ఘోటక మాతంగ

ములు లేవు, విశేషనిత్యములేదు, శీఘ్రగమనము, పర్వతయుద్ధ ముతప్ప మఱేయుపాయము లేదు. మహాప్రభూ, దరిద్రజాతికి మొట్టమొదట నిట్టి యాచరణమేగదా పట్టుగొమ్మ! భగవానునియనుగ్రహమున మహారాష్ట్రులు దీర్ఘాయుష్మంతులగుదురు గాక! విపులధనము, సంపూర్ణరణశిక్షయు లభించునెడల శీఘ్రకాలములోనే వారును రాజపుత్రుల యసాధారణగుణముల ననుకరింతురు."

ఈవాక్యము లాలించి జస్వంతసింగు చింతాకులుఁడై, చెక్కిటఁ జేయిచేర్చి యేకాగ్రచిత్తముతో నేమో యోజింపఁ దొడఁగెను. తన పలుకులు కేవలము నిష్ఫలములు కాలేదని గ్రహించి, మహాదేవజీ యింకను నుపన్యసింపఁ జొచ్చెను.

"దేవా, తమరు హిందూశ్రేష్ఠులు. హిందూధర్మము నుద్ధరించుట తమవిధి. శివాజీకిని ఇంతకంటె భిన్నవాంఛ లేదు; ముసల్మాన్‌శాసనధ్వంసము, దేవాలయస్థాపనము, బ్రాహ్మణాశ్రయదానము, శాస్త్రాలోచనాభివృద్ధి, గోవత్సాది రక్షణము ఇవియే శివాజీ కోరునవి. ఈ యుద్యమములో మీరు వారికి సాయము చేయ విముఖులగుదురేని, పోనీ తమరే స్వహస్తములతో నీపూనికను నిర్వహింపుఁడు. తమ రీదేశ ప్రభుత్వమును స్వీకరింపుఁడు. ముసల్మానుల నోడింపుఁడు, హిందూరాష్ట్రమును వృద్ధి చేయుఁడు. స్వాతంత్ర్యము నెలకొల్పుఁడు. ఆజ్ఞాపింతురేని యీక్షణముననే సమస్త దుర్గద్వార

ములు తెలియుదుము. ప్రజలు తమకు పన్ను చెల్లింతురు. శివాజీ కంటె తమరు సహస్రగుణము లెక్కువ బలవంతులు, దూరదర్శులు, రాజ్యార్హులు. సంతుష్టచిత్తుఁడై శివాజీ తమ సేనాపతిగా నుండి ముసల్మానులను ధ్వంసము చేయ యత్నించును. వారికి వేఱు కోరిక యుండదు."

ఈప్రస్తావమున నుచ్చాభిలాషి యను జస్వంతసింగు నయనములు హర్షోన్నిద్రము లయ్యెను. కొంత తడ వతఁడు చింతించి తుదకు, "మార్వాడ్ మహారాష్ట్ర దేశము లొక దాని కొకటి దూరమున నున్నవి. ఒకే ప్రభువు నేలుబడిలో నుండుట సంభవింపదు" అని పలికెను.

"అట్లయిన పక్షమున తమకుఁ గూర్చుకొమిరు నీరాజ్యమునకుఁ బ్రభువును జేయుఁడు; మీబంధుగులలో నొక యోధుని బ్రతిష్ఠింపుఁడు. శివాజీ క్షత్రియుని యధీనమున కార్యములు నిర్వర్తించుచుండును. కాని యొకప్పుడును క్షత్రియునితో యుద్ధము చేయు నను మాట కలలోనివార్త!"

"ఈ విపత్కాలమున ఔరంగ్‌జేబుతో యుద్ధము చేసి, రాజ్యము నిలుపఁ గల వాఁ డెవ్వఁడును నావారిలో లేఁడు."

"ఎవ్వనినో క్షత్రియుని నియోగింపుఁడు. హిందూధర్మము, స్వాతంత్ర్యమును రక్షించెనేని వారి మనోరథము

సఫల మయినట్లే ! అంతట వారు సానందముగా రాజ్యమును విడిచి, వానప్రస్థాశ్రమమును స్వీకరింతురు. ”

“ అట్టివాఁడును లేఁడు. ”

“అట్టు లయినచో శివాజీరాజునకు సాహాయ్యము జేయుఁడు. మీ బాసటతోడను, ఆశీర్వచనముచేతను వారు స్వదేశమును, స్వధర్మమును రక్షింపఁగలరు. మహాప్రభో, సాటి క్షత్రియునకు సాయము చేయుఁడు. అట్లు చేయుదురేని భారత ఖండమున మిమ్ము స్తుతింపని వాఁ డుండఁడు ! ”

“ద్విజాగ్రణీ, మీ తర్క మలంఘనీయము. కాని, ఢిల్లీశ్వరుఁడు నన్ను స్నేహపూర్వకముగా నీకార్యమున నియోగించినాఁడు. ఏ మొగము పెట్టుకొని నేను మఱి యొకలాగున నాచరింతును ? ద్రోహము చేయుట భద్ర జనోచితమా ? ”

“ఢిల్లీశ్వరుఁడు హైందవులను కాఫర్లు అని దూషించుచు జిజియా పన్ను విధించెనే, అది భద్రజనోచితమా ? దేశ ములందలి దేవాలయములను బడఁగొట్టించెనే, అది భద్ర జనోచితమా ? వారాణశీ నగరమున దేవమందిరమును బడఁ గొట్టించి యచ్చటనే మస్జిద్ నిర్మించెనే, అది భద్రమనోచితమా? తన యన్నదమ్ములనే వధించి యన్యాయ మార్గమున సింహా సనము నధిరోహించెనే, అది భద్రజనోచితమా ?

కోపముచేఁ జలించుచున్న కంఠధ్వనితో జస్వంతసింగు ఇట్లు పలికెను: “బ్రాహ్మణశ్రేష్ఠా, ఇఁకఁ జాలును ! ఇది

మొదలుగ శివాజీ నామిత్రుండవు, నేను శివాజీ స్నేహితుండను; శివాజీ ప్రతిజ్ఞయు నాప్రతిజ్ఞయు నొక్కటే; శివాజీప్రయత్నము నాప్రయత్నము నభేదము. హిందూ విరోధి యగు ఢిల్లీశ్వరున కు ప్రతిద్వంద్వియై యింతకాలము స్వాతంత్ర్యమును సంరక్షించుకొనుచున్న యీ మహాత్ముం డెక్కడ? ఒక్కసారియు మా మహాభాగు నాలింగనము చేసికొని హృదయతాపము శమించుకొందును!"

బ్రాహ్మణవేషధారి తన నేపథ్యమును దొలంగించెను. ఉష్ణీషముక్రింద శిరస్త్రాణము కన్పట్టెను; వర్తి యడుగున ఇనుప కవచము ప్రకాశించెను. అంతట మహారాష్ట్రవీరుండు మెల మెల్లన నిట్లనెను: "మహారాజా, ఛద్మవేషము ధరించి తమ సన్నిధి కేతెంచితిని, దోషముగా గ్రహింపవలదు. ఈదాసుండు బ్రాహ్మణుండు కాండు, మహారాష్ట్రక్షత్రియుండు; ఈ సేవకుని నామము మహాదేవజీ కాదు, శివాజీ!"

రాజా జస్వంతసింగు విస్మయవిష్టుండై, సంతోషముచే కన్నులు వికసింప, ఆసుప్రసిద్ధ మహారాష్ట్రయోధను, ఆ ఢిల్లీశ్వరప్రతిద్వంద్విని, అదాక్షిణాత్యవీరచూడామణిని, శివాజీ ఛత్రపతిని తెప్ప వాల్చక చూడంజొచ్చెను; పిమ్మట నిజాసనమునుండి లేచి, నేత్రములవెంట నానందబాష్పములు రాలుచుండ, నించుక సేపటిక్రిందట పరమశత్రువుగా నున్న వానిని తానే కౌంగిలించెను. శివాజీయును, విఖ్యాతనామునిం

డగు నారాజపుత్రవీరుని గౌరవప్రణయపూర్వకముగాఁ బరిష్వ జించెను.

రాత్రి యంతయు వారికి సంభాషణ జరిగెను. వీడు కోలు సమయమున శివాజీ జస్వంతసింగుతో "మహారాజా, అనుగ్రహించి, యేదో కారణమున పూనా నగరమున కొకటి, రెండు క్రోశముల దూరమున నుండుట మేలు", అని పలికెను.

"ఏమి! తేపు మీరు పూనా స్వాధీనము చేసికొన యత్నింతురా?"

"లేదు, వివాహము కానున్నది. మహారాజుగా రచ్చట నున్న యెడల శుభకార్యమునకు వ్యాఘాతము కలుగ వచ్చును."

"మంచిది, దూరముగానే యుందును. వివాహమంత్ర ములు న్యాయశాస్త్రి మహాశయునకు జ్ఞప్తి యందున్నవా?"

"సందేహ మేమి! నా పాండిత్యము చూచి సయిస్త ఖాన్ అచ్చెరు వొందినాడు; తే పతఁడు మఱియొక పాండిత్య మును జూడఁగలఁడు."

జస్వంతసింగు శివాజీతో ద్వారము వఱకును జని యుద్ధ మునుగూర్చి మనము సంభాషించిన ప్రకారము పని చేయు దురా?" అని హెచ్చరింపఁగా శివాజీ, "అలాగునఁ శివాజీ ప్రభువుతోఁ జెప్పెదను," అని ప్రత్యుత్తరమొసఁగ, నతఁడు, "ఆ! మఱచితిని, ఆ ప్రకారము చేయ మీప్రభువునకు విన్న వింపుఁడు" అని పలికి నగుచు, గుడారములోని కరిగెను.

తూర్పుదిక్కున రాగిరేఖలు కాన్పించుచున్న సమయమున బ్రాహ్మణవేషధారియగు శివాజీ సింహగడ్ దుర్గములోఁ బ్రవేశించెను. అతనిని గాంచి పీష్వా మురేశ్వర్ త్రిమూల్ సానంద ముగా “భవానీదేవికి జయమగుగాక! ఇంతసేపటికి దేవరవారు కుశలముగా మరలివచ్చితిరి!” అని పలికెను.

“తమయాశీః ప్రభావమున నేవిపత్తునుండి తప్పించుకొొన లేదు?”

అంతయు సిద్ధమయ్యెనా?

“అయినది.”

“వివాహము నేటి రాత్రియేనా?”

“అగును.”

“సయిస్తఖానుకు కొంచెమయినఁ దెలియలేదా? తీక్ష్ణ బుద్ధియగు చాంద్‌ఖాన్ రవంతేని గ్రహింప లేదా?”

“భీతి నొందిన శివాజీయొద్దనుండి సంధిప్రార్థనాపత్రికను నిరీక్షించు చున్నాఁడు సయిస్తఖాన్. ఇఁక చాంద్‌ఖాన్ పెద్ద నిద్దురలోనున్నాఁడు.

“రాజా జస్వంతసింగు?”

“తమరు పత్రికలోఁ జూపిన యుక్తులచేత వారి మనస్సు చలించినది; నేనచ్చటికిఁ జనునప్పటికి వారు కింకర్తవ్యతామూఢు

లై యున్నట్లు స్పష్టమయ్యెను. అందుచే ననాయాసముగా కార్యసిద్ధి యయ్యెను.”

“భవానీకి జయమగుఁ గాక! దేవర వారొక రాత్రిలో చక్కఁబెట్టిన పనులు ఇతరు లంతశీఘ్రముగా నెఱవేర్పలేరు. ప్రభువుగారు నిర్వర్తించిన సాహసికకార్యములను దలఁచుకొన్న నిప్పటికిని నాగుండెలు తటతటఁ గొట్టుకొనుచున్నవి. దేవా ఇట్టి పనులలో నిఁకముందు ప్రవేశింపవలదు. తమ కేమయిన నపాయము తటస్థించునెడల మహారాష్ట్రము గతియేమి?”

“ముకేశ్వర్ జీ ఆపద యన్న భయపడునెడల నిప్పటికిని జాగీరుదారుగానే యుందును. విపద్భయ మున్నయెడల మహోద్దేశమును సాధించుటెట్లు? ఎల్లప్పుడును జీవితము విపద్గ్రస్తమై యున్నను నాకు విచారములేదు; కాని భవానీదేవి మహారాష్ట్రమునకు పారతంత్ర్యము సంభవింపకుండ రక్షించిన జాలును.”

“దేవరవారివిజయ మనివార్యము! భవానీదేవి స్వయముగా తోడ్పడును. కాని రాత్రివేళ శత్రుమధ్యమున ఛద్మవేషముతోనా?”

“ఇవన్నియు క్రొత్తలా? వీనికేమిగాని నిజముగా సంకటమునఁ బడితిని”

“ఏ మది?”

“ఎటువంటి మూఢునకు మీరు శ్లోకములు నేర్పినారు!

తనపేరు వ్రాసికొనలేనివాఁడు సంస్కృత శ్లోకములను జ్ఞప్తి యం దుంచుకొనఁ గలుగునా?

"ఏమి సంభవించినది?"

సయిస్తఖాన్ సభలోనికిఁ జని మహాదేవజీ న్యాయ శాస్త్రి మహాశయుఁడు దాదాపుగా శ్లోకముల నెల్ల మఱచి పోయెను."

"అటుతరువాత ?"

"ఒకటి రెండు జ్ఞప్తికి వచ్చెను. వానితోనే కార్యసిద్ధి యాయెను."

శివాజీ ౧౬౨౭ క్రీ. శకమున జన్మించెను. అతని తండ్రి షాహజీ, పితామహుఁడు మల్లజీ. నింబాళకర వంశమువాఁడు యోగపాల్‌రావు అను వాని భగినిని, దీపాబాయిని మల్లజీ పెండ్లి యాడెను. చాల సంవత్సరములకు సంతానము లేక పోవుటచేత అహ్మద్‌నగర నివాసి యగు షాహషరీఫ్ అను పీరుకడకుఁ జని మల్లజీ వానిని ప్రార్థించెను; అతఁడును మల్లజీకి సంతానము కలుగుటకయి దేవుని వేఁడెను. అటు తరువాత కొలఁది కాలముననే దీపా బాయి గర్భమున పుం శిశువు జన్మించెను. మల్లజీ జ్ఞానిపేరిట తనకొడుకునకు షా హాజీ యను నామకరణము చేసెను.

ఆకాలమున యాదవరావ్ అను ప్రసిద్ధ సేనాని అహ్మద్ నగరులో నుండెను. అతఁడు పదివేల గుఱ్ఱపుదండున కధిపతి.

అతనికి పెద్ద జాగీ రుండెను. ౧౫౯౯ వ హోళీపండుగనాఁడు తన కుమారుని, షాహాజీని వెంటఁ బెట్టుకొని మల్లజీ యాదవరావు గృహమున కేఁగెను. అప్పటికి షాహాజీ అయిదేండ్లవాఁడు యాదవరావు కొమార్తెకు మూఁడో నాలుగో యేండ్లుండెను; కావున బాలకుఁడు, బాలికయును మిగుల సంతోషముతో నొకచో నాడుకొన సాగిరి. అది వీక్షించి, యాదవరావు ప్రమోదముతో తనపుత్రికను, జీజీని బిలిచి "జీజీ, ఈ కుఱ్ఱ వానిని పెండ్లి యాడుదువా?" అని అచ్చటి వారల నుద్దేశించి "ఇద్దఱు నెంత చక్కనిజోడు!" అనియెను. ఈ సమయమున షాహాజీ జీజీలు ఒకరిపై నొకరు బుక్కాపొడి చల్లుకొనుటచే నెల్లరు పక్కున నవ్విరి; కాని మల్లజీమాత్రము గంభీర ముఖముతో వారలవంకఁ దిరిగి "మిత్రులారా, మీరుసాక్షులు, యాదవరావు నా వియ్యంకుఁ డగును. ఇప్పుడేగదా వివాహము మాట చెప్పినాఁడు!" అని పలికెను. ఈ వాక్యములకు నచ్చటి వారు సమ్మతిఁ గనఁబఱచిరి. యాదవరావు ఉచ్చవంశజుఁడు షాహాజీకి తన తనూజ నిచ్చి పెండ్లిచేయుట కెన్నఁడు నిచ్చగింపఁడు; కాని మల్లజీ చాతుర్యమునకు విస్మితుఁడై మిన్నకుండెను.

మఱునాఁడు యాదవరావు మల్లజీని పిలువనంపెను. కాని యతఁడు "వియ్యంకుఁడ నని నీవు సమ్మతింపనిదే నేను రాను." అని ప్రత్యుత్తర మంపెను. యాదవరావు అలాగున నంగీకరింప

లేదు, కావున మల్లజీ యచ్చటికిఁ జన లేదు. యాదవరావు భార్య వంశగౌరవమును గూర్చిన సంగతులలో మగనికంటె నెక్కువ యభిమానము కలది. యాదవరావు రహస్యముగా దుహితను షాహాజీకి వివాహము చేయు నని తెలిసికొని భార్య యతనికి సంగతులు చక్కఁగా నచ్చఁజెప్పె నని వాడుక. మల్లజీ సరోషముగా నొకగ్రామమున కరిగి, భవానీదేవి సాక్షాత్కరించి తనకు చాలధనము నొసఁగె నని చాటించెను. "మల్లజీ, నీవంశమునం దొకఁడు రాజు కాఁగలఁడు. అతఁడు శంభుని చందమున రాజచూడామణి యగును. మహారాష్ట్రము చక్కఁగా శాసించును. హిందూధర్మవిరోధులను పరిమార్చును; వానికాలమునుండి నూతనశకము ప్రారంభించును. సంతానము ఇరువదియేడు పురుషాంతరముల పర్యంతము సింహాసనము నధిష్ఠించును" అని దేవి యా సమయమున ననుగ్రహించె నని మహారాష్ట్రమున జనశ్రుతి కలదు.

అది యే మయినను మల్లజీ కప్పుడు విశేషధనము లభించినమాట నిస్సంశయము. ధనమూలమున మల్లజీ గొప్పవాఁడు కాఁ బ్రయత్నించెను; ఆ ప్రయత్నములో వానికి బావమఱఁది యోగపాల్ మిక్కిలి సాయము చేసెను. శీఘ్రకాలములోనే మల్లజీ అహ్మద్‌నగర్ సుల్తానుకొలువులో ఐదువేలగుఱ్ఱపుదళమున కధిపతి యయ్యెను. అతనికి రాజోపాధియు, సువర్ణ్ణి, చాకణ్‌దుర్గములు తత్పార్శ్వప్రదేశములును సంప్రా

ప్తము లయ్యెను; పూనా, సోపాన్షడ్ ఈ రెండును జాగీరు రూపమున లభించెను. అప్పుడు యాదవరావు అడ్డు చెప్పుటకు వీలు లేకుండెను. ౧౬౦౪ సంవత్సరమున జీజీషాహాజీల వివాహము మహావైభవముతో అహ్మద్‌నగరులో జరిగెను. సుల్తాన్ వివాహమునకు విచ్చేసెను అప్పటికి షాహాజీ పదేండ్ల వాఁడు. కాలక్రమమున మల్లజీ మృతినొందినపిమ్మట షాహాజీకి తండ్రి జాగీరు బిరుదును లభించెను.

షాహాజీ పరాక్రమశాలి, జహాంగీర్ చక్రవర్తికాలమున ౧౬౨౦ సంవత్సరమున నతఁడు అహ్మద్‌నగరమున ప్రధాన సేనాని మాలిక్ అంబర్ అను వాని యధీనమునఁ నుండి మహాయుద్ధములో సాహసవిక్రమములను గనఁబఱచుటచే నెల్లరకును సన్మానభాజనం బయ్యెను. షాహజహాన్ చక్రవర్తిపదవి నొందినపిమ్మట షాహాజీని అయిదువేలగుఱ్ఱపుదండున కధిపతిని జేసి చాలజాగీరు లిచ్చెను. ప్రభువులయనుగ్రహము నిశ్చలమయినది కాదు గదా! మూఁడుసంవత్సరముల తరువాత చక్రవర్తి షాహాజీజాగీర్లను కొన్నిటిని లాగివేసెను. షాహాజీ విరక్తి జెంది బిజాపూర్ సుల్తానుపక్షము నవలంబించి, మృతి నొందువఱకును తత్కార్యములను నిర్వహించుచుండెను.

పతనోన్ముఖమగు అహ్మద్‌నగరరాజ్యమును నిలుపుటకయి షాహాజీ ఢిల్లీశ్వరునిసైన్యముతో ననేకపర్యాయములు యుద్ధము చేసెను; సుల్తాన్ శత్రువులచే నిహతుఁడు కాఁగా, వానివం

శములో నొకనిని సింహాసనముపైఁ గూరుచుండఁ బెట్టి, కోవిదు లగుకొండఱు బ్రాహ్మణులసాహాయ్యమున దేశమును చక్కఁగా, పరిపాలించుపద్ధతి నెలకొల్పెను; అనేకదుర్గములను వశపఱుచుకొని, క్రొత్త సుల్తానుపేరిట సైన్యమును సంపాదింపఁ బొచ్చెను.

ఈ వృత్తాంతముల నాకర్ణించి షాహజహాన్ క్రుద్ధుఁడై షాహాజీని, తత్ప్రభు వగు బిజాపూర్ సుల్తానును శిక్షింప మహావాహిని నంపెను. చక్రవర్తి బలముతో యుద్ధము చేయుట షాజీకి కాని, సుల్తానకు గాని సాధ్యము కాదు; కాని యెట్లో సంవత్సరము వఱకు యుద్ధము జరిగిన పిమ్మట సంధి జరిగెను. దానితో ౧౬౩౭ సంవత్సరమున అహ్మద్ నగరరాజ్యము నశించెను.

తన ప్రభువు నాదేశాను సారముగా షాహాజీ కర్ణాట దేశమున ననేక భాగములను జయించెను; కాఁబట్టి, అతనికి ఉత్తర దక్షిణ కర్ణాటములందు జాగీరులు లభించెను.

జీజీబాయి గర్భమున శంభుజీ, శివాజీ యను నిర్వురు పుత్రు లుదయించిరి. జీజీ జనకుఁడు, యాదవరావు దేవగడ లోని పురాతన హిందూ రాజవంశావ తీర్ణుఁ డను జనశ్రుతి కలదు. ఇది సత్యమగునేని శివాజీ సుక్షత్రియుఁ డనుటకు సందేహము లేదు. షాహాజీ ౧౬౦౩ లో తుకాబాయి యను యువతిని వివాహ మాడెను. అభిమానవతి జీజీబాయి కుపితయై, మగని పొందు విడిచి శివాజీని వెంటఁబెట్టుకొని పూనా

జాగీరునకుఁ జనెను. షాహాజీ తుకాబాయిని దీసికొనిపోయి, కర్ణాటమునందు నివసించుచుండెను. ఆమెకు వెంకాజీ యను సూనుఁడు జనించెను.

షాహాజీకి విశ్వసనీయ బ్రాహ్మణు లిద్దరు మంత్రులుగా నుండిరి; వారిలో దాదాజీ కొణదేవుఁడు పూనా జాగీరును, శివాజీని సంరక్షించుచుండెను.

శివాజీ ౧౬౨౭ లో పూనానగరికి ఉత్తరమున నించుమించుగా నిరువదియైదు క్రోశముల దూరమున నున్న సువర్ణదుర్గమున జనించెను. అతని మూఁడవయేఁట తండ్రి తుకాబాయిని పెండ్లి యాడెను. అప్పటి నుండియు జీజీబాయి పుత్రునితోఁగూడ దాదాజీకొణదేవుని సంరక్షణమున పూనా నగరములో నివసింపఁ జొచ్చెను. దాదాజీ శివాజీ కొఱకు హర్మ్యము నిర్మించెను. దానిలో సయిస్తఖాను ఇప్పుడు విడిసి యున్నాఁడు,

శివాజీ చిన్నతనము నుండియు బాణములు విడుచుట యందు, బల్లెము, కత్తి మొదలగు నానా విధాయుధ సాధనము నందును నేర్పరి యయ్యెను. మహారాష్ట్రులు అశ్వారోహణమునఁ గడు నిపుణులు, వారిలో శివాజీ మహా ప్రఖ్యాతి నొందెను.

ఈ సాములతోనే కాలము పుచ్చక శివాజీ దాదాజీ సన్నిధిని గూరుచుండి రామాయణ, మహాభారతము లందలి

వీరుల వృత్తాంతములను వినుచుండెను. ఆ కథలను విన్న కొలఁది నాతని హృదయమున సాహస ముప్పొంగుచుండెను, హిందూ ధర్మమునం దాసక్తి మెండగుచుండెను, మునల్మానుల యెడ ద్వేషము ప్రబలుచుండెను. కథ లన్న నతనికి బహు ప్రీతి.

దాదాజీసంరక్షణమున శివాజీ గొప్పవాఁడు కావలె నన్నకోర్కె గాఢ మయ్యెను. పదునాఱవసంవత్సరమున నే యతఁడు స్వతంత్రుఁ డగు "పలీగార" కావలె నని సంకల్పించెను. అట్లు సంకల్పించి యుత్సాహవంతు లగుకొందఱుపడుచు వాండ్రను తనవెంతరుఁ రాఁబట్టుకొని, కొంకణదేశవాసులతో స్నేహము చేయనారంభించెను. "అపర్వత మారోహించు టెట్లు? మార్గ మెచ్చట నున్నది? ఏమార్గమున నేదుర్గమునకుఁ బోవచ్చును? ఏయేదుర్గము:లు మిగుల దుర్గమములు? ఏదుర్గమునైన ముట్టడి వేయుటగాని రక్షించుటగాని యెట్లు? అను నూహాలతో నాతనికి కాలము గడచుచుండెను. అప్పుడప్పుడతఁడు రాత్రులందును కొండమీఁద నో, క్రిందనో, కోనలోనో, కాననములోనో తిరుగుచుండెను. ఇట్లు కొంతకాలము చనునప్పటికతనికిఁ దెలియని దుర్గము గాని, మార్గము గాని, యాదేశమున లేకపోయెను. తుదకు శివాజీ దుర్గములను వశపఱుచుకొనుట యెట్లో యని చింతింపఁ జొచ్చెను.

శివాజీమాటలను విని, పనులను గాంచి వృద్ధుఁ డగు దాదాజీ భయపడ సాగెను. మంచిమాటలతో నతఁడు శివాజీని

ఆతలంపునుండి మరలింప నెంతో యత్నించెను; ఉన్న జాగీరును రక్షింపఁ గోన్నఁ జాలు నని దానిని సురక్షితముగా నుంచుకొనుపద్ధతిని దెలిపెను, కాని యావయస్కుని హృదయమున నాటుకొన్న వీరబీజము ఉత్పాటితము కాదయ్యెను. దాదాజీ నతఁడు జనకునివలె సన్మానించుచున్నను, పూనిక విడువలేదు.

కష్టసహిష్ణుతకును, విశ్వాసయోగ్యతకును శివాజీ మావళే జాతివారిని మిక్కిలి ప్రేమించుచుండును. అతని బాల్యస్నేహితులలో ఆశాజీ కంకు, తానాజీమాలసూరే, బాజీఫసళేకర్ అను మావళేలు ముప్పురు నగ్రగణ్యులు, తుదకు వీరి బాసటతోడనే ౧౬౪౬ లో తోరణదుర్గపుఁ కిల్లాదారు నెట్లో వశపఱచుకొని శివాజీ యాదుర్గమును స్వాధీనము చేసికొనెను. ప్రథమవిజయమునాఁటికి శివాజీకి పందొమ్మిదిసంవత్సరము లుండెను. మఱుసటివత్సరమున నతఁడు తోరణదుర్గమునకు నాగ్నేయ భాగమున మూఁడుమైళ్ళదూరములో నున్న యున్నత పర్వతశిఖరముపై నూతనదుర్గమును గట్టించి రాజగఢ్ అను పేరు పెట్టెను.

విజాపురముసుల్తాను ఈవార్తల నెఱిగి షాహాజీని వీనికిఁ గారణ మడిగెను. సుల్తానుకు మిగుల నమ్మక మయిన షాహాజీ యీసంగతుల నెంతమాత్ర మెఱుఁగఁడు. కావున దాదాజీని కారణ మడిగెను. దాదాజీ శివాజీని బిలిచి అట్టి పనులు చేయుట నాశమునకు మూల మగు ననియు, షాహాజీ సుల్తాను

కొలువులో నుండియే జాగీర్లను, ధనమును, కీర్తిని, గౌరవమును సంపాదించెననియు, అట్లే శివాజీకూడ మెలఁగుట మంచిదనియు బోధించెను. పితృసదృశుఁ డగు దాదాజీ కతఁడు మధురవాక్యములతో బదులుపలికెను. కాని త్రోవ విడువ లేదు. తరువాత కొద్ది దినములలో దాదాజీ మృతి నొందెను; మరణమునకుఁ బూర్వ మతఁడు శివాజీని మంచము దగ్గఱకుఁ పిలిపించెను. వృద్ధుఁడు తలక్రిందు బోధ చేయునని శివాజీ భావించెను. కాని యతఁడు విన్నదానిని బట్టి మిగుల నచ్చెరువొందెను. దాదాజీ సస్నేహముగా శివాజీతో నిట్లనెను.

"వత్సా, నీ విప్పుడు చేయుచున్న ప్రయత్నముకంటె మహత్తర మగునది లేదు. ఈ యుత్తమమార్గము విడువ వద్దు. రాజ్యము వృద్ధి చేయుము, దేశ స్వాతంత్ర్యమును రక్షింపుము, బ్రాహ్మణులను గోవులను కృషీవలులను సంరక్షింపుము, హిందూధర్మవిరోధులను దండింపుము. ఈశానీ దేవి నీకుఁ గనఁబఱచిన సరణిని విడువ వలదు."

ఈ దివ్యోపదేశము నాలకించి శివాజీ పదిరెట్లు ఉత్సాహవంతుఁ డయ్యెను. అప్పటి కాతనికి ఇరువది సంవత్సరములు.

ఆ యేఁటనే చాకణ్ కొండానా దుర్గముల కిల్లాదారులను ధనముచే వశపఱచుకొని, యా రెండు దుర్గములను శివాజీచేఁ జిక్కించుకొనెను; వానిలో కొండానాకు సింహగఢ్ అని క్రొత్తపేరు పెట్టెను. శివాజీ సవతితల్లి యగు తుకాబాయి

సహోదరుఁడు, బాజీ యనువాఁడు సోపా దుర్గాధిపతి. ఒక నిశీథమందు శివాజీ మావళే సైన్యమును వెంటఁ బెట్టుకొని సోపా దుర్గమును ముట్టడించి జయము గాంచెను; మేనమామను బాధింప కర్ణాటమున నున్న తండ్రియొద్ద కంపెను. అటు తరువాత, పురందర దుర్గాధిపుఁడు మృతి నొందగా వానిపుత్త్రులకు పరస్పర కలహము సంప్రాప్త మయ్యెను. చిన్నకొమరులకు సాయము చేయు నెపమున శివాజీ అచ్చటికి జనిఁ తానే యా దుర్గమును స్వాధీనము చేసికొనెను. అప్పుడా ముగ్వురు సహోదరులును శివాజీని నిందించిరి; కాని, తన మహోద్దేశమును దెలిపి, తనకు సాయము చేయ వలె నని అడుగఁగా వారును కోపము విడిచి, యభిప్రాయమును గ్రహించి శివాజీ కొలువులోఁ జేరిరి.

ఈ ప్రకారము శివాజీ యొక్కటొక్కటిగా దుర్గములను సంపాదించుచుండెను. ౧౬౪౮ లో ఆతని యుద్యోగులలో ఆబాజీ సోనదేవు అను నతఁడు కళ్యాణ దుర్గమును, చుట్టు ప్రక్కల భూమిని జయించెను. అప్పుడు బీజపూర్ సుల్తాను మహోగ్రుఁడై షాహజీని చెఱసాలలోఁ ద్రోయించెను; నియమిత కాలములోఁగా శివాజీ తనకు లోఁబడనియెడల ఆ చెఱసాల వాకిలి రాతితో మూయింతు నని ప్రకటించెను. ఆ సమయమున శివాజీ డిల్లీచక్రవర్తిని వేఁడుకొని తండ్రిని రక్షించెను. కాని కారాగారమునుండి షాహజీ యావలికి వచ్చునప్పటికి నాల్గు సంవత్సరములు పట్టెను.

ముసల్మానులతోడి సంపర్కమును విడఁగొట్టుకొని తన పక్షమును జేరవలసిన దని జాపీ రాజగు చంద్రరావుతో శివాజీ యెన్ని విధములనో చెప్పి చూచెను, కాని యతఁడు వల్లగా దని ఖండితముగాఁ జెప్పుటచే శివాజీ వానిని, సహోదరుని, జంపించి, రాత్రివేళ దుర్గము నాక్రమించెను. అతఁడు జాపీ ప్రదేశము నంతను జయించి, ఆ సంవత్సరమునందే ప్రతాప గఢ్ అను క్రొత్త దుర్గమును నిర్మించెను; తరువాత రెండు సంవత్సరములకు మురేశ్వర్, పింగళే అనువారిని పీష్వాలనుగా నియోగించి, కొంకణ దేశమును సంపూర్ణముగా గెలుచుటకయి సైన్యము సంగ్రహించెను.

ఈ పర్యాయము విజాపురపు సుల్తాను ఒక్కపెట్టున శివాజీని నిర్మూలింప నెంచి ౧౬౫౯ లో అఫ్జుల్ ఖాన్ అను ప్రసిద్ధసేనానిని ౫౦౦౦ అశ్వికులతోను, ౭౦౦౦ పదాతులతోను శివాజీ మీఁదికిఁ బంపెను. అఫ్జుల్ ఖాన్ మహాగర్వముతో, "గుడ్డిగవ్వ చేయని శివాజీని గొలుసుతోఁ గట్టివేసి సుల్తాను వారి పాదపీఠముకడ నిలిపెద" నని పలికెను.

ఇంత సైన్యముతో యుద్ధము చేయుట నాశమునకే, కాఁబట్టి శివాజీ సంధి వేఁడెను. ఖాన్ గోపీనాథుఁ డను బ్రాహ్మణుని శివాజీసన్నిధి కంపెను. శివాజీ ప్రతాపగఢ్ దుర్గము దగ్గఱ సభామందిరములో దూతకు దర్శన మిచ్చి, వివిధ విషయములను గూర్చి సంభాషించెను రేయి విశ్రమించుటకు గోపీనాథుని ప్రదేశము నిర్దిష్ట మయ్యెను.

రాత్రివేళ శివాజీ గోపీనాథునకు దర్శన మీయఁ జనెను. మహారాష్ట్రప్రభువున కసాధార వాక్పటిమ కలదు. అతఁడు బహువిధముల గోపీనాథునితో "దేవా, మీరు బ్రాహ్మణులు, నాకంటె శ్రేష్ఠులు; అయినప్పటికిని నావాక్యము లవధరింపుఁడు. నేఁ జేసిన సమస్తకార్యములు హిందూ ధర్మము నిలుపుటకే. బ్రాహ్మణులను, గోవులను సంరక్షింప వలసిన దని భవానీమాత నాకు స్వయముగా నాజ్ఞ యొసఁగెను; హిందూ ధర్మవిరోధులను దండింప వలసిన దని యాన తిచ్చెను. తమరు దేవ్యాదేశమును సమర్థింపుఁడు; స్వజాతీయులతోఁ గలిసి నారాజ్యమున సుఖముగా నివసింపుఁడు" అని నచ్చఁ జెప్పెను.

ఈ వాక్యములకు సంతసించి గోపీనాథుఁడు శివాజీకి సాయము చేయ నంగీకరించెను. కార్యసిద్ధికొఱకు శివాజీ అఫ్జుల్ ఖాన్‌తో కలిసి మాటాడుట ముఖ్య మని నిశ్చయించెను.

తరువాత నొకనాఁడు ప్రతాపగఢ్ దుర్గముచెంగటనే వా రిద్దరును సమావేశ మయిరి. తురుష్కసైన్యము సమీపమున నే విడిసి యుండెను. ఒక్క సహచరునితో ఖాను మేనాలో గూరుచుండి నిర్దిష్టప్రదేశమున కేఁగుదెంచెను. ఆ యుదయమున శివాజీ బహునిష్ఠతో దేవీపూజ సలిపి, మాతృవందనము చేసి, ఆమె యాశీస్సు పొందెను; కర్తవ్యకర్తవ్య

పాగా క్రిందను కవచ శిరస్త్రాణములను ధరించి యతఁడు ప్రాణ
స్నేహితుఁ డగు తానాజీ మాలసూరేను వెంటఁ బెట్టుకొని
అఫ్‌జుల్ ఖాన్ సన్నిధికిఁ జనెను. మోసగింపనెంచిన ఖాను
సంగతి గ్రహించి ఆలింగనక్రియలో శివాజీ వాఁడికటారితో
వానిపొట్టలోఁ బొడిచి ముసల్మానును నేలపైఁ గూలఁద్రోచెను.
తత్క్షణమే మహారాష్ట్ర సైన్యము తురకసేనపైఁ బడి దానిని
ధ్వంసము చేసెను. శివాజీ యనేకదుర్గములను బట్టుకొని బీజ
పూర్ నగరమువఱకును దేశమును కొల్లపెట్టెను.

బీజాపూరుతో యుద్ధము మూఁడు సంవత్సరములపర్యం
తము జరుగుచున్నను ఏపక్షమువారికిని విశేష లాభము కలుగ
లేదు. తుదకు ౧౬౬౨ లో షాహాజీ మధ్యవర్తియై, సంధికుది
ర్చెను. షాహాజీని సందర్శింపఁజనినప్పుడు శివాజీ గుఱ్ఱము దిగి,
తండ్రి కభివాదము చేసి, అతని శిబిక వెంట పాదచారియై నడచి
జనకుడు కూరుచుండు మనునంతవఱకు పీఠమును గ్రహింపక
పితృభక్తిని వెల్లడించెను.

షాహాజీ పుత్త్రునికడఁ గొన్ని దినము లుండి సంతుష్టుఁడై
విజాపురమున కరిగెను. తండ్రి సంస్థాపించిన సంధిని శివాజీ
మీఱలేదు. షాహాజీ జీవించి యున్నంతవఱకు బీజపూరుతో
యుద్ధము చేయలేదు. తరువాత సంగరము సంభవించినప్పు
డైనను శివాజీముందుగా సంధి నతిక్రమించినవాఁడు కాఁడు

౧౬౬౨ లో ఈసంధి జరిగినది. ఇదియే మొగలుల తోడి యుద్ధారంభ సమయము. కొంకణదేశ మంతయు శివాజీ యేలుబడిలో నుండెను. ఆతని చేతిక్రింద ఏడువేల గుఱ్ఱపుసేన యు, ఏఁబదివేల కాల్బలము నుండెను. శివాజీకి ముప్పదియేండ్లు.



సూర్యుఁ డస్తమించెను. సింహాగఢ్ దుర్గమున వీరభటులు నిశ్శబ్దముగా సమావేశ మగుచుండిరి వెలుపలనున్న వారికి లోపల నేమి జరుగుచుండెనో తెలియలేదు.

దుర్గమునం దున్నతస్థానమున కొందఱు సుభటులు నిలిచియుండిరి తూర్పుదిక్కున నీరానది ప్రవహించుచుండెను; దక్షిణమున మహాపర్వతములు నూతన పుష్పాదులతోను, దుర్వాంకురములతోను నపూర్వ రామణీయకముగా నుండెను. ఉత్తరమున సస్యక్షేత్రములు సూర్యరశ్మిలో కన్నులపండువుగా నుండెను. దూరమున పూనానగరి విచిత్రముగా గాన్పించుచుండెను. ప్రకృతి వైచిత్ర్యము నవలోకింపక యోజోదులు పూనానగరి చాయఁ దమ దృష్టి నిలిపియుండిరి.

ఏదే నొక సాహసకార్యమువలన చిరమనోరథము సఫలమగుటో, సంపూర్ణనష్టము కలుగుటో సంభవించునో, అట్టి కృత్యమునకు ముందుగా సాహసికుని హృదయమయినను కొంచెము చలింపక మానదు. "ఈనాడు నయిత్రఖాను ససైన్య

ముగా నిహతుఁ డగును; కాఁబా మహారాష్ట్రభానుం డస్తమిం
చును" అను నూహ యావీరుల మానసముల మెలఁగు
చుండెను.

ఆ వీరమండలమున దూరదర్శి యగుపీష్వా మురేశ్వర్
త్రిమూల్ అనునాతఁ డుండెను. అతఁడు చిన్నతనమున
షాహాజీకొలువులో నుండి, తదనంతరము శివాజీసేవయందు
బ్రవేశించెను. ప్రతాపగఢ్ దుర్గము నతఁడు విచిత్రముగా నిర్మిం
చినవాఁడు నాల్గుసంవత్సరముల క్రిందట పీష్వాపదవి నొంది
నాఁడు. శివాజీ అఫ్‌జుల్ ఖానును వధించినతోడనే, మురేశ్వర్
తురకదండుపైఁ బడి దాని నోడించెను. మొగలులతో యుద్ధ
మారంభ మయినప్పటినుండియు నతఁడే పదాతికులకు 'సర్ నౌ
బత్' అనఁగా సేనాపతి, యుద్ధమునఁ బరమసాహసికుఁడు,
ఆపదయందు మహాస్థైర్యవంతుఁడు, రాజకార్యనిర్వాహమున
నత్యంతనిపుణుఁడును, కుశాగ్రబుద్ధి, కార్యదక్షుఁడు నగువాఁడు
మురేశ్వరునికంటె వే ఱెవ్వఁడు శివాజీ యాస్థానమునఁ గాన్పిం
పఁడు.

రాజనీతిజ్ఞుఁడు రణకోవిదుఁడు నగు బ్రాహ్మణుఁడు
ఆబాజీసోనదేవు అను నాతఁడు వారిలో నుండెను. ఆతని
ప్రకృతనామము నీలకంఠు సోనదేవు అయ్యును, ఆబాజీ యను
నదియే ప్రసిద్ధనామధేయము. ౧౬౪౮ లో కళ్యాణ దుర్గ

మును చుట్టుప్రక్కల దేశమును జయించినవాఁ డితఁడే; ఇప్పుడు రాజ్‌గఢ్ దుర్గమును నిర్మింప నారంభించినవాఁడు.

విఖ్యాత నాముఁ డగు అన్నజీ దత్తో కూడ సింహగఢ్ దుర్గమునకు వచ్చెను. నాలుగేండ్ల క్రిందట నతఁడు పవనగఢ్ దుర్గమును జయించెను. శివాజీ ప్రధానోద్యోగులలో వాఁడు.

అశ్వికసైన్యాధిపతి యగు నేతాజీ సింహగఢ్ దుర్గమున లేఁడు. అతఁ డెట్లో మొగల్ సేనను మోసగించి, ఔరంగ్ ఆబాద్, అహ్మద్ నగరులను దోఁచెను. నేతాజీకి మారుగా కర్రాజీ గుజ్జర్ అను నతఁడు కొద్దిమంది యాశ్వికులతో సింహగఢ్ దుర్గమున విడిసి యుండెను.

శివాజీ మావళే మిత్రులలో బాజీ ఫసల్కర్ మూఁడు సంవత్సరముల క్రిందట మృతి నొందెను. తానాజీ మాలసూరేజీ, ఆశాజీకంకు అను నిర్వురు సింహగఢ్ దుర్గమున నున్నవారు. వారలకు శివాజీ యెడ నత్యంత ప్రీతి. నిశానమయమునం దనేక పర్యాయములు వారు మావళే సేనతో పర్వత దుర్గముల తటాలున నాక్రమించి స్వాధీనము చేసికొన్నవారు.

క్రమముగా చీఁకటి పడఁజొచ్చెను. అంతట శివాజీ యనుచరులకడ కేఁగుదెంచెను. అతని ముఖము గాంభీర్యముద్రను వహించి, దృఢ ప్రతిజ్ఞను సూచించుచుండెను; నేత్ర

ములు జాజ్వల్యమానములు, దృష్టి ప్రచంచలము నై యుం డెను. కంచుకములోపల కవచ ముండెను. నేటి పరమ సాహస కార్యమున కతఁడు సంసిద్ధుఁడు.

అంత శివాజీ భృత్యుల నుద్దేశించి "అంతయు సిద్ధముగా నున్నది; మిత్రులారా, కదలుచున్నాను" అని మెల్లన వచించెను.

"నిశ్చయించినా రన్న మాట! సోనదేవుని గాని, అన్నజీని గాని, నన్నుఁ గాని మీ వెంట రానీయరా? మహాత్మా, విపత్కాలమున మిమ్ము నెప్పుడేని విడిచి యుంటిమా?" అన్నాఁడు మురేశ్వర్.

"పేష్వాజీ, క్షమింపుఁడు. పెట్టవద్దు. మీ సాహసము, మీ విక్రమము, మీ విజ్ఞత నాకుఁ గ్రొత్తలు కావు. నేఁడే యీ కార్యము సాధించెదను. కాదా యీ వ్యుష్టి ప్రాణము లను విడిచెదను. అని ప్రతిజ్ఞ చేసి యుంటిని. నాకు జయము కలుగు నట్లు దీవింపుఁడు. ప్రయత్నములో నొక వేళ కీడు మూఁడినను మీరు ముచ్చరు నున్నపక్షమున మహారాష్ట్రము నిలువఁగలదు మీరుగూడ నాతో నున్నచో ననిష్టము సంభ వించినప్పుడు మఱెవ్వరి దూరదర్శిత్వమువలనను, బుద్ధి బలము వలనను దేశము సురక్షితముగా నుండఁ గలదు? జాతీయ గౌరవము నిలువఁ గలదు? దేశస్వాతంత్ర్యమును రక్షించువా

రెవరు ? కాఁబట్టి ప్రయాణ సమయమున నన్ను నివారింప వలదు ” అని శివాజీ పలికెను.

ఇఁక నేమి చెప్పినను లాభము లేదని పీష్వా మిన్న కుండెను. పిమ్మట శివాజీ మృదు స్వరముతో “పీష్వాజీ, మీరు నాకుఁ బితృసములు, నాకు జయము కలుగు నట్లు లాశీర్వదింపుఁడు బ్రాహ్మణాశీర్వచనము నిష్ఫలము కాదు. ఆబాజీ, అన్నజీ, మీరు కూడ దీవన లొసఁగుఁడు. ఇదె బయలుదేరుచున్నాను. ” అని పలికెను.

కన్నుల బాష్పము లురల వారు మువ్వురు మహారాష్ట్రవీరు నాశీర్వదించిరి. తరువాత శివాజీ మావళే మిత్రులను జూచి “ వయస్యులారా, పోయి వచ్చెదను ” అని పలికెను.

“ ప్రభోజీ, మే మేమి యపరాధము చేసితి మని మీ వెంట రాకుండ మమ్ము నిషేధించినారు ? దేవా, కడచిన దినములను స్మరింపుఁడు : కొంకణ దేశమున మీతో నెవ్వరు సంచరించిరి ? కొండ కొమ్ము లందును, పర్వత పాదము లందును, గిరి గహ్వరముల యందును, నదీ తీరము లందును పవ లనక, రేయి యనక మీతో సంచరించినవా రెవ్వరు ? మరణించిన బాజీయు, ఆ శాజీయు, ఈదానుఁడును గాదా ? బాజీ దేవరవారి కార్యముననే మృతి నొందినాఁడు గదా ; మాకును గూడ నదియే కోరిక. అనుజ్ఞ నొసఁగుఁడు, మేము మీతో వచ్చెదము జయము కలుగు నెడల ప్రభువువారి

యానందమును గాంచి సంతసింతుము; ఒకవేళ దేవర వారి కెగ్గు కలిగెనేని, మే మిచ్చట జీవించి యుండియు నేమి లాభము? రాజ్య తంత్రమునందు మీకు సాహాయ్యము చేయుటకు మాకు శక్తిలేదు. ఆ బాల్యసహచరుల మగుమమ్ము విడిచి పో వలదు” అని తానాజీ నేత్రముల బాష్పములు గ్రమ్ముచుండ విన్నవించెను.

“అన్నలారా, మీ కీయరాని దే మున్నది? వేగిరము బయలుదేరుడు” అని శివాజీ అంగీకరించెను.

అనంతర మతఁడు శుద్ధాంతమున కరిగెను. జీజీబాయి యొంటిగా గదిలోఁ గూరుచుండి, కుమారునకు విపత్తు రాకుండుఁ గాక యని కోరుచుండెను. అట్టియెడ నచ్చటికిఁ జని “అమ్మా! దీవించి సెల విమ్మా” అని శివాజీ వచించెను.

జీజీ సస్నేహముగా వత్సా! నీ కష్టములు గడచి, యీ దీనురాలి దుఃఖ మెన్నఁడు కడ ముట్టునో గదా!” అన్నది.

“అమ్మా! నీ యాశీర్వాద బలమున నే నే యాపద నుండి తప్పించు కొన లేదు? ఏయుద్ధమునందు జయము నొంద లేదు?” అన్నాడు.

“నాయనా! దీర్ఘాయుష్మంతుఁడవు కమ్మా! ఈశానీదేవి నిన్ను రక్షించును గాక!” అని పలికి శివాజీ మస్తకము నిమిరెను. కన్నీటిచుక్క లామెవక్షముపైఁ బడుచుండెను.

సైనికులు సంసిద్ధు లయిరి. శివాజీ నిశ్శబ్దముగా నశ్వము నారోహించెను. సందడి లేకుండ సమూహము దుర్గము వెలుపలికిఁ జనెను.

దుర్గద్వారము దాఁటునెడ నొక ప్రాయపుజోదు శివాజీ కెదురుగా నిలిచి మస్తకము వాంచెను శివాజీ వాని నానవాలు పట్టి "రఘునాథజీ, ఇప్పుడు నీవు కోరున దేమి?" అని ప్రశ్నించెను.

"దేవా! తోరణ దుర్గము నుండి పత్రికలు తెచ్చి నప్పుడు ప్రభువువారు ప్రసన్నులై, నాకు బహుమాన మీయ వాగ్దానము చేసిరి."

"ఇదియా నీకుఁ దోఁచిన సమయము? పరమసాహస కార్యము నెఱవేర్చుటకు పోవుచుండ బహుమాన మడుగ వచ్చితివా?"

"నన్నుఁగూడ రా నిచ్చుటయే నాకుఁ బారితోషికము. పోవుచున్న యిరువదియైదుగురు మావళేలతోఁ నీదాసుఁడుకూడ జన నానతి య్యొసఁగుడు."

"రాజపుత్రబాలకా! ఇచ్ఛాపూర్వకముగా నేల సంకట మునఁ దగుల్కొనెదవు? ఎలఁ బ్రాయముననే ప్రాణములు గోల్పోవ నుత్సుకుఁడవై యున్నావేమి?"

"దేవా! తమ వెంట వత్తు నేనిఁ బ్రాణములు పోవు నన్న సంశయము లేదు; ఒకవేళ నేను మృతి నొందినను నా

కొఱకు దుఃఖించువా రీలోకమున నెవ్వరు లేరు. ఇఁక, దేవర వారిని సంతోషింపఁ జేయుదు నేని అప్పుడు నాకు మంచి రోజులు రాఁ గలవు.”

శివాజీ వానిముఖము వీక్షించి, చిరునగవుతో సంగీకారము దెలిపెను. తోడనే రఘునాథుఁడు వినయపూర్వకముగా తల వంచి, చప్పునఁ దన గుఱ్ఱముపై నెక్కి, సైనికలలోఁ గలిసెను.

ఎవ్వరైన గ్రహింతు రను భీతిచే సందడి లేకుండను, వెలుతురు లేకుండను, గుంపుగాఁ బోవక యొక్కొక్కఁడుగా విడిపోయి, తుదకు వారు పూనా నగరము వెలుపలనున్న తోఁటలో సమావేశ మయిరి. రఘునాథుఁడు నీడవోలె ప్రభువు వెన్నంటి యుండెను.

అంధకారము దట్టము కాఁజొచ్చెను. నిశావాత మా యుపవనమునడుమ మర్మరధ్వని చేయుచుండెను. క్రమముగా బాటసారులు తగ్గిపోయిరి. కటికిచీఁకటిలో నేమియుఁ గానవచ్చుటలేదు; ఎండుటాకులచప్పుడు కాక యేధ్వనియు వినవచ్చుటలేదు.

కొంత తడవునకు పూనానగరమున సద్దణఁగెను; దీపములు చల్లారి పోయెను. నిశ్శబ్దముగా నున్న నగరములో నొక్కొకమాఱు యామికుల కంఠధ్వనియు, నడుమ నడుమ

సృగాలభైరవమును వాయుమార్గమున వ్యాపించుచుండెను. అట్టియెడ నాకస్మికముగా 'ఢం ఢం' అను చప్పు డుత్పత్తిల్లెను; తోడనే తోఁటలో డాఁగియున్న వీరులగుండెలు తటతటఁ గొట్టుకొనెను.

మరల 'ఢం ఢం' అనుధ్వని చెవి సోఁకెను. కొందఱు జనులు దీపములు గొని, వాద్యములు మ్రోఁగుచుండ, సందులో నడచుచుండిరి. అదియే యుత్సవము!

పెండ్లిమేళము సమీపమునకు వచ్చెను. పూనారు నల్వంకల చుట్టు గోడ లేకపోవుటచే నయ్యది స్పష్టముగాఁ గాన్పించుచుండెను. మార్గము జనాకీర్ణము; నానావిధ వాద్యముల పెద్ద చప్పుడు వెలువడుచుండెను. కొందఱు గుఱ్ఱముల నెక్కి యుండిరి; మఱికొందఱు నడచుచుండిరి.

శివాజీ మావళే స్నేహితులను గాఁగిలించుకొనెను. అన్యోన్యముఖావలోకనమున "ఇదే కడసారి చూపు" అని వారికన్నులయందు వ్యక్తమగుచుండెను. సందడి కలుగకుండ శివాజీ, అతనియనుచరులును పెండ్లివారిలోఁ గలిసిపోయిరి.

పెండ్లివారు కొంతసేపటికి సయిస్తఖాన్ దిగియున్న భవనముప్రక్కగాఁ జనుచుండిరి; కామినులు గవాక్షములచెంతకుఁ జేరి, యుత్సవము విలోకించి, లోపలి కేఁగి శయనించిరి. యాత్రికులలో ముప్పదుగురు మాత్రము ఖాన్ హర్మ్యము

ప్రక్క డాఁగిరి, కాని వారి నెవ్వరు నుపలక్షింప లేదు. కొంత తడవున కుత్సవపునందడి తగ్గిపోయెను.

తర్వాత నయిస్తఖాను వంటయింటిగోడ కిటికీదగ్గఱ కొంచెము కొంచెముగా చప్పు డగుచుండెను. ఖాను పరివార స్త్రీలు నిద్రించుచుండిరి.

ఒక యిటిక తరువాత నింకొక యిటికె, అటుమీఁద నింకొక యిష్టకము నూడుచుండెను; సున్నము జలజల రాలు చుండెను. అప్పుడు సందేహమనస్కులై పూఁబోండ్లు ఆవంకఁ జూడఁ బోవ, కన్నముగుండ నొకని తరువాత నొకఁడు, వాని వెనుక నింకొకఁడు, వానికిఁ బిమ్మట మఱియొకఁడు ఈప్రకార ముగా మహారాష్ట్రులు గృహములోఁ బ్రవేశించు చుండిరి. అంతట నావనితలు కేకలు వేయుచు, పరుగెత్తిపోయి, నయిస్త ఖానును లేపి, సమాచారము తెలిపిరి.

శివాజీ సంధికొఱకు తన్ను వేఁడుచున్నట్లు ఖాన్ స్వప్నము గాంచుచుండెను; ఆకస్మికముగా ప్రబోధితుఁడై, శివాజీ పూనా నగరము వశపఱచుకొని, తన మేడ నాక్రమించె నన్నవార్త నాకర్ణించెను.

పలాయనార్థము నయిస్తఖాన్ ఒక ద్వారముకడకుఁ జన, నచ్చట కవచ ధారి యగు మహారాష్ట్ర వీరుఁ డొకఁడు కంటఁ బడెను; వే ఱొక ద్వారమును జేరఁ బోవ, అక్కడ నయిత మొకఁడు ప్రత్యక్ష మాయెను. ఖాన్ భయాక్రాంతుఁడై

యొక గదిలోనికిఁ జని, తలుపులు మూసికొని, జాలమార్గమునఁ బాఱిపోవ యత్నించుచుండెను. అట్టియెడ గుండె లవియునట్లు "హర హర, మహాదేవ" అని యఱచుచు, మహారాష్ట్రులు ప్రక్క గది నిండిరి.

సేనాపతి మందిరమును శత్రులు చుట్టు ముట్టి రని కోలాహల మయ్యెను. రక్షక భటులు తెలివిఁ గోల్పోయిరి. వారిలో ననేకులు సహాతుల యిరి; కొందఱకు గాయములు తగిలెను; మిగిలిన వారు మాత్రము ప్రభు రక్షణార్థము పరుగెత్తి వచ్చి, మహారాష్ట్రులపైఁ బడిరి.

శీఘ్రముగా భీమణారవముతో మేడ నిండి పోయెను. దీపముల నార్పివేసి మావళేలు ముసల్మానులతో నంధకారమునఁ బెనఁగుచుండిరి. ఆక్రమణకారుల యుల్లాస ధ్వనితోడను, కవాటముల ఝుంఝుణ ధ్వానముతోను, ఆ హతుల యార్తనాదముతోను హర్మ్యము ఘూర్ణమాన మగు చుండెను. ఆ సమయమున శివాజీ పెద్ద యీఁటె చేతఁ బట్టుకొని "హర హర, మహాదేవ!" అని యార్చుచు, మావళేల మధ్య కురికెను; దోడ్తో వారలు హుంకారము చేసిరి. మొగల్ రక్షక భటులు కాందిశీకు లయిరి. భయంకర మగు బల్లెపుఁ బోటుతోఁ గవాటముఁ బగులఁ గొట్టి శివాజీ సయిస్తఖాను శయనాగారమున వచ్చి పడెను.

సేనానిని రక్షించుటకయి మొగల్ సుభటుఁడు శివాజీ కడ్డు పడెను. అతఁడు చచ్చిన చాంద్‌ఖాన్ పుత్రుఁడు, విక్రమ శాలియు నగు షంషేర్‌ఖాన్! తన తండ్రి యవమానితుఁడై ప్రాణములు గోల్పోయినను, షంషేర్ తన యధికారిని రక్షింప పంసిద్ధుఁ డయ్యెను. శివాజీ వాని నానవాలు పట్టి, "చిన్న వాఁడా! నీ జనకుని నెత్తుటి తడి యింకను నా చేత నాఱ లేదు, నిన్ను వధింపను, దారి విడువుము" అని పలికెను.

షంషేర్‌ఖాన్ ప్రత్యుత్తర మీయ లేదు. వాని కన్నులు నిప్పుకలు గురియుచుండెను. ఆత్మ రక్షా ప్రయత్నము సేయు టకుఁ బూర్వమే శివాజీ మస్తకము మీఁదికి ధగధగ లాడు చున్న షంషేర్ ఖడ్గము దిగుచుండెను.

శివాజీ ప్రాణములపై నాశ వదలి కన్నులు మూసికొని భవానీ నామము నుచ్చరించి, మరల నేత్రములు తెఱచునప్పటికి షంషేర్ నేలపైఁ బడి యుండెను! ఏ మిది యని వెనుకకుఁ దిరిగి చూడ రఘునాథజీ ప్రత్యక్ష మాయెను. తన ప్రభువును ఖం డింప నున్న తురుష్కుని బల్లెపుఁబోటుతో నేలపైఁ బండఁ బెట్టినవాఁ డతఁడే.

"రఘునాథ్! ఈసంగతి మఱచిపోను" అను వాక్యము మాత్రము పలికి, శివాజీ ముందునకుఁ జనెను.

ఈ నడుమ గవాక్షముగుండ రజ్జు సాహాయ్యమున నంబస్తఖాన్ పలాయితుఁ డయ్యెను. ఆ వాతాయనముదగ్గ

అతఁ బరుగెత్తిపోయిన మావళేసైనికుఁడు వేసిన కత్తివేటుతో ఖాన్ వ్రేలొకటి తెగెను, కాని యతఁడు వెనుదిరిగి చూడకుండ కాలికి బుద్ధి చెప్పెను వాని కుమారుఁడు, అబుల్ ఫతే ఖాన్ రక్షకభటులతోఁ బాటు నిహతుఁడయ్యెను. భవన మంతయు రక్తరంజితమైనది. అక్కడక్కడ రక్షకభటుల మృతదేహములు పడియుండెను; ఒకని మొండెము. వేఱొకని మొండెము, ఇంకొకని హస్తము, మఱియొకనికాలును రక్తప్రవాహములో దివ్వటీలవెలుతురులో భీకరముగాఁ గన్పట్టుచుండెను. మొగలులను వధించుటకు మావళేలు నల్వంకలఁ బరుగెత్తుచుండిరి. యుద్ధమునందు జయము చేకూఱిన తరువాత శివాజీ వృథా ప్రాణనాశము చూడ నొల్లఁడు. ఎంతవఱకవసరమో అంతవఱకును శత్రులను యథేష్టముగా రూపుమాపును; కాబట్టి మావళీ సైనికులను చేరఁ బిలిచి, "ఆపాఱుఁబోతు షయిస్త ఖాన్ మనతో నిఁక యుద్ధము చేయఁడు. మనము వేగిరము సింహగఢకుఁ బోవుదము" అని పలికెను.

ఆ చీఁకటిరాత్రివేళ ననాయాసముగా శివాజీ పూనానగరము విడిచి సింహగఢ్ దుర్గమునకు వేగముగాఁ బయనము సేయుచుండెను. రమారమి రెండు క్రోసుల దూరము పోయిన పిమ్మట భటులు కాగడాలు వెలిగించిరి. కరదీపికా కాంతిలో మహారాష్ట్రులు సురక్షితముగాఁ బోయిరి.

మఱునాఁటి యుదయమున కుపితు లగు మొగల్ సైనికులు సింహగఢ్ దుర్గమును ముట్టడి వేయఁ జనిరి, కాని కోట ఫిరంగులతాఁకుడుచే యథాయథ లయిరి. కర్తాజీ గుజర్ ఆశ్వికసైన్యముతో తురుష్కులను చాలదూరము వెన్నాడి, తిరిగి వచ్చెను.

కొద్ది యాపదలవలన సాహసు లగువారికి యుద్ధపిపాస యతిశయించును; కాని సయిస్తఖాన్ అట్టివాఁడు కాఁడు. అతఁడు చక్రవర్తి పేర జాబు వ్రాసెను; అందులో తన సైనికులను ఇష్టమువచ్చినట్లు తిట్టిపోసి, జస్వంతసింగు ద్రోహియై శత్రువునొద్ద లంచము తీసికొనె నని యతనిని నిందించెను. ఇర్వురును చేతకానివా రని భావించి, ఔరంగజేబు వారలను ఢిల్లీకిఁ బిలిపించెను; తరువాత తన కుమారుఁడగు సుల్తాన్ మోజీమ్ అనువానిని దక్కనుదేశమునకుఁ బంపుచు జస్వంతసింగును గూడ వానితో జత చేసెను.

తరువాత నొకసంవత్సరములోఁగా ప్రధాన యుద్ధము లేమియు జరుగ లేదు. ౧౬౬౪ లో షాహజీ మృతినొందుటచే శివాజీ సింహగఢ్ దుర్గమున జనకుని యంత్యక్రియలు నిర్వర్తించె, రాజ్‌గఢ్ దుర్గమున కేఁగి, రాజనామమును దాల్చి, తన పేరిట నాణెములు ముద్రించెను.

ఏ దినమున రఘునాథుఁడు తోరణ దుర్గమునకు వచ్చెనో, ఏ దినమున వాని హృదయము కలఁత నొందెనో, ఆనాఁ డాక బాలమనస్సు కూడ ప్రథమానురాగమున మునిఁగి తేలెను. సంధ్యాసమయమున తోఁటలో స్వదేశీయ యోధను గాంచి సరయూబాల యాశ్చర్య మొంది, మెల్లన నింటికిఁ బోయెను.

నిశా సమయమున సరయువు భోజనము పెట్టుచు, పార్శ్వమున నిలిచి రఘునాథునిఁ జూచెను. నాల్గు కన్నులు కలిసి నప్పు డామె సిగ్గుచే మొగము వాంచి అల్లనఁ దొలఁగి పోయెను.

తొలఁగి పోయెనే కాని యామె మానసమున నూతన వృత్తి యుదయించినది. రఘునాథుఁ డామెను ఉత్సుకతతో జూడ నేల? తన దేశ మందుఁ బుట్టిన దని యేనా?

మఱునాఁటి యుదయమున సరయువు వానిని జూచి కొంచెము కలఁత నొందెను; తరువాత రఘునాథుని మధుర వాక్యముల నాలించి నప్పు డామె గుండె జల్లు మనెను; అతఁడు కంఠమున హారము నుంచి నపుడు శరీరము పులక రించెను; స్వాంతము సంతోష భరిత మయ్యెను; అతఁడు తన కడ సెలవు పుచ్చుకొని యశ్వారూఢుఁడై చనుచుండ సర యువు కిటికీ ప్రక్క నిలువఁబడి అతఁడు చను చున్న మార్గ మును విలోకించుచుండెను.

చాల సేపటివఱకు నామె వాతాయన పార్శ్వమున నిలిచి యుండెను. అశ్వము, రౌతును కనఁబడకుండఁ బోయి చాలఁ దడ వయ్యెను, కాని యామె తెప్ప వాల్పక అటే చూచు చుండెను. మహీధరములు వృక్షశ్రేణులతో మనోహరముగా నుండెను, సెలయేళ్ళు మర్మర ధ్వనితోఁ బ్రవహించుచుండెను. ఉపత్యకయందలి గ్రామములోని కుటీరములు కొంచెముగాఁ గానవచ్చుచుండెను; సస్యక్షేత్రములు కన్నుల పండువుగా నుండెను. బాలభానుఁడు నిజ ప్రభాతరంగములను భువనముపై దొరలించుచుండెను కాని, సరయూబాల వీనిని జూచుట లేదు; ఆమె యంతరంగము ఎచ్చటనో సంచరించు చుండెను.

సరయూబాల యా దినమున నన్యమనస్క యయినది; సాయంకాలము తండ్రిభోజన సమయమున సమీపమునఁ గూరుచుండెను. స్వహస్తములతో జనకునకు పక్క వేసెను; అనంతర మామె తన శయనాగారమునకుఁ జని, నిద్దుర రాక కిటికీలోఁ గూరుచుండి, వెన్నెల నాలోకించు చుండెను.

౧౧

జనార్దనుఁడు సరళ హృదయుఁడు. అతఁడు పవలు శాస్త్రాలోచన మందుఁ గాని, దేవీ పూజ యందుఁ గాని సంసక్తుఁడై యుండును. ఉదయాస్తమయము లందు కిల్లాదారును సందర్శింపఁ జనుచుండును. ఒకొ్కకప్పుడు గృహము నందే

యుండును. సరయూబాల భోజన సమయమున వాని యెదుట నుండనిచో నోటిలోనికి అన్నము పోవునది కాదు. అప్పు డప్పుడు రాత్రులందు జనార్దనుఁడు సరయూబాలకు కథలు చెప్పుచుండువాఁడు. సాధారణముగా నతఁ డేదో పనిలో మునిఁగి యుండును. ఒక నాఁటికే బాలిక మనస్సులో నూతన భావ ముదయించె నని యావృద్ధుఁ డెట్లు తెలిసికొనఁ గలుఁగును?

బాలిక మానసమునఁ బొడసూపిన తలంపు బహు దినస్థాయి కానేరదు. ఒకనాఁటి సాయంకాలమున నామెకుఁ గలిగిన భావోద్రేకము మూఁడు నాల్గు దినములలో తగ్గి పోయెను. అయినప్పటికిని నారీ హృదయమునుండి యొక్క మాఱుగా నిట్టి తలంపు పేరు లేకుండఁ బోవదు. అప్పు డప్పు డాప్రాయపువాని రూప మామెచేతమున మెలఁగుచుండెను. సరయు పొంటరికత్తె, జనార్దనునికంటె వేఱెవ్వరు నా యును వా రామెకు లేరు. యౌవన ప్రారంభమున నామె యెవ్వని నవలోకించుటచే స్వాంతము చీకాకు పడెనో వాని యాకృతియే అప్పు డప్పు డామె మనోనేత్రమునకు గోచర మగుచుండెను.

కల్పనాశక్తి వంచనాశీలము సరయూబాల దినాంతమున పోరణగండ్లప్రక్క నుపదేశించి యున్నను, ఆరామమున విహా రించు చున్నను కల్పన యామెడెందమునఁ గందళించును. ఆ తరుణవీరుఁడు యుద్ధములలో మునిఁగి తేలుచు, దుర్గములను

బట్టుకొనుచున్నట్లును, శత్రువులను ధ్వంసము చేయుచున్నట్లును పేరు ప్రతిష్ఠలు సంపాదించు చున్నట్లును సరయూబాలకుఁ దోఁచుచుండెను. సరయూబాలనుగూర్చి రఘునాథుఁ డెన్నఁ డయినఁ దలఁచుచుండునా? పురుషుని చిత్తము సర్వదా కార్యాయత్తమై యుండును; నానాప్రకార చింతనల యందును, వివిధప్రయత్నము లందును లగ్నమై యుండును. జీవితము ఆశాపూర్ణము కోరిక ఫలవంత మగుఁ గాక, కాకుండుఁ గాక పురుషుఁడు నిరంతర మేదో యుద్యమమునఁ దగిలి యుండును. అట్టిపురుషుని హృదయము ఒకేవృత్తితో నిశ్చలముగా నుండు టెట్లు? అట్లయ్యును, మాయావిని యగు నాశాదేవి సరయువు చెవిఁ జేరి, "ఆ పడుచు వాఁడు నిన్నుఁ గూర్చి తలపోయు చున్నాఁ" డని యూఁదుచుండును.

మరల చింతాదేవి ప్రవేశించును. ఆ వీరుఁ డిప్పటికిని తోరణదుర్గ వృత్తాంతమును స్మరించుచుండునా? ఈవయస్సున, ఈ దినములలో వాని మనస్సు స్థిరముగా నుండునా? నదీ తరంగము తనప్రక్క నున్న ప్రసూనమును గ్రహించి దానితో నించుక సేపు ఆట లాడును; ఆనందమున కుసుమము నాట్య మాడును; ఇంతలో తరంగ మెచ్చటికో పోవును. ప్రసవము కొఱకు మఱలి రాదు. కాని, ఆశ యామె చెవిలో "ఎప్పుడో యొకనాఁడు వయస్సుఁ డీ తోరణ దుర్గమునకు క్రమ్మఱ రాఁ గలఁడు" అని గుసగుస లాడుచుండెను.

ఆకసమునఁ బ్రకాశించు హిమాంశునిఁ జూచుటతోడనే యామె యంతరంగమున కల్పనా శక్తి ప్రవేశించును. తెల్లని గుఱ్ఱము నెక్కి యాశ్వికుఁడు పర్వతమార్గమున వచ్చుచున్నట్లును, గుత్తులు గుత్తులుగా శిరోజములు వాని ముఖమును కొంచెము కప్పి యున్నట్లును, వాని శిరస్సు సువర్ణ శిరస్త్రాణముతో నొప్పుచున్నట్లును, చేతిలో నిడివి బల్లె మున్నట్లును, ఆమె భావించును. అంత నతఁడు దుర్గములోని కేతెంచి, తా నున్న మందిరమునకు వచ్చి భుజింపఁ గూరుచున్నట్లును, తాను వానికి వడ్డన సేయుచున్నట్లును, తరువాత రాత్రివేళ నా మెలఁ బ్రాయపువాని పార్శ్వమున సిగ్గుతో నిలిచియున్నట్లును, అతఁడు యుద్ధవృత్తాంతములు జెప్పుచున్నట్లును దోఁచును.

కల్పనలకు పారము లేదు; మహార్ణవ తరంగ మాలికలవలె నొకదాని తరువాత నొకటియు, దానికిఁ బిమ్మట నింకొకటియు, అటుతరువాత వేఱొకటియు-ఈ విధమున కల్పనలు ప్రవహించుచుండును. మరల సరయూబాల యివ్విధమున భావించును: "యుద్ధము గడచి పోయెను. ఆ వీరుఁడు సమ్మానము గాంచెను. గొప్ప బిరుదులు సంపాదించెను. కాని తన్ను మఱవ లేదు. జనార్దనుఁ డామెను రఘునాథున కిచ్చి వివాహము చేయ నంగీకరించెను. గృహము జనాకీర్ణ మయ్యెను. నల్దిక్కుల దీపములు వెలుగుచుండెను. వాద్యములు మ్రోఁగుచుండెను. గానము మనోహరముగా నుండెను. ఇంకను నేమో జరగు

చుండెను. సరయూ బాలకవి యన్నియు స్పష్టముగాఁ దెలియ లేదు. ఆమె మేలిముసుఁగుతో రఘునాథుని ప్రక్కఁ గూరుచుండెను. కొంచెము చెమ్మగిల్లి యున్న వాని హస్తమున సరయూబాలకర ముండెను. జీవితేశ్వరుఁడు లభించెను, మహానందమున మానసము పొంగి పోయెను!”

పిదప నింకొక చందమున కల్పనా శక్తి విజృంభించును: “రఘునాథుఁడు కీర్తి సంపాదింప లేదు, ఉపాధుల నొంద లేదు. అతఁడు దరిద్రుఁడు కాని సరయువును పెండ్లియాడెను. పర్వతపాదమున నేపల్లియ కాన్పించుచున్నదో, ఎచ్చట శాంతముగా సెలయేఱు ప్రవహించుచున్నదో, ఎక్కడ విస్తీర్ణ శాద్వలములు కేదారములును వెన్నెలలో కన్నుల పండువుగా నున్నవో అట్టి రమణీయప్రదేశమున నున్న కుటీరము సరయూబాల దఁట. దివసావసానమున సరయువు వంట చేసి కుటీరము నెదుటఁ గూరుచుండి, దూరపుఁ బొలమువంకఁ జూచుచుండెను. పవ లెల్ల పరిశ్రమ చేసిన దీర్ఘకాయుఁ డాదిక్కు నుండి కుటీరాభిముఖుఁడై వచ్చుచుండెను. ఆమెహృదయ ముప్పొంగెను. ఆ పురుషశ్రేష్ఠుఁడు సరయువును జేర వచ్చి నూతన హారము నామె మెడలో నుంచెను. ప్రమోదముచే నామె శరీరము పొటమరించెను, హృదయము మిన్నందెను.

ఈప్రకారముగా నొక మాసము, రెండు మాసములు గడచెను, సంవత్సరములు దాఁటెను, కాని సరయువు కల్పనా

ప్రవాహమున కభ్యంతరము లేకుండెను. రఘునాథుని యాకార మామె మనఃఫలకమున చిత్రితము కల్పనలన్నియు మృగతృష్ణా ప్రాయములేనా?

౧౨

కావు ఆమె కల్పనలు కేవల స్వప్నములు కావు. ఆశాదేవి సరయూబాలయెడ విశ్వాసఘాతకురాలు కాలేదు.

ఒకనాఁటిసాయంకాలమున నామె యెప్పటియట్ల పూఁదోటలో విహరించుచు, నడుమ నడుమ తనహారమును జూచుకొనుచు, నేమో చింతించు చుండెను. ఆమెలో కొన్ని మార్పులు కన్పట్టుచున్నవి. ఆశాప్రభావముచే నామె వదనమండలము కాంతిమంతమై యున్నది. నేత్రముల నూతనద్యుతి వ్యాపించి యున్నది. లావణ్యము శరీర మంతటను వ్యాపించి యున్నది. రూపవతియు, చింతాశీలయు, యౌవనసంపన్నయు నగు సరయూబాల నిపుడు బాలిక యనుటకు వీలులేదు. ఆమె పుష్పములు కోయుచున్న యవసరమున రాజపుత్ర తరుణుఁడు మందిరము నెదుట గుఱ్ఱము డిగ్గెను. పూవులు కోయుచున్న రాజపుత్రబాల చెట్లమాటునుండి వానిని జూచి యదరిపడెను ఆప్రక్కనుండి యడుగుల మరల్చుకొన లేకపోయెను.

రాజపుత్రుఁ డా యుపవనమునందే మరల నా జవ్వనిని జూచుట సంభవించెను. ఒకనాఁటి సంధ్యా సమయమున నే

యమరూపముచే నతఁడు మోహితుఁ డయ్యెనో, ప్రాతస్సమ యమున నేయమకంఠమున ముక్తాహారము వైచెనో, యుద్ధ ములయందు శిబిరములందు నేయమఁ గూర్చిన చింత వాని మానసమున పొడచూపుచుండెనో, రాత్రులందు స్వప్నము లలో లజ్జారంజితమగు నేయమ కమనీయాననము కన్నులకుఁ గట్టినట్లుండెడిదో, నేఁటి కిన్నాళ్ళ కాముఖబింబముఁ గ్రమ్మర నవలోకించి రఘునాథుఁడు నిర్వాక్కు నిశ్చేష్టుఁడు నయ్యెను.

తరువాత సరయూబాల గృహమునకుఁ జని జనకునకు రఘునాథుని యాగమనవార్త నెఱిఁగిరచెను. అతఁడును శివాజీ దూతను సాదరముగా స్వాగత మడిగెను.

సాయంకాలమున రఘునాథుఁడు జనార్దను నెదుటఁ గూరుచుండి ప్రసంగవశమున నాతనితో ని ట్లనెను; "నయిస్త ఖాన్ పరాజితుఁడై డిల్లీనగరి కరిగినాఁడు. ప్రభువుగారు రాజ నామము ధరించి, దేశ పరిపాలనమును గూర్చి కట్టుదిట్టములు చేయుచున్నారు డిల్లీచక్రవర్తి రాజుగారిని జయించుటకు అంబీర్ దేశాధీశుఁడు, మహాపరాక్రమశాలియు నగు రాజా జయసింగును బంపియున్నాఁడు. ప్రభువుగారు చింతామగ్ను లై యున్నారు. వారు జయసింగుతో సంధి చేయుదురు. ఈకార్యము నెఱవేఱుటకు అంబీర్ దేశీయులు, శాస్త్రజ్ఞులు నగు తమరు ముఖ్యముగా రావలెను. నేను మిమ్ముఁ దీసికొని

పో వచ్చితిని. రెండుమూఁడు రోజులలోఁగా తమరు రాజ్‌గఢ్ దుర్గమును జేరుట మేలని స్వామిగారు ఆన తిచ్చినారు."

సరయూబాల యింటిలో వంట చేయుచుండెను. ఈ మాట లామె చెవిఁ జేరినవి. జనార్దనుఁడు రాజధాని కేఁగునా ? రాజాజ్ఞానుసారముగా రఘునాథుఁడు వారిని దీసికొనిపో వచ్చెనా ? సరయువు హృదయము నాట్యమాడెను. చేతి నుండీ జలపాత్ర జాఱి క్రిందఁ బడెను.

అంతట రఘునాథుఁడు జనార్దనునితో దేశ వృత్తాంతములను తన కులగోత్రములను జెప్పెను. జనార్దనుఁడును రఘునాథుని యున్నత వంశాదికము నెఱింగి, వాని సౌందర్య వీర్య వినయములకు సంతసించి, వత్సా యని పిలువఁ జొచ్చెను. ఇంతలో భోజనసమయ మయ్యెను. అప్పుడు వృద్ధుఁడు లేచి రాజపుత్రునిఁ గవుఁగిలించికొని, "వత్సా, రఘునాథా, ఇఁక భోజనమునకు లెమ్ము. ఈనాఁడు నీ వృత్తాంతము దెలిసికొని సంతుష్టచిత్తుఁడ నయితిని. నీ వంశము నే నెఱుఁగనిది కాదు. నీ గుణములు వంశ గౌరవమునకుఁ దగియున్నవి. సరయూదేవిని పుత్రికగా స్వీకరించితిని నిన్ను నేఁడు పరిగ్రహించినాను. భగవానుఁ డనుగ్రహించునేని, యుద్ధము ముగిసిన తరువాత నాతల్లిని నీ వంటివాని కిచ్చి పెండ్లి చేయఁగల్గుదునేని నిశ్చింతగా కాలము పుత్తును. జగదీశ్వరుఁడు నీకును నాతల్లి సరయువునకును సుఖము నిచ్చుగాక !" అని పలికెను.

ఈ వాక్యము లాకర్ణించునప్పటికి రఘునాథుని కన్నుల వెంట నీరు గిఱ్ఱునఁ దిరిగెను. అంత నతఁడు జనార్దనునిపాదముల మీఁద వ్రాలి "తాతా, ఈ దరిద్ర సైనికుఁడు మీ కోర్కి సఫలముచేయునట్లు దీవింపుఁడు. నేను హావల్దారును. ధనము లేదు, అధికారము లేదు. కాని యీశ్వరానుగ్రహమునను, తాతగారి యాశీర్వచన బలమునను యమూల్య రత్నమును గ్రహింప నర్హతకై ప్రయత్నము చేయుదు" అని పలికెను.

వాక్యములు సరయువు చెవిఁ జేరెను; గాలి తాఁకున నెండు టాకు వోలె నామె మైదీఁగె కంపించుచుండెను.

ఆ పూఁట రఘునాథుఁడు తిన్నగా నన్నము దినలేదు, సరయువుగూడ సరిగా వడ్డన చేయలేదు.

## ౧౩

ప్రయాణ సన్నాహము పూర్తి యగునప్పటికి మూఁడు దినములు గడచెను. రఘునాథుఁడు జనార్దనుని గృహముననే విడిచియుండెను. ప్రాతస్సాయంకాలములందును సరయువు పూఁదోటలో వానికిఁ గాన్పించుచుండెను. ఆమె ప్రియ హాస్యముతో వడ్డించిన యాహారము నతఁడు భుజించుచుండెను. సాహసించి సరయువుతో నతఁడు మాటలాడ లేకపోయెను. ఆమెను జూడఁగానే వానిగుండెలు తటతట గొట్టుకొనును. సర

యూబాలయు వాని నవలోకించినంతనే మేలిముసుఁగు ముందు నకు లాగికొని తొలఁగిపోవుచుండును.

తోరణదుర్గమునుండి రాజ్‌గఢ్‌దుర్గమునకు పయనము చేయుచుండ సరయువు మేనా వెంట నతఁడు చనుచుండెను. దుర్గమమార్గమునఁ గాని, చెట్లు లేని మైదానమునఁ గాని చతు రంతయానము నతఁడు విడిచి యుండుటలేదు. రాత్రులందు సరయువు నిద్రించుగదిప్రక్క నన్నిద్రితుఁడై బల్లెముతో నిటు నటుఁ బ్రచారము సేయుచుండెను.

స్త్రీ యీసంగతులను గ్రహింపఁగలదు. పురుషుని పరిచర్య జాగ్రత మొద లగునవి యేఁడువారికన్నులకు మఱుఁ గుగా నుండవు. సరయువు శిబికలోనుండి విసువులేని యారో తును విలోకించుచుండును. అప్పుడామెకన్నులు ప్రమోదాశ్రు వులతో నిండిపోవును.

సరయూబాల యాసైనికునకు భోజనము పెట్టునపుడు మున మౌనావలంబి యగు వానిని గాంచి మొగము వాంచు చుండును, పదార్థములను తిన్నగా వడ్డింప లేకుండును; ప్రయా ణము చేయుచున్నప్పుడు తనవెన్వెంటనె గుఱ్ఱముపై వచ్చు వానిచాయనుండి నేత్రములు మరల్చుకొన లేకుండెను.

ఈప్రకారముగాఁ బ్రయాణముచేయుచు నొకనాఁటి సాయంకాలము వార రాజ్‌గఢ్ దుర్గమును సమీపించిరి. జనార్దనుఁడు పర్వతపాదమందలి గ్రామమున విడిసి "అనుజ్ఞ

యయ్యోనేని దుర్గములోఁ బ్రవేశింతును" అని మహారాష్ట్ర దీశునకు వర్తమాన మంపెను.

ఆరాత్రి భోజనము సిద్ధమగుట కొంచెము జాగయ్యెను. జనార్దనుఁ డింతనీరు త్రావి పన్నుండెను. భోజనానంతరము రఘునాథుఁ డనుదినమువలె గృహమునుండి నిష్క్రమింపక యేమో పని యున్నవానివలె నిటు నటు తారట లాడుచు కొంతతడవునకు సరయూబాలను సమీపించి, నతశిరస్కుఁడై ధైర్యము దెచ్చుకొని, "దేవీ, యిఁక నాకు సెల వీయ వలెను" అని పలికెను.

పిపాసార్తునకు వర్షధారవలె రఘునాథుఁ డాడిన వాక్యము సరయూబాలకు సుధాప్రాయ మయ్యెను. లజ్జావనతవదన యయి యామె లేచి నిలువఁబడెను.

తెగించి రఘునాథుఁ డామెతో "దేవీ, సెల వీయ వలెను. మీరు రేపు రాజప్రాసాదమున కేఁగుదురు. ఈ సైనికుఁడు మరలఁ దనపనిలోనికిఁ జనును" అనెను.

ఈ పర్యాయ మామె సిగ్గును వెనుకకుఁ ద్రోసి కన్నీరు దుడిచికొని, నారీజనోచిత మగు మమతతో "తమరు మా కోసము పడిన ప్రయాసకుఁ బ్రతిఫలముగా భగవంతుఁడు తమకు యుద్ధమున విజయమిచ్చుఁగాక! తమకోర్కె సఫలము చేయును గాక! మీరు పడిన శ్రమకు మే మేమి ప్రతిదానము చేయఁగలము?" అని వచించెను.

"ప్రభువుగారి యానతిచొప్పున మిమ్ము రాజ్‌గఢ్ దుర్గమునకు సురక్షితముగా తీసికొని రాఁ గల్గితిని. ఇదియే పరమభాగ్యము. ఈసైనికుని సపర్యచేఁ దమరు సంతుష్టిఁ జెంది యుంటిరేని, అప్పుడు—అప్పుడు ఇతనిని మఱచి పోవలదు!" అని రఘునాథుఁడు వినయముతో బల్కెను.

సరయువు వాని యాశయము గ్రహించి యవనత ముఖి యయ్యెను. అప్పుడు రఘునాథుఁడు సాహసముతో నిట్లనెను.

"ఈ సైనికుఁడు పెద్ద యాశ పెట్టుకొని యున్న యెడల మీరు క్షమింప వలెను. మీ నాయనగారు నన్ను ప్రసన్న దృష్టితో విలోకించిరి; మీరును నా యెడ నప్రసన్నత వహింప రని నమ్ముచున్నాను. నా ప్రయత్నములు ఫలవంతము లగు నేని మనసులోని మాట నొకనాఁడు వెలి పుచ్చెదను. అంత వఱకును వీనికి దేవిగారు తమ స్మరణ పథమున నప్పుడప్పుడు తావొసఁగు చుందురుగాక!"

వినీతభావముతో రఘునాథుఁ డామెను వీడ్కొనెను. సరయూబాల గడియవఱకు నతని మార్గముదెసఁ జూచుచు నిలిచి యుండెను. అర్ధ రాత్రమున నిట్టూర్పు విడిచి, "సైనిక శ్రేష్ఠ! నిరంతరము మీ రీ దాసి హృదయమున మెలఁగు చుందురు. భగవానుఁడే సాక్షి!" అనుకొనెను.

నయిస్తఖాన్, జస్వంతసింగు నసమర్థు లని భావించి ఔరంగ్ జేబ్ వారిని ఢిల్లీకి పిలిపించుటయు, మరల జస్వంత సింగును, సుల్తాన్ మోజీమ్‌ను దక్షిణ దేశమున కంపుటయు జరిగినది వీరుగూడ కార్యసిద్ధి చేయలేకపోవుటచేత చక్రవర్తి వీరిని వేఱొకచోటికిఁ బంపి, సుప్రసిద్ధుఁడు అంబీర్ దేశాధిపుఁడు నగు జయసింగును, దిల్వార్ ఖానును దక్షన్ దేశమున కనిచెను. వీరు ౧౬౬౫ చైత్రమాసావసానమున పూనా నగరమును బ్రాపించిరి. సయిస్తఖాను వలె నిరుత్సాహియై యుండక జయసింగు దిల్వార్ ఖానును పురందర దుర్గము ముట్టడివేయ నాజ్ఞాపించి, తన సైనికులను సింహగఢ్ దుర్గము నాక్రమింప నాదేశించి, తాను రాజ్‌గఢ్ మీఁదికి మిగిలిన సేనతో దాడి వెడలెను.

శివాజీ హిందూ సేనానితో యుద్ధము చేయఁడు; విశేషించి జయసింగు కీర్తిప్రతాపములు తీక్ష్ణబుద్ధి, మహాసైన్యము నతని కగోచరములై యుండలేదు. జయసింగును బోలు బుద్ధిమంతుఁడు, దూరదర్శి, న్యాయ విచక్షణుఁడు పరాక్రమశాలి వేఱొకఁడు భరత ఖండమున లేఁడని తత్సమకాలిక ఫ్రెంచి యాత్రికుఁడు బెర్నిజ్ లిఖించి యున్నాఁడు. శివాజీ ప్రయత్నము లన్నియు భగ్నములు

కాఁజొచ్చెను. మాటిమాటికి కతఁడు జయసింగు సన్నిధికి సంధిప్రస్తావన మనుపుచున్నను కుశాగ్రబుద్ధి యగు జయసింగు శివాజీని విశ్వసింపలేదు. తుదకు మహారాష్ట్ర ప్రభుని మంత్రి రఘునాథపంత్ న్యాయశాస్త్రి దూతగాఁ జని శివాజీ క్షత్రియోచితగౌరవము నెఱుఁగు ననియు జయసింగునకు నచ్చఁజెప్పెను. శాస్త్రవిదుఁ డగు విప్రుని మాటలు విశ్వసించి జయసిం గాతనిచేయి పట్టుకొని "ద్విజాగ్రణీ, మీ వాక్యములకు సంతసించితిని. ఢిల్లీశ్వరుఁడు మీరాజుగారిని మన్నించును. అందులకు నామాట పాటిగాఁ జేకొనఁదగును. రాజపుత్రునివాక్య మెన్నఁడు నన్యథా కానేరదు. ఈలాగని మీరాజుగారికి విన్నవింపుఁడు" అని పలికెను.

పిమ్మట ప్రావృట్కాలమున నొకనాఁడు జయసింగు కొలువు దీర్చియుండగా సేవకుఁ డరుదెంచి, "మహారాజుగారికి జయ మగుఁ గాక! శివాజీ ప్రభువువారు తమ దర్శనముచేయఁ గోరి గుడారమువెలుపల నున్నారు" అని విన్నవించెను.

సభాసదు లెల్లరు విస్మితు లయిరి. జయసింగు శివాజీ నాహ్వానించుట కయి వెలుపలికిఁ జని సగౌరవముగా లోనికిఁ గొనివచ్చి, తనపీఠముపై కుడిప్రక్కఁ గూరుచుండఁజేసెను.

మహారాష్ట్ర నృపాలుఁడును ఇట్టి సమాదరమున కెంతయు సంతసించెను. పిమ్మట జయసింగు "రాజా! తమరు నా

శిబిరమునకు విచ్చేసి నన్ను సన్మానించితిరి. దీనిని స్వగృహ ముగా నెంచవచ్చును” అని చెప్పెను.

“రాజా! ఈదాసుఁడు తమ సా .నతిచొప్పునఁ బ్రవర్తించుట కెన్నఁడు విముఖుఁ డయ్యెను. రఘునాథపంత్ న్యాయశాస్త్రిద్వారా ఈదాసునకు రా నాజ్ఞ యొసఁగితిరి. కావున దాసుఁడు వచ్చినాఁడు. తమ యుదారాచరణమున నేను మిక్కిలి సన్మానితుఁడ నయితిని.”

“అగును. రఘునాథపంత్ న్యాయశాస్త్రిగారితోఁ జెప్పినసంగతి జ్ఞప్తియం దున్నది. రాజా! నేఁ జెప్పినవిధమునఁ జేయుదును. ఢిల్లీశ్వరుఁడు మిమ్ము గౌరవించును. ఈవిషయమై నేను వాగ్దానము చేయుచున్నాను. రాజపుత్రునిమాట అన్యథా కానేరదు.”

ఇట్లు సంభాషించినవెనుక సభ చాలించిరి. అచ్చట జయసింహుఁడు శివాజీయును దక్క నన్యులు లేరు. అయ్యెడ శివాజీ కపటానంద చిహ్నములను విడిచి, చెక్కిటఁ జేయి పెట్టుకొని యేమో చింతింపఁజొచ్చెను. జయసింగు అతని నేత్రముల బాష్పకణముల నుపలక్షించి యిట్లనెను :

“రాజా! తాముగానే వచ్చి చిక్కువడితి రన్న ఖేదముతోఁ బనిలేదు. మీరు నమ్మి నాకడకు వచ్చినారు. రాజపుత్రుఁడు తన్ను నమ్మినవారిపై నీఁగ వాఁలనీయఁడు. ఇప్పుడే నా యశ్వశాలనుండిగుఱ్ఱమునువిప్పుకొనిమరలిపొండు; నాయాజ్ఞాను

సారముగా రాజపుత్రుఁడెన్నఁడును మీకోలికి రాఁడు. వచ్చినవిధమునసే సురక్షితముగా తిరిగిపొందు. యుద్ధమున జయము గాంతునా, మంచిదే; లేకున్నను విచారము లేదు. కాని క్షత్రియధర్మము నెన్నఁడు విడువను."

మహారాజ ! భవాదృశు లగు మహాపురుషుల సమక్షమున పరాజయము స్వీకరించితి నన్న ఖేదము లేదు. బాల్యావధిగా దేనినిగూర్చి శ్రమ పడుచుంటినో అట్టిమహోద్యమము నేఁటితో భగ్న మయ్యె నన్న చింత హృదయమును ప్రకంపించుచున్నది. అయినను, తద్విషయమున గుండె రాయి చేసికొనియే తమసన్నిధానమునకు వచ్చితిని."

"మ రెందులకు విచారము ?" "చిన్న తనమునుండియు తమ యశోగీతములను బాడుట నాకు సంతసము. గీతములయందలి యర్థము నేఁడు స్పష్టముగా బోధపడినది. లోకయులో సత్యము, ధర్మము, మహత్వము నున్న యెడల నవి రాజపుత్రులయందే కలవు. అట్టి రాజపుత్రులరాజు యవనాధికారమునకు లోఁగియుండునా ? జయసింహ మహారాజుగారు మ్లేచ్ఛచక్రవర్తి సేనాపతియా !"

"క్షత్రియప్రవరా ! అదియా ప్రకృతఖేదమునకుఁ గారణము ? రాజపుత్రులు సహజముగా మ్లేచ్ఛులకు లోఁబడలేదు; సాధ్య మగునంతదనుక ఢిల్లీతోఁ బెనఁగి, విధివిధానమున పరా

జితు లయిరి. ప్రాతస్మరణీయుఁడు, వీరాగ్రగణ్యుఁడు నగు మహారాణా ప్రతాపసింగు అసాధ్యప్రయత్నములు చేసియుండెను. కాని, సంతతివారుకూడ ఢిల్లీకి కప్పము కట్టుచున్నారు. ఈసంగతు లెల్ల మహాశయునకు విదితము లనియే తలఁచుచున్నాను."

"అగును. ఆమాట యటుంచి, యిన్నిదినములవఱకును పరమశత్రువు లగువారి కార్యసాధనమందు మీ కింత పట్టుదల యేల?"

"ఎప్పుడు ఢిల్లీ సేనాపతిత్వమును పరిగ్రహించితినో అప్పుడే వానిపనులను చక్కఁబెట్టుదు నని వాగ్దానము చేసినట్లు కాదా? మాట యిచ్చినప్రకారము ప్రవర్తించువాఁడను"

"ఎల్లవేళల, నెల్లరవిషయమై సత్యము పాలనీయమా? మనదేశమునకుఁ బరమశత్రువులు, మనధర్మమునకుఁ బరమ ద్రోహులు నగువారియెడనా సమయపరిరక్షణము?"

"తమరు క్షత్రియు లయ్యు నిట్లనుచున్నారా? రాజపుత్రుల చారిత్రమును విలోకింపుఁడు. వందలకొలఁది సంవత్సరములు వారు ముసల్మానులతో యుద్ధములు చేసి అప్పుడప్పుడు జయము గాంచుచుండువారు. కాని, సర్వదా సత్యము ననుష్ఠించువారు. ఇప్పుడు మాకాస్వాతంత్ర్యగౌరవములు లేవు. కాని సత్యపాలనాగౌరవము నిలిచియున్నది. స్వదేశ

మందును, విదేశమందును, మిత్రులమధ్యను శత్రులమధ్యను రాజపుత్రుఁ గన్న మిగుల సన్మానము. తోడర్మల్లు మహారాజు వంగదేశమును జయించెను; మానసింగు మహారాజు కాబూల్ మొదలుకొని ఒరిస్సావఱకును విజయధ్వజములు నాటెను; ఎవ్వఁడును విశ్వాసఘాతకుఁడు కాలేదు, ముసల్మాన్ చక్రవర్తిసమక్షమునఁ బలికినవిధమున నడచుట లోప మని యెవ్వఁడు తలఁచియుండ లేదు. మహారాష్ట్రాధిపా! రాజపుత్రుని మాటయే సంధిపత్రము. అనేకసంధిపత్రములు వమ్మయ్యెను; కాని రాజపుత్రుఁ డాడినమాట యెన్నఁడు నతిక్రమింప లేదు."

"జస్వంతసింగు మహారాజుగారు రాజపుత్రశ్రేష్ఠులలో వారే గదా వారు ముసల్మానులపక్షము విడిచి, మాకు తోడ్పడ లేదా?"

"ఆయన రాజపుత్రుఁడు, వీరశ్రేష్ఠుఁడు, ధర్మపరాయణుఁడు, సందేహము లేదు. ఆయనదేశము విశేషభాగము మరుభూమి; సైనికులు చేవదేలినవారు. అంతయు బాగున్నది, కాని, ఆయన తనసైన్యముతో దేశస్వాతంత్ర్యమును రక్షించునేని, నే నాయనను బ్రశంసింతును, విజయియై ఔరంగజేబును పాఱఁద్రోలి సింహాసనము నధిరోహించునేని, నే నాయనను చక్రవర్తి యని సన్మానింతును, స్వదేశరక్షణోద్యమమున మృతి నొందినను, నే నాయనను మహానుభావుఁ డని పూజిం

తును. ఏనాఁ డతఁడు ఢిల్లీశ్వరుని సేనాపతి యయ్యెనో, ఆనాఁడే ముసల్మాన్ సేవకుఁ డయ్యెను. వ్రతము నవలంబించి దానిని భంగపఱచుట క్షత్రియునకుఁ దగిన పని కాదు. జస్వంతసింగు తనయశో రాశిలో కళంకము తెచ్చిపెట్టుకొన్నాఁడు. సిప్రానదీ తీరమున ఔరంగజేబుచే నోడినది మొదలుగా నతఁడు చక్రవర్తియెడ ద్వేషము నహించి యున్నాఁడు. కానిచో గర్హ్యామగు నట్టి కార్యము చేసియుండఁడు!"

జయసింగు జస్వంతసింగు కాఁ డని శివాజీ గ్రహించి యిట్లనెను: "హిందూధర్మసంరక్షణము చేయువానికి తోడ్పడుట గర్హ్యమా? భ్రాతృభావముతో సాటిహైందవునకు సాహాయ్యము చేయుట నింద్య మగునా!"

"నే నాలాగున చెప్పలేదు. ఎందుచే జస్వంతసింగుగారు ఔరంగజేబుపక్షము విడిచి లోకులు చూచుచుండ భగవంతుఁడు సాక్షియై యుండ మీపక్షము చేరినారు? వీరు చేయుచున్న ప్రయత్నము వారేల చేయరాదు? చక్రవర్తి సేవకుఁ డయ్యును, తద్విరుద్ధముగా ప్రవర్తించుటచే నతఁడు కపటి కాలేదా? క్షత్రియప్రభూ! కపటవర్తనము క్షత్రియోచితమా?"

"బహిరంగముగా వారు నాపక్షము చేరునెడల ఢిల్లీశ్వరుఁ డింకొక సేనానిని నియోగించును. దైవవశమున మేమిర్వురము పరాజితులము, నిహతులమును కావచ్చును"

"యుద్ధమున మృతి నొందుట క్షత్రియునకు పరమ సౌభాగ్యము; కపటవర్తనముచే బ్రదికినను చచ్చినట్లే !"

క్రోధముచే వదనము జేవురింప శివాజీ యిట్లనెను: "రాజ పుత్రా! మహారాష్ట్రులుగూడ మరణమునకు వెఱచువారు కారు మృతి నొందుటవలన నాయుద్దేశము కొనసాగునేని, ఈప్రాణము లను భవానీదేవిసమక్షమున విడిచెదను, పోసీ మీఁబల్లెముతోఁ బొడిచివేయుఁడు, సానందముగా మృతి నొందెదను బాల్యా వధిగా దేనినిగూర్చి కలవరించుచుంటినో, ఎద్దానికొఱకు బహు యుద్ధములు చేయుచుంటినో, ఎయ్యది నిరంతరము నామనః ఫలకమునఁ బ్రతిఫలించుచున్నదో అట్టిహిందూసముద్ధరణాభి లాషను నేఁడువిడుచుటకు మనస్సు కొట్టుకాడుచున్నది. యుద్ధ క్షేత్రమున ననువులఁ దొరగుచో మహోద్యమము నెఱ వేఱునా ?"

శివాజీ వాక్యముల నాకర్ణించి, జయసింగు వెనుకటి విధముననె దృఢముగా "సత్యపాలనమున సనాతనహిందూధర్మ రక్షణము కానిచో సత్యోల్లంఘమున కాఁగలదా ?" అనెను.

శివాజీ చిక్కువడి కొంతతడవు పూరకుండి క్రమ్మఱ ధీరముగా నిట్లనెను: "మహారాజా, మిమ్ముఁ బితృభావముతో జూచుచున్నాను. మిముబోఁటిధీమంతుని, ధర్మజ్ఞుని, యోధను నేనెన్నఁడును జూడ లేదు. మి మ్మొకసంగతి యడిగెదను: తమరు పితృసదృశ మగుహితము నుపదేశింపవలెను, నాచిన్న

తనమున కొంకణప్రదేశమున కొండలలోను, అడవులలోను
దిరుగుచుండునపుడు స్వప్నము కాన్పించుచుండునది. అప్పుడు
భవానీదేవి సాక్షాత్కరించి, స్వాతంత్ర్యము నెలకొల్పవలె
ననియు, గోవత్సాదులను రక్షింప వలయు ననియు, ముసల్మా
నులను సంహరింప వలె ననియు నా కానతిచ్చి, అంతర్ధాన
మగుచుండునది. ఆయుత్సాహమున శరీరము మఱచి, ఖడ్గము
చేఁబూని, వీరశ్రేష్ఠుల నోడించి, అనేకదుర్గములను పట్టుకొన
నారంభించితిని, క్రమముగా రాజ్యము విస్తరించి, దేవాలయ
ములను స్థాపించి, స్వాతంత్ర్యము నిర్వహించుచుంటిని. క్షత్రియ
పుంగవ! ఈనాయుద్దేశము నిందింపఁ దగినదా? కాక యలౌ
కికమా? హితము బోధింపుఁడు.”

దూరదర్శియు, ధర్మపరాయణుఁడు నగు జయసింగు
ఇంచుకతడవు మ్రాన్పడి యుండి, పిమ్మట గంభీరవాక్కులతో ని
ట్లనెను: “రాజా! మీయుద్దేశముకంటె శ్లాఘనీయ మగునది
వేఱొకటి లేదు. మీమహోద్దేశము నన్నియెడలను బ్రశంసించి
యుంటిని; మిమ్ము నుదాహరణముగాఁ జూపి నాకుమారుని,
రామసింగును శిక్షించియుంటిని. ఎటు చూచినను మొగల్
సామ్రాజ్య మిఁక నిలువనట్లు తోఁచుచున్నది; పాపపరిపూర్ణమై
హిందువులయెడఁ గావించినయక్రమకార్యములచే శప్తమై,
పతనోన్ముఖమందిరమువోలె నిలువలేకున్నది. శీఘ్రముగనో,
కొంచె మాలస్యముగనో యీరాజ్యము రూపుమాసిపోవును;

అనంతరము హిందూగౌరవము తల యెత్తును. మహారాష్ట్రజీవన మంకురించి, ప్రబలి, యౌవనోత్సాహము భరతఖండమున వ్యాపించుచున్నది. రాజా! మీకు భవానీదేవి మిథ్యోత్సాహము కల్గింప లేదు."

ఉల్లాసమున శరీరము గగుర్పొడువ, శివాజీ యిట్లనెను: "అల్లాగయిన, పతనోన్ముఖ మగు మొగల్ సామ్రాజ్యప్రాసాదమున కు భవాదృశు లగు మహానుభావులు స్తంభస్వరూపులై యున్నా రేల?"

"సత్యపరిపాలనము క్షత్రియధర్మము. ఆడినమాట తప్పువాడను కాను. పతనోన్ముఖమందిరము పడనే పడును."

"మంచిది, సత్యమును పాలింపుడు. కపటి యగు చక్రవర్తియెడఁగూడ మీధర్మాచరణమునకు లోకము మిమ్ముఁ బ్రశంసించును, నేనుమాత్రము వానివిషయమై న్యాయమార్గమునఁ బ్రవర్తింపను."

"క్షత్రియుఁడా! కపటవర్తనము వీరున కెన్నఁడును తగదు; విశేషించి, మహోద్యమము తలపెట్టినప్పు డింకను నింద్యమే. మహారాష్ట్రుల యభివృద్ధి యనివార్యము; వారి ప్రతాపము క్రమముగా పెంపొందును. ఒకనాఁడు వారుభరత ఖండ ప్రభువులు కావచ్చును కాని, యిప్పుడు మీరు నేర్పు శిక్ష వా రెన్నఁటికిని మఱచిపోవరు. నామాటలు తప్పుగా నెంచవలదు; ప్రస్తుతము మీరు వారలకు దోఁపిడి నేర్పు

చున్నారు. తేపు వారు దేశమును మలమల మాడ్చివేయు దురు, ఇప్పుడు మీరు జిత్తులు గలప్పుచున్నారు. ఇంక వారు బహిరంగ యుద్ధ మెన్నటికిని చేయరు. కొలంది కాలములో హిందూదేశమును శాసింప నున్నవారికి మీరు ప్రథమగురు వులు; మీరు మందశిక్ష యొనఁగునెడల దానిఫలము బహు కాలము నిలిచి యుండును. దూరదర్శి యగు నీ వృద్ధుని మాట లవధరించి, మహారాష్ట్రులకు సమ్ముఖయుద్ధము నేర్పుఁడు; మాయవేషములు వల దని శాసింపుఁడు. మీరు హిందూ శిరోమణులు. మీ మహోద్దేశమును నే ననేకసార్యాయములు ప్రశంసించియున్నాను. మీరే యుత్తమశిక్ష నొసఁగనిచో నింక నొసఁగువా రెవ్వరు? మహారాష్ట్రదేశికాగ్రణీ! అవధ రింపుఁడు. మీ చేయు ప్రతికార్యఫలము బహుకాలము నిలిచి యుండును, బహుదేశములందు వ్యాపించును."

ఈ గంభీరవాక్కుల నాకర్ణించి, రిచ్చవడి, తొందరు శివాజీ "తమరు పరమగురువులు, తమ యుపదేశము శిరో ధార్యము. చక్రవర్తి యాధిక్యము నంగీకరించితిని. హింసోప దేశ మెప్పుడు చేయుదురు?" అని యడిగెను

"జయ పరాజయములు స్థిరము కావు; నేఁడు మాకు జయము కలిగిన, తేపు మీకు గెల్పు సంభవింప వచ్చును; నేఁడు మీరు చక్రవర్తి యాధిక్యము నంగీకరించితిరి, ఘట నాక్రమమున తేపు మీకు పునస్స్వాతంత్ర్యము లభింప వచ్చును."

"ఈశ్వరుఁ డాలాగుననే యనుగ్రహించుఁ గాక! కాని, మీరు వాని సేనాపతులై యుండఁగా నా యాశ కేవలము వృథా. హిందూసేనతో యుద్ధమును భవానీదేవి నిషేధించినది."

జయసింగు సంతోషముతో "దేహము క్షణభంగురము; ఈజరచ్ఛరీర మింక నెన్నిదినములు నిలుచును! కాని, ఉన్నన్నినాళ్ళును సత్యము నతిక్రమింపను" అని పలికెను.

తమరు చిరంజీవు లగుదురు గాక!

"రాజా! యింక నాకు సెల వీయవలెను. నేను షాహజహాన్ కొలువులో నుంటిని. ఇప్పుడు ఔరంగజేబును సేవించుచున్నాను. జీవించియుండఁగా నీవృద్ధుఁడు ఢిల్లీకి విరుద్ధముగా బ్రవర్తింపఁడు. కాని, క్షత్రియ పుంగవా! నిశ్చింతగా నుండుఁడు. మహారాష్ట్ర స్వాతంత్ర్య మనివార్యము, మొగలు సామ్రాజ్య మింక నిల్వదు; త్వరలోనే హిందూపరాక్రమము, మీ ప్రఖ్యాతియును దేశదేశములందు వ్యాపింపఁగలదు."

అశ్రుపూర్ణలోచనుఁడై, జయసింగు నాలింగనము చేసి, శివాజీ యిట్లనెను: "ధర్మాత్మా! మీ మాటలే నిక్కము. మీతో యుద్ధము చేయను, కాని ఘటనాక్రమమున మరల స్వాతంత్ర్యము లభించునేని, క్షత్రియపుంగవా! అప్పు డొకనాఁడు తమ దర్శనము చేయుదును, తాతగారి చరణోపాంతమునఁ గూరుచుండి, యుపదేశము గ్రహింతును!"

శీఘ్రముగా సంధి కుదిరెను. మొగలులనుండి శివాజీ జయించిన యాయాదుర్గములను మరల వారి కిచ్చివేసెను. నామావశిష్ట మయిన అహ్మద్‌నగర్ రాజ్యమునందలి తన ముప్పదిరెండు దుర్గములలో చక్రవర్తికి విడిచిన యిరువది పోఁగా మిగిలిన పండ్రెండు దుర్గములను జాగీరువలె శివాజీ యనుభవించుచుం డెను. ఔరంగజేబు శివాజీకి బీజపూరునందలి కొన్ని ప్రదేశ ముల నొసఁగి, ఎనిమిది సంవత్సరముల శంభుజీని, శివాజీ పుత్రుని పాంచ్‌హజారీ మన్సబ్‌దారిని జేసెను.

శివాజీతో యుద్ధము ముగిసినవెనుక జయసింగు బీజ పూరురాజ్యమును చక్రవర్తి యధీనతలోనికిఁ దీసికొని రాఁ బ్రయత్నము చేయఁజొచ్చెను. బీజపూరులో తనతండ్రి షాహాజీ స్థాపించిన సంధిని శివాజీ యుల్లంఘింపలేదు. కాని బీజపూర్ సుల్తాను సంధి నతిక్రమించి శివాజీ చిక్కులలో నుండ నతని రాజ్యము నాక్రమించుటకు సంకోచింప లేదు. కాఁబట్టి యిప్పుడు శివాజీ జయసింగుపక్షమవలంబించి, సుల్తానగు అలీ ఆదిల్‌షాహాతో యుద్ధము ప్రారంభించెను. స్వల్పకాలముననే మావళేసైన్యములు శత్రులకడనుండి బహుదుర్గములను లాగి వేసెను.

అన్యోన్యసౌజన్యము స్పష్టమైనకొలఁది శివాజీ జయసింగుల స్నేహము వృద్ధినొందఁజొచ్చెను. ఇరువురు నొక ప్రదేశమునందే విడియుచు, కలిసి యుద్ధము చేయుచుండిరి.

రఘునాథుఁడు జనార్దనుని గృహమునకు రాకపోకలు సేయుచుండెను. అమాయికుఁడగు జనార్దనుఁడు రఘునాథుని యెడ క్రమముగా పుత్రవాత్సల్యము గనఁబఱుపఁ దొడగెను. అనుదినము రఘునాథునకు పిలుపు తగులుచుండెను. అతఁడు బ్రాహ్మణుని సదనమున కరిగి నానావిధ ప్రసంగములు సేయుచుండెను, ఒక్కొకప్పుడు నిశీథములవఱకు నక్కడనే కూరుచుండి యుద్ధవిషయములను వర్ణించుచుండెను; ప్రక్కగదిలోఁ గూరుచున్న సరయువు వానివాక్కుల నాలకించుచు, వానికేయపాయము రాకుండుఁ గాక యని భగవంతుని వేఁడుచుండెను. అనంతరము భోజనమునకు లేచి రఘునాథుఁడు భుజించుచున్నంతతడవు సరయూబాల వానిదెస విలోకించుచుండెను. ఎంత చూచినను ఆమెకు తృప్తి తీఱదు భోజనానంతర మతఁడు మృదుస్వరము నేవే నొకటిరెండుమాట లాడినపుడును, పోవుకొలు వేఁడినప్పుడును వేపథుమతియు, ఉద్విగ్నమనస్కయు నగు సరయువు వానికిఁ బ్రత్యుత్తర మీయలేక పోవును. త్రపాభరమున నామెకపోలములు జాజువాఱును, నేత్రములు నిమీలితములగును; అంత నామె యవకుంఠనము

సరిచేసికొని, వెడలిపోయి, దూతికాముఖమున వానికి సమాధాన మంపుచుండును.

సమాధాన మావశ్యకమా? సరయువు కనుఛోరణి రఘునాథుఁ డెఱుంగును; రఘునాథుని నేత్రసరణి సరయు వెఱుంగును. ఇర్వురచిత్తములును ప్రథమప్రణయ సమ్మోద మునఁ దేలి యాడుచుండెను.

అనతికాలముననే బీజపూరు దుర్గములు జయించి, శివాజీప్రభువు తుద కొక దుర్గమదుర్గమును బట్టుకొన సంకల్పించెను. తా నేదుర్గము నాక్రమించునదియు జెప్పకపోవుటచే నాతని సైనికుల కేమియుఁ దెలియలేదు. పగటిపూఁట నా దుర్గమున కయిదాఱు కోసులదూరమున జయసింగు శిబిరము కడనే శివాజీగుడారముకూడ నిర్మిత మాయెను. సాయంకాలమున వేయిమంది మహారాష్ట్రులను, మావళేలను యుద్ధసన్నద్ధులుగా నాజ్ఞాపించి, జాము ప్రొద్దు దాఁటినవెనుక రుద్రమండలము నకుఁ బోవుచున్నాము అని భటులతోఁ బలికి, శివాజీ నిశ్శబ్దముగా జైత్రయాత్ర వెడలెను.

అర్ధరాత్రమున కతఁడు రుద్రమండలమును జేరెను. ఆదుర్గ ముత్తుంగశృంగముపై నున్నది. ఇప్పుడు యుద్ధసమయ మగుటచే దుర్గమునకుఁ బోవుమార్గము మూసినారు. మిగిలిన ప్రక్కలనుండి పై కెక్కుట యసాధ్యము; కాని చెట్లతోను, పాషాణములతోను నిండియున్న యొకమార్గమును జూపి,

దానివెంబడి శైలము నధిరోహింప శివాజీ సైనికుల నాజ్ఞాపించెను. పదాతులు వనబిడాలముల వడువున చెట్టుఁగొమ్మలు పట్టుకొని పై కెగఁబ్రాఁకుచు, కొన్నిచోట్ల నిలుచుచు, కొన్ని ప్రదేశములందు కూర్చుండుచు, కొన్నియెడల దుముకుచు, బహువిధముల గమ్యస్థానమును సమీపించుచుండిరి.

సగము పై కెక్కినపిమ్మట ప్రాకారముమీఁద కాగడాల కాంతి దృగ్గోచర మయ్యెను. శివాజీ చింతామగ్నుఁ డయ్యెను. అతని యాగమనవార్త శత్రులకుఁ దెలిసెనా యేమి? కానిచో వప్రముమీఁద కాంతికిఁ గారణ మేమి? శివాజీ తనబంటులను మఱింత జాగరూకతతో నడువ నాదేశించెను. వారును చెట్ల మాటునను పెద్దపాషాణముల వెనుకను నడచుచు ప్రాఁకుచు నిశ్శబ్దముగా దుర్గప్రాకారమును దఱియుచుండిరి.

కొంతతడవునకు వారు సమప్రదేశమునకు వచ్చిరి. పై నుండి వెలుతురు క్రిందికి చక్కఁగా వ్యాపించెను. ముందున కరుగుచో మీఁదివారలు క్రిందివారిని జూడ వచ్చును. శివాజీ క్రమ్మఱ నిలువఁబడి ఇటు నటు పరికింపసాగెను. ఎదుట నేఁబది గజములవఱకును వృక్ష మను మాటయే లేదు. తరువాత పొదము లున్నవి. ఈప్రదేశము దాఁటు టెట్లు? ప్రక్కల నుండి మార్గము లేదు; క్రిందికిఁ జూడ, ఎక్కివచ్చినది చాల దూరము. మరల నేలమీఁదికి డిగ్గి, వేఱొక పార్శ్వమునుండి దుర్గమును జేరుటకుఁ బూర్వమే సూర్యోదయ మగును. శివాజీ

యెక్కించుకతడ వేమో యాలోచించి, తానాజీ మాల సూరేతో రహస్యముగా నేమో పలికెను. పిమ్మట తానాజీ నిష్క్రమించెను. శివాజీ వానిరాక కెదురు చూచుచుండెను. బంటు లెల్లరు ప్రభువునాజ్ఞకు వేచియుండిరి.

అర్ధఘటికలో తానాజీ మరలి వచ్చి మృదుస్వరమున శివాజీతో నేమో చెప్పెను. కొంచెము యోజించి, "అలాగే యగుఁగాక, ఉపాయాంతరము లేదు" అని శివాజీ వచించెను.

వర్షపునీరు క్రిందికి దిగుటలో నొకప్రదేశము గుంటవడి, మన్ను కొట్టుకొని పోయి, చిన్న యేఱువోలె నేర్పడి యుండెను. దానిలో వంగి నడచుచో నిరుపార్శ్వములు నున్నతముగా నుండుటంబట్టి దుర్గనివాసులు శత్రువులను జూడక పోవచ్చును. కావున బంటు లెల్లరు నిశ్శబ్దముగా నాయేటినడుమ నడచి, శీఘ్రముగా నావలివృక్షశ్రేణిలోఁ బ్రవేశించిరి. శివాజీ తన యంతరంగమున భవానీదేవిని సంస్తుతించెను.

ఆతనిప్రక్క నున్న సైనికుఁడు తటాలున నేలపై నొరగెను. చూడఁగా వానివక్షస్స్థలమున బాణము నాటుకొని యుండెను. అంతట పుంఖానుపుంఖముగా శరవర్షము కురియ సాగెను. దుర్గప్రాకారముమీఁది రక్షకభటులు శివాజీసేనను జూచుటచే నలుఁగురు విషువఁ జొచ్చిరి.

మహారాష్ట్రపతాకిని వృక్షములనడుమఁ బ్రవేశించుటయు, బాణాసార మాఁగిపోయెను. వైరులు జాగరూకులై

యుండిరని శివాజీకి తెల్ల మయ్యెను. గోడమీఁద ననేకదీపములు వెలుఁగుచుండెను. రక్షకభటులు ఇటు నటు, ప్రచారము చేయుచుండిరి. ఆసమయమున మహారాష్ట్రులు కుడ్యమునకు నెనుబది యడుగులదూరములో నుండిరి. దుర్గములోఁ బ్రవేశించుటకు యుద్ధముదక్క మఱియుపాయము లే దని శివాజీ నిర్ధారణ చేసెను.

అప్పుడు తానాజీ శివాజీని జూచి "రాజా! దిగిపోవుటకింకను కాల మున్నది. నేఁడు కాకున్న రే పీదుర్గము మనకుఁ జిక్కును; ఈనాఁటియుద్యమము మనకు నష్టకారణము కావచ్చును" అని పలుక, శివాజీ గంభీరవాక్కుతో, "ఓయీ! జయసింగు సన్నిధిని జేసిన వాగ్దానము చెల్లింపవలెను. రుద్రమండలమును జయింపవలెను, కాదా యుద్ధమున మృతి నొందవలెను" అని బదులు చెప్పెను.

చెట్లచాలు వెంబడి కదలిపోవుచు దుర్గములోని వారిని మోసపుచ్చుటకయి వేఱొకపార్శ్వమునకు నూర్వురుభటులను బంపి శివాజీ ఫలితముకొఱకు నిరీక్షించుచుండెను. త్వరలో రెండవకెలఁకున బందూకులచప్పుడు వినవచ్చెను. దుర్గమావంక నాక్రమింత మని యెంచి గోడమీఁది రక్షకభటులును దుర్గములోని సైనికులును ఆచాయకుఁ బరుగె త్తిరి. ఇంతలో కాగడలు చల్లాఱెను; అంతట శివాజీ తనదండు నుద్దేశించి "సుభటులారా, అనేకయుద్ధములందు మీమీపరాక్రమమును బ్రక

టించి గౌరవమును నిలిపితిరి. నేఁడును అదేవిధముగాఁ బ్రవర్తింపవలెను. తానాజీ! మనసౌహార్దమును నేఁడు వెల్లడిచేయవలెను అని యుత్సాహవాక్యములు పలికెను.

ప్రభువాక్యములచే నెల్లరు నుత్సాహవంతులై నిశ్శబ్దముగా భిత్తిని సమీపించుచుండిరి. చెట్లమాటున నవ్వాడి నాలకించి రక్షకభటుఁడు అదేమో చూతమని గోడమీఁదుగా కొంత ముందునకుఁ జనెను. శివాజీ నే మావళ్లేనిసైనికుఁడొకఁడు మెల్లన తూపు విడుచుటయు, గోడమీఁదివాఁడు గుభాలున క్రిందఁబడెను.

అప్పుడు విని ఒకఁడు, ఇర్వురు, పదుగురు, నూర్గురు, క్రమముగా మూఁడువందలమంది ముసల్మానులు గుమిగూడిరి. శివాజీ కోపముతో పండ్లు గొఱకుచు, ఇఁక దాగియుండుట నిష్ఫలమని యెంచి తనబంట్లను ముందఱకు నడువసాగెను. అప్పుడు 'హరహర, మహాదేవ!' అను మహారాష్ట్రుల యుద్ధనాదము గగనమంటెను. ఒకదళము కోటగోడ దాఁటుటకు పఱుగెత్తెను. మిగిలినబలము వృక్షములవెనుక నిలిచియుండి ముసల్మానులపై నవిరళముగ ములుకులు విడుచుచుండెను. ముసల్మానులు వైరులరాకకు భీతిల్లక 'అల్లా హో అక్బర్!' అని యార్చుచు, ప్రాకారముమీఁదినుండి యెదిరివారిపై బాణములు విడుచుచుండిరి; వారిలో కొందఱు క్రిందికి దుమికి చెట్లమాటున నున్న వారిపైఁ గవిసిరి.

గోడమీఁది ముసల్మానులు బల్లెపుఁబోటులతో హిం దువులను సంహరింపసాగిరి; మహారాష్ట్రులు అర్ధచంద్రశరములతో ముసల్మానులను వధింపఁజొచ్చిరి. యుద్ధరంగము పీనుఁగుఁ బెంట యయ్యెను; రక్తప్రవాహము ప్రవహింపఁ జొచ్చెను. అఫ్గానులు వట్టివారు కారు; కాని విటపాంతరములనుండియు, లతాభ్యంతరములనుండియు, పాషాణముల వెనుక నుండియు జివ్వున వచ్చుచున్న దుర్వారశిలీముఖములచే వారిబలము క్రమముగా క్షీణింపఁ దొడఁగెను.

ఈకలకలము నణఁగఁ ద్రొక్కి, ఆకస్మికముగా 'శివాజీకి జయ్' అను సింహనాద మున్నరమున కంటెను. క్షణకాల మెల్లరునావంకకుఁ దిరిగిచూచిరి. అడ్డగించిన రిపులను భేదించు కొని నెత్తుటితోఁ దడిసియున్న బల్లెముపై భారము మోపి, రాజపుత్రయోధుఁ డొకఁడు చంగున రుద్రమండలదుర్గప్రాకా రముపై దుమికెను; దుమికి, పఠానులపతాకను కాలితోఁ దన్ని, కూలఁద్రోచి, తద్రక్షకుని ఖడ్గముతోఁ దెగటార్చి, మేఘగంభీరస్వరమున, 'శివాజీకి జయ్' అని యఱచెను. అతఁడు రఘునాధజీ!

హిందువులు ముసల్మానులు గూడ నిమేషమాత్రము యుద్ధము చాలించి, మిగుల నాశ్చర్య మొంది నక్షత్ర కాంతిలోఁ గొంతవఱకుఁ గాన్పించుచున్న యా దీర్ఘమూర్తి దెస చూడ్కులు నిలిపిరి. వాని శిరస్త్రాణము తళతళ లాడుచుం

డెను, హస్తములు బాహువులు నెత్తుటితోఁ దడిసియుండెను, నేత్రములపై వెంట్రుకలగుత్తులు వాలుచుండెను ఓడయెదుట తరంగములచాడ్పున నావీరునియెదుట శత్రుసమూహము రెండుపాయలై పోయెను. రణాధిదేవత దీర్ఘ కుంతమును జేపట్టి యాకసమునుండి రుద్రమండల దుర్గప్రాకారముపై నవత రించి యున్నట్లు క్షణకాలము చూపఱకుఁ బొడకట్టెను.

ఎల్లరు నొక్కించుక తడ వూరకుండిరి. తమ వస్త్ర ముపై శత్రు వెక్కె నని తెలిసికొని ముసల్మానులు నల్దిక్కుల నుండి పరుగెత్తుకొని వచ్చి రఘునాధుని ముట్టడించిరి. కత్తిని, బల్లెము నుపయోగించుటయందు రఘునాధుఁ డద్వితీయుఁడు; కాని చాలమందితో నొకఁడు పెనఁగుట నట్టిది. అతనిజీవనము సంశయగ్రస్తమై యుండెను.

అప్పుడు మావళేలు రఘునాధుని వీరవిహారము నవలో కించి యుత్సాహవంతు లయి, వానిని రక్షించుటకు గోడదగ్గ ఱకుఁ బరుగెత్తిరి. దుముకుటలోను ప్రాఁకుటలోను ప్రావీ ణ్యము గల యామావళేలు చంగున కుడ్యముమీఁది కెక్కి, కాఱుమబ్బులవలె రఘునాధుని చుట్టునున్న ఆఫ్గానులపై పెద్దపులులవలెఁ బడిరి. మహారాష్ట్రులు లెక్క కెక్కువగా నుండుటచేత ఆఫ్గానులను శీఘ్రముగా చిందరవందఱ చేసి, ప్రచండ సింహనాదము చేసిరి.

అంతట శివాజీ తానాజీలు గోడమీఁదనుండి దుర్గము లోనికి దుమికిరి. వెలుపల యుద్ధము చేయుట లాభము గాదని తలఁచి మహారాష్ట్రులు తమప్రభువు ననుసరించిరి.

శివాజీ చెచ్చెర కిల్లాదారుని ప్రాసాదమును సమీపించెను. అది దుర్భేద్య మయినది. రక్షకభటులను వధించి మహారాష్ట్రులు ప్రాసాదమును ముట్టడి వేసిరి. శివాజీ కిల్లాదారు నుద్దేశించి మేఘగంభీరవాక్కుతో "తలుపు దీయుము; తీయనిచో పేడఁ గాల్పించెదను" అని పలుకఁగా, నిర్భీకుఁడగు పఠాన్ కిల్లాదారు ధీరముగా "అగ్నిలో మ్రగ్గెదను; కాఫరునకుమాత్రము తలుపు తీయను" అని ప్రత్యుత్తర మిచ్చెను.

తత్క్షణమే మహారాష్ట్రులు కాగడాలు దెచ్చి మందిరమునకు నిప్పంటించిరి; పైనుండి కిల్లాదారు, వానియనుచరులును బాణములు విడువఁ జొచ్చిరి కొందఱు హిందువులు మృతి నొందిరి; కాని తుదకు జ్వాలనము ప్రజ్వరిల్లెను.

మొట్టమొదట కవాట గవాక్షములు మండెను; క్రమముగా ప్రాసాదము జ్వాలనజ్వాలలయందు మ్రుంగిపోయెను. ఆవెలుతురు బహుదూరము వ్యాపించుటచే మునల్మానుల దుర్గము హిందువులు కాల్చివేయుచుండి రని ప్రజలు భావించిరి.

కిల్లాదారు రహ్మత్ ఖాన్ మంటను నివారింప జూచెను. మంటలు హెచ్చగలము కాఁగా రహ్మత్ ఖాన్ సపరివారముగా క్రిందికి దుమికి, తెగువతో శత్రువులను సంహారింప జొచ్చెను.

అదెంత సేపు? మహారాష్ట్రులు వానియనుచరులను ఖండించిరి. రహ్మత్ ఖానుకు గాయములు తగిలెను. కాని యతఁడు వెనుదీయక భీకరముగా వైరులతోఁ బెనఁగుచుండెను. మహారాష్ట్రులు వానిని పరివేష్టించిరి. నల్వంకల ఖడ్గములు మీఁదికి లేచెను. రహ్మత్ ఖాన్ జీవించునాశ లేకుండెను. అట్టియెడ నుచ్చైస్స్వరమున "కిల్లేదారుని బంధింపుఁడు. ప్రాణము దీయవలదు" అని శివాజీ యాజ్ఞాపించుటచే వారు అతనిహస్తమునుండి కరవాలము నూడఁబెఱికి, చేతులు విఱిచి కట్టిరి.

మహారాష్ట్రులు మంటలు చల్లార్పుచుండఁగా దుర్గమున కపరదిక్కున రమారమి అయిదువందల మంది మునల్మాన్ సైనికులు కొండ నెక్కుచుండిరి. వైరులను భ్రమపెట్టుటకు శివాజీ మున్ముందుగా నూర్గురు పదాతులను రెండవవైపునకుఁ బంపఁగా అఫ్‌గానులు అయిదువందలమంది ఆ దిక్కునకుఁ బరుగెత్తిరి. ఆనూర్వురు భటులు చెట్లమాటున నుండి కొంత సేపు పోరు సల్పి, క్రమక్రమముగా పలాయనము చేయఁజొచ్చిరి. మునల్మానులు మోనపోయి, వారిని నేలపఱుపను తఱుముచు నరిగిరి. రెండవవైపునుండి శివాజీ తమదుర్గములోఁ బ్రవేశించె నని వారి కెంతమాత్రము తెలియదు.

పిదపఁ బ్రాసాదపు మంటలు కంటఁబడఁగా తమభ్రమ నెఱింగినవారై అఫ్‌గానులు క్రమ్మఱ దుర్గములోనికిఁ జని

శత్రువును నాశము సేయ సంకల్పించిరి. కొలఁదిమంది నోడించి శివాజీ దుర్గమును స్వాధీనము చేసికొనెను, కాని యిప్పుడు అయిదువందల బంటులు గబగబ వచ్చుచుండుటచే నాతఁడు చింతామగ్నమానసుఁ డయ్యెను.

ప్రాసాదము దుర్భేద్య మయినది. దానిచుట్టు నున్న రాతిగోడ యగ్నివలన నష్టము నొందలేదు. దాని మఱుఁగున నుండి పరులతో యుద్ధము చేయుట సులభము. శివాజీ రెండు వందలసైనికుల నచ్చట నిలిపి, తగిన ప్రదేశములందు విలుకాండ్రను నిలువఁబెట్టి, ప్రాకారము మీఁద కవచధారులను సమకూర్చెను కొన్నిచోట్ల పాషాణములను దీయించి కొన్ని యెడల వానిని గుట్టలుగాఁ జేర్పించెను. పదినిముసములలో సర్వము సంసిద్ధ మయ్యెను.

శివాజీ మందహాసముతో తానాజీ, శత్రువు లిచ్చటికి వత్తురేని బాగుగా బల్లెపుఁబోటులు తగులును. కాని వా రిచ్చటికి రాకుండనే తన్నులు తినవచ్చును. ఇంకను వారు పర్వతము నెక్కుచున్నారు. ఇదియే వారిపైఁ బడుటకు తగిన సమయము. నీ వీభటుల కధిపతివై యుండుము, నేను మఱి యొకపర్యాయము సాహసించెదను.” అని పలికెను.

తానాజీ “ నే నిచ్చట నుండను. దేవరవారే ఉండవలెను. ఆవచ్చుచున్నవారిని పాఱఁద్రోలుటకు మీసేవకుఁ డసమర్థుఁడా ? అని విన్నవించెను.

శివాజీ చిఱునగవుతో "తానాజీ, నీవు చెప్పినది యుక్తమే. అరులరాకచే రణలుబ్ధుఁడ నయితిని. నీ వన్నట్లు నే నిచ్చటనే యుండుట మేలు. రెండువందల సైనికులతో, చీఁకటిసాయమున ముసల్మానులపైఁ బడఁగల హావల్దార్ ఎవ్వఁడును లేఁడా?" అని ప్రశ్నించెను.

పదుగురు హావల్దారులొక్కుమ్మడి ముందునకు వచ్చిరి. రఘునాథుఁడు వారివెనుక నుండెను; అతఁ డేమియు మాట లాడక క్రిందుఁ జూచుచుండెను.

శివాజీ వారి నవలోకించి, తుదకు రఘునాథునిదిక్కు మొగంబై "హావల్దార్, వీరిలో నీవు చిన్నవాఁడవు. కాని నీవే దానిని సంపూర్ణము కావింపుము." అని యను గ్రహించెను.

నిశ్శబ్దముగా రఘునాథుఁడు నేలఁ దాఁకునట్లు శిరము వంచి, నిర్దిష్టసైన్యముతో వెడలిపోయెను. అంతట శివాజీ తానాజీతో ని ట్లనెను: "ఈహావల్దారు రాజపుత్రుఁడు. వీని ముఖమును, పనులను జూడ కులీనుఁ డని తోఁచుచున్నది. తాను మాత్ర మెన్నఁడు తనవంశమునుగూర్చి చెప్పుకొనఁడు, తనసాహసమునకు గర్వపడఁడు. ఒకనాఁడు రఘునాథుఁడు పూనానగరమున నాప్రాణములు రక్షించినాఁడు, నేఁటి విజయ మున నగ్రేసరుఁ డయినాఁడు. ఇంతవఱకును రఘునాథునకు పారితోషిక మీయలేదు రేపటిసభయందు జయసింహుని

సమ్ముఖమున రాజపుత్రునకు బహుమాన మొసఁగెదను" అని ముచ్చటించెను.

రఘునాథుఁడు తనకార్యము నిర్వర్తించెను. ఆఫ్గానులు పర్వతము నారోహించుసమయమున హిందువులు "హరహర మహాదేవ!" అని యఱచి వారిపైఁ బడిరి. విశేషకాలము పోరు జరుగ లేదు. కాగడాలవెలుతురులో గోడమీఁద ననేక హిందువులు కనఁబడుటచే దుర్గము నుద్ధరించుట యుక్తదే యని తెలిసికొని మునల్మానులు మరల కొండ దిగుచుండిరి. అప్పుడు మావళేలు వారివెంటఁ బడి దుర్వారఖడ్గాఘాతములతో ననేకులను వధించిరి.

రఘునాథుఁ డుచ్చైస్స్వరమున "పలాయనపరులను చంపవలదు. ఇది రాజుగారియానతి" అని తనసైనికుల నాజ్ఞాపించెను. యుద్ధము సమాప్తమయ్యెను. ఆఫ్గానులు కాందిశీకులయిరి.

పిమ్మట రఘునాథుఁడు దుర్గప్రాకారముపై నక్కడక్కడ భటులను కావలి యుంచి, శస్త్రాగారమున కొందఱను గావు పెట్టి కోటలోని ప్రతిభాగమును భద్రముగా జూచుచుండునట్లు కట్టడి చేసెను. కర్తవ్యము ముగిసినవెనుక నతఁడు శివాజీ సన్నిధి కరిగి నతశిరస్కుఁడై యావద్వృత్తాంతమును ప్రభువునకు నివేదించెను.

ప్రాభాతిక శీతలమంద పవమానము వీచునప్పటికి దుర్గము శబ్దశూన్యమై యుండెను రమణీయ తరుషండ మండితం బగు పర్వతశిఖరము ఋష్యాశ్రమమువలె నొప్పుచుండెను. యుద్ధభీషణారవము ఎన్నఁడు నచ్చోట వినఁబడనట్లే యుండెను.

౧౮

మఱునాఁటి యపరాహ్ణమున దుర్గము శోభావంతమై యుండెను. వెండిపూఁత పూసిన నాల్గు కంబములపై రక్తవర్ణ వితానము ప్రకాశించు చుండెను. దానిక్రింద శోణాంబరాలంకృత మగు పీఠముమీఁద జయసింగు, శివాజీయును గూర్చుండిరి. బందూకులు చేతఁ బట్టుకొని సైనికులు శ్రేణీబద్ధులై నిలిచియుండిరి. బందూకుల సన్నీలనుండి యెఱ్ఱజెండాలు గాలిలో గంతులు వేయుచుండెను. 'అలంగీరుకు జయసింగుకు శివాజీకిని జయ మగుఁ గాక !' యని జనులు కేకలు వేయుచుండిరి.

జయసింగు చిఱునగవుతో శివాజీ నుద్దేశించి "రాజా ! మీరు చక్రవర్తిపక్షము నవలంబించిన దాదిగా ఆయనకు దక్షిణహస్తస్వరూపులై యున్నారు. ఈ యుపకారములను చక్రవర్తి మఱవఁడు. మీసకల ప్రయత్నములకును జయమే కలుగుచున్నది" అని యుగ్గడించెను.

"జయసింహా మహారాజుగా రున్నచోట సర్వదా జయమే!"

"మనము శీఘ్రముగానే బీజపూరు పట్టుకొనగల మని తోఁచుచున్నది; ఒకరాత్రిలో మీరీదుర్గమును స్వాధీనపఱుచుకొందు రని నే ననుకొనలేదు."

"మహారాజా! దుర్గములను ముట్టడించుట నాకు చిన్నతనమునుండియు నలవాటే కాని, నేను భావించినంత సులువుగా చిక్కినది కా దీ దుర్గము"

"ఎందుచేత?"

"మసల్మానులు నిద్దురలో నుందురని యెంచితిని. కాని వారు మేల్కొనియుండుటయే గాక యుద్ధసన్నద్ధు లయి యుండిరి ఇంతకుఁ బూర్వ మెన్నఁడును ఇంత సైన్యము నష్టము కాలేదు."

"రాత్రియే శత్రువులు వచ్చి పైఁబడుటకుఁ దగిన సమయ మని వారు జాగరూకులై యుండవచ్చును."

"సత్యమే కాని యెన్ని దుర్గములను జయించితిని! శత్రువులింత రణసన్నద్ధులై యుండుట నే నెక్కడను జూడ లేదు."

"వారు మెలకువతో నున్నను లేకున్నను శివాజీగారి గతి నిరాఘాటము, జయ మనివార్యము!"

"మహారాజుగారి యనుగ్రహావశమున దుర్గము చేఁజిక్కినది నిక్కమే! కాని రాత్రి గలిగిన నష్టము మరల కోలుకొలేను గదా! ఆవడిపోయినభటు లెంత విశ్వసనీయులు! అట్టివారు నా కిఁక సులభముగా లభింపరు."

శివాజీ యించుక చింతాకులుఁ డయ్యెను. అనంతరము బందీలను వెలుపలికిఁ దీసికొని రా నాజ్ఞ యయ్యెను.

రహ్మత్ ఖాన్ అధిపతిగా వేయిమందిభటు లాదుర్గమును సంరక్షించుచుండురు. నిన్నటియుద్ధమున వారిలో రెండువం దలమంది మాత్రము చిక్కిరి; కొందఱు నిహతు లయిరి, కొందఱు పాఱిపోయిరి. విఱిచికట్టి యున్నచేతులతో ఖైదీలు సభాస్థలమునఁ బ్రవేశించిరి.

వారలం జూచి శివాజీ యిట్లనెను: "ఎల్లరబంధము లును ఛేదింపఁబడును గాక. ఆఫ్గాన్ వీరులారా, మీపౌరుష ము నిల్పుకొంటిరి. దాని కెంతయు సంతసించితిని. మీ రిప్పుడు విడుదల యగుచున్నారు. ఇష్టము కలదేని ఢిల్లీచక్రవర్తి కొల్వులోఁ బ్రవేశింపుఁడు; లేనిచో బీజపూర్ సుల్తానువారి సన్నిధికిఁ బొండు. నాయాజ్ఞచే మిమ్ము మాసైనికులు ఎంత మాత్రము బాధ పెట్టరు."

ఈయుదారాచరణమునకు వా రెల్లరు సంతోషించిరి. యుద్ధము ముగిసినవెనుక శివాజీ తనచేఁ జిక్కినరిపులను బాధ పెట్టక తిన్నగా నరయుచుండును. అప్పుడప్పు డాతనిమిత్రులు అట్టిప్రవర్తన యపాయకారణ మగు నని పల్కుచుందురు. ఆఫ్గానులు శివాజీ చూపినకరుణకు నమ్మోద మొంది, చాల మంది చక్రవర్తికొల్వులో నెలజీతములకుఁ జేరిరి.

పిమ్మట రహ్మత్ ఖానును సభాస్థలమునకుఁ దీసికొని వచ్చిరి. ఆతనిచేతులు విఱిచి కట్టియుండెను. శరీరమున కత్తి దెబ్బలు కాన్పించుచుండెను. ఆవీరుఁడు సభలో సదర్పముగా నిలిచి, శివాజీవంక ధీరముగాఁ జూడసాగెను.

శివాజీ విష్టరమునుండి లేచి, స్వయముగా వానిబంధములను ఛేదించి యిట్లనెను: "వీరాగ్రణీ, యుద్ధనియమానుసారముగా మీచేతులు త్రాళ్లతోఁ గట్టినారు. ఒకరాత్రి మీరు చెఱసాలలో నున్నారు. క్షమింపుఁడు. జయాపజయములు భాగ్యాయత్తములు, మీ రిఁక స్వేచ్ఛావంతు లయితిరి. మిముబోఁటి వీరునితోఁ బోరి ధన్యుఁడ నయితిని."

ప్రాణదండనమున కెదురు చూచుచున్న రహ్మత్ ఖాను శివాజీవాక్కుల నాకర్ణించి, అదివఱకు ధీరముగా నున్నవాఁడు చప్పున నిర్ఘాంతపోయెను. యుద్ధములో శత్రుపరివేష్టితుఁడై యున్నను రవంతేని సంచలింపని వానిహృదయ మిప్పుడు సడలిపోయినది, నేత్రములనుండి రెండుబాష్పకణములు జాఱినవి. రహ్మత్ ఖాన్ పరాఙ్ముఖుఁడై అశ్రువులను దుడిచికొని, యిట్లనెను: "క్షత్రియప్రభూ, నిన్నటిరేయి తమబాహుబలముచేఁ బరాజితుఁడ నయితిని. హిందువులకు ముసల్మానులకు నెవ్వఁడు ప్రభువో, బాదుషాలకు బాదుషా యెవఁడో అట్టి వాఁడు మీకు సద్బుద్ధి నొసఁగినాఁడు. మీనూతనసామ్రాజ్యము తప్పక వృద్ధి నొందఁగలదు!"

జయసింగు ఫాతాన్ సేనాపతీ, ఉచ్చపదవికి తమరు యోగ్యులయినట్లు తమప్రవర్తనము చాటుచున్నది. తమవంటి సేనాని లభించునేని ఢిల్లీశ్వరున కింకను శ్రేయము కల్గుననుటకు సందేహము లేదు. మిముబోఁటి వీరశ్రేష్ఠుఁడు తమ కొలువులోఁ జేరుటకు సమ్మతించె నని చక్రవర్తికి పత్రిక లిఖింతునా?" అని అడిగెను.

రహ్మత్ ఖాన్ "మహారాజా, తమరు చెప్పిన ప్రస్తావన చే నే నెంతయు సమ్మానితుఁడనయితిని. కాని, ఆజీవితాంతము నే నెవ్వని పనులు చక్కఁబెట్టఁ దలంచితినో ఆతనిని పరిత్యజింపను. శక్తి కల్గియున్నంతకాల మీహస్తము బీజపూరుకొఱకు ఖడ్గము దాల్చును" అనెను.

"సరే. తా మీరాత్రి విశ్రమింపుఁడు: ప్రాతఃకాలము నాభటవర్గము మిమ్ము బీజపూరువఱకును సురక్షితముగాఁ జేర్చును." అని శివాజీ పలికెను.

రహ్మత్ "క్షత్రియపుంగవా, మీరు నాయెడ సనుగ్రహము, గౌరవముఁ జూపితిరి. నేను మీసన్నిధియందు వినయంగతిని దాఁపను. తమ సైన్యమును జక్కఁగా పరిశీలింపుఁడు. అందఱు ప్రభుభక్తులు కారు. నిన్నరాత్రి మీరు మా దుర్గము నాక్రమింతు రని నాకు ముందుగా నొకఁడు వార్త నంపినాఁడు. ఆకారణమున యుద్ధసన్నాహముతో నుంటిని. ఇంతకంటె నే నెక్కువగా చెప్పఁజాలను. చెప్పితినేని సమయము నతిక్రమించినవాఁడ నగుదును" అనెను.

రహ్మత్ ఖాన్ రక్షకభటులతో ప్రాసాదాభిముఖుఁడై చనెను

మహారోషముచే శివాజీముఖము నల్లపడెను నేత్రముల నుండి యగ్నికణములు రాలఁజొచ్చెను. శరీరము వడఁకుచుం డెను. అతనివైఖరి నవలోకించి సైనికులు బెగ్గడిల్లిరి.

జయసింగు శివాజీ నెట్లో శాంతపఱచి, సైనికులను జూచి, "దుర్గ మాక్రమింపవలయు నని మీ కెప్పుడు తెలిసి నది?" అని ప్రశ్నించెను.

"రాత్రి జాముపొద్దు పోయినతరువాత" అన్నారు సైనికులు.

"అంతకుఁ బూర్వ మెవనికైన నీవృత్తాంతము తెలిసి యుండెనా?"

ఏదోదుర్గమును ముట్టడింపవలసి యుండునని తెలిసినది కానిఁ యీదుర్గమునే పట్టుకొనవలెనని మాకుఁ దెలియలేదు."

"మంచిది, మీ రీదుర్గమును జేరునప్పటి కెంతప్రొ ద్దయ్యెను?

"రమారమి రెండు జాములు కావచ్చెను."

"మేలు. జాము ప్రొద్దు పోయినది మొదలు రెండు జాములవఱకును మీ రందఱు కలిసియే యున్నారా? ఎవ్వఁ డైన లేడా? లేనిచో వానిని బయటఁబెట్టుఁడు. ఒకని దోషము వలన నచేకులు కష్టములపా లగుదురు. మీప్రభువు మిమ్మునమ్మ

చున్నందులకు మీయోగ్యత కనఁబడుచు నలయును. శివాజీ గారిని బోలు ప్రభువు మీకిఁక లభింపఁడు. ఎవ్వఁడైన రాజద్రోహి యున్నపక్షమున వాని సీవలకు లాగుఁడు. వాఁడు రాత్రి యుద్ధములో మృతి నొందినపక్షమున వానిపేరు చెప్పుఁడు. అనుమానము మంచిది కాదు. ఒకనిమూలమున నెల్లరకు నపయశము వాటిల్లును."

అప్పుడు సైనికులు వెనుకటినాఁటిమాట స్మరింపఁ జొచ్చిరి. ఒకరిమొగ మొకరు చూడసాగిరి. క్రోధము కొంత వఱకు శాంతి నొందఁగా శివాజీ "మహారాజా, రాజద్రోహి సీవలకు లాగితిరేని నేను మీకు నిరంతరము కృతజ్ఞుఁడనై యుండువాఁడను" అని పలికెను.

చంద్రరావు అను జుమ్లాదారు ముందునకు వచ్చి మెల్లఁగా నిట్లనెను: "దేవా, మనము జాము ప్రొద్దు పోయిన పిమ్మట బయలు దేఱినపుడు నాయధీనమందలి హావల్దారొకఁడు కనఁబడ లేదు; రుద్రమండలమును జేరినతరువాత మరల నాకుఁ గాన్పించినాఁడు."

"ఎవఁడు వాఁడు? ఇంకను ప్రాణములతో నున్నాఁడా?" అన్నాఁడు శివాజీ.

రాజద్రోహిపేరు వినుట కెల్లరు నుత్సుకులై యుండిరి. శివాజీ యుచ్ఛ్వాసనిశ్వాసములు వినవచ్చుచుండెను. సూది క్రిందఁ బడవైచిన చప్పుడు గూడ కర్ణగోచర మగుచుండెను.

అప్పుడు చంద్రరావు మెల్లఁగా "రఘునాథజీ హావల్దార్" అని పలికెను. సభాసదులు ప్రమాన్పడిరి.

చంద్రరావు యోధయే, కాని రఘునాథుఁడు సేనలోఁ జేరినది మొదలుగా చంద్రరావుపేరు మూలఁ బడెను.

వదనమండలము మరల నలుపువాఱ, పండ్లు గొఱుకుచు శివాజీ చంద్రరావును జూచి, భయంకరముగా "ఓరీ ధూర్త, వృథా దోషారోపణ మేలరా? నీ వారోపించిననింద రఘునాథునియెడ వర్తింపదు. అతని చర్య నేను కన్నులార చూచితిని. నిష్కారణ దోషారోపణమునకుఁ బ్రతిఫలమును సైనికులు గమనింతురుగాక!" అని పలికి బల్లె మెత్తెను. చప్పున రఘునాథుఁడు ముందునకు వచ్చి "దేవా, చంద్రరావును సంహారింపవలదు. ఆయన యసత్యము చెప్పలేదు. నేను దుర్గమును చేరునప్పటికి కొంచెము జాగయ్యెను" అని విన్నవించెను. మరల సభాస్తారులు విస్మయావిష్టు లయిరి.

ఇంచుకతడవు శిలావిగ్రహమువలె నిశ్చేష్టుఁడై యుండి పిదప శివాజీ మోమునందలి చెమ్మట దుడిచికొని యిట్లనెను: "నేను స్వప్నావస్థయం దున్నానా? రఘునాథా, నీవే యీ పని చేసితివా? ప్రాకారమును దాఁటు సమయమున నీవే అగ్రగామి వయితివే రెండువందల భటవర్గముతో అయిదు వందలమంది ఆఫ్గానులను పాఱద్రోలితివే, అట్టి నీవే ద్రోహబుద్ధి వయి ముందుగా కిల్లాదారుకు ముట్టడిమాట తెలిపితివా?" అన్నాడు.

"దేవా, నేను నిర్దోషిని."

నిర్భీకుఁడు దీర్ఘకాయుఁడు నగు నావయస్కుఁడు నిప్పులు గురియుచున్న శివాజీదృష్టియెదుట నిష్పందగాత్రుఁడై యుండెను' భవాని' వంకఁ దీవ్రదృష్టి నిగుడ్చుచుండెను. వాని విశాలవక్షము గంభీరశ్వాసముచే మఱింత విశాల మయ్యెను.

"నాయానతి నుల్లంఘించి, నిర్దిష్టసమయమున సేనలో లేకుండుటకుఁ గారణ మేమి?" అని శివాజీ వాని నడిగెను.

రఘునాధుని పెదవులు కొంచెము చలించెను. కాని యతఁ డేమియు బలుకక, చూడ్కులు నేలపై నిలిపి, మిన్న కుండెను.

రఘునాధుని మూకీభావము సందేహము వృద్ధినొందింప మహోగ్రహముతో శివాజీ "ఓరీ కపట, ఇందులకా వీరత్వము చూపితివి? అయిన నీవు దుస్సమయమున వంచింపఁ దల పెట్టితివి" అని యఱచెను.

నిశ్చలస్వరముతో రఘునాధుఁడు "దేవా, కపట వర్తనము మావంశమునఁ బుట్టినవా రెఱుఁగరు. ఆసంగతి చంద్రరావుగారికి విశదమే" అని విన్నవించెను.

రఘునాధుని మనస్స్థైర్యము శివాజీ కోపానలమున కాహుతి యయ్యెను. కఠోరస్వరముతో నతఁడు "పాపిష్ఠా, తప్పించుకొనఁ దలఁచుట వృథా! క్షుధాక్రుద్ధ సింహాముఖమున నుండియైనఁ దప్పించుకొనవచ్చును. కాని జాజ్వల్యమాన

మగు శివాజీకోపవహ్నినుండి పరిత్రాణము లేదు" అని యఱచెను.

"నేను మహారాజుగారి సన్నిధియందు పరిత్రాణ ప్రార్థనము చేయుట లేదు; మానవులకడ నే నట్టిపని చేయను." అని రఘునాథుఁడు ధీరముగాఁ బలికెను.

"రాజద్రోహమునకు ప్రాణదండనమే తగినశిక్ష."

"ఈయోధ మరణమునకు సంసిద్ధుఁడై యున్నాఁడు. రాజద్రోహి మాత్రము కాఁడు."

శివాజీ సహింప లేక బల్లెముతో రఘునాథుని పొడువ నుంకింపఁగా జయసింగాతనిహస్తముఁ బట్టుకొనెను. శివాజీ వదనము క్రోధముచే వికృత మయ్యెను, శరీరము వడఁకు చుండెను. జయసింగునకుఁ జూపఁదగిన సన్మానమును మఱచి శివాజీ కఠిన స్వరముతో "చేయి వదలుఁడు. రాజపుత్రుల ధర్మము నే నెఱుఁగను నాకు తెలియ నక్కఱ లేదు. మహారాష్ట్రులనియమము రాజద్రోహులకు ప్రాణదండన విధించుటయే. శివాజీ ఆనియమమును బాటించును." అని వక్కాణించెను.

జయసింగు రవంతయుఁ గోపము నొందక మృదువుగా నిట్లనెను. "క్షత్రియపుంగవా, ఈనాఁడు చేసినపనిని తేపు అన్యథా చేయఁలేరు గదా? నేఁ డీయోధునకు దేహాంతశిక్ష విధించి చిరకాలము దీనినిగూర్చి యనుతాపము నొందు చుందురు. యుద్ధములతో నాతల నరసినది; నామాట లవ

ధరింపుఁడు. ఇతఁడు రాజద్రోహి కాఁడు. ఆవిచారణ వదలి వేయుఁడు. మీరు నామిత్రులు; నేను మి మ్మొకటి యాచించు చున్నాను. ఈరాజపుత్ర యోధుని దేహాంతశిక్ష తప్పింప వలయును. ఈనాయాజ్ఞ వమ్ము చేయవలదు."

శివాజీ కొంచె మప్రతిభుఁడై యిట్లు పలికెను. "తాతా, నాపరుషవాక్యములను క్షమింపవలయును. మీమాట నేనెన్నఁడు తీసివేయను. రాజద్రోహిని విడుతు నని తలఁప లేదు"— హావల్దార్, జయసింగు మహారాజుగారు నిన్ను రక్షించినారు. నీవు నాయెదుటినుండి దూరముగా పో. శివాజీ రాజద్రోహుల మొగము చూడ నొల్లఁడు."

రఘునాధజీ సభాస్థలమునుండి నిష్క్రమింప నుండ శివాజీ క్రమ్మఱ ని ట్లనెను: "ఆఁగు, మాఁగుము. రెండుసం వత్సరములక్రిందట నీ కాఖడ్గము స్వయముగా నొసఁగితిని. రాజద్రోహిహ స్తమునం దుండి ఆకరవాలము దుష్కీ ర్తిపాలు కాఁగూడదు. రక్షకభటులారా, ఆఖడ్గము లాగివేయుఁడు. ద్రోహిని దుర్గమునుండి వెడల నడుపుఁడు."

మరణశిక్ష విధించినప్పుడునైన సంచలింపని రఘునా థుఁడు ఖడ్గము లాగునప్పుడు మిక్కిలి కంపము నొందెను. అతఁడు శివాజీ నొకసారి విలోకించి, నేల తాఁకునట్లు శిరము వాంచి నిశ్శబ్దముగా నిష్క్రమించెను.

క్రమముగా చీఁకటి లోకము నావరించెను. ఒక పథికుఁడు పర్వతమార్గమున నడచుచుండెను. కొంతదూరము పోవు నప్పటికి గ్రామము వచ్చెను. దానిని దాఁటి యతఁడు పయనము చేయుచుండెను. అంధకారము బంధుర మయ్యెను. నిశావాతము ప్రబల మయ్యెను. ఇఁక నా యధ్వనీనుఁ డెవ్వరికిని గానఁబడ లేదు.

౧౭

చంద్రరావు జమ్దాదారు ధీమంతుఁడు వీర్యవంతుఁడు. రఘునాథునికంటె నతఁ డయిదారు సంవత్సరములు పెద్ద; కాని దూరమునుండి చూచుచో నలువదియేండ్లవాఁ డని బోధపడును. వానిముఖమున రెండుమూఁడు చింతారేఖలు గాటముగా నాటుకొని యున్నవి; తలయందు కొన్ని తెల్లవెంట్రుకలున్నవి; కన్నులు మిగులఁ జిన్నవి, కాని తేజోవంతములు. ఆతనిసాహసమువలె దురాలోచనయు ననివార్య మని వానిని బాగుగా నెఱిఁగినవారు పలుకుచుందురు. ఆతఁ డల్పభాషి. ఆతనితో నెవ్వరును వివాదము పెట్టుకొనరు. ఇంతకంటె చంద్రరావుకు దోషములు గాని, గుణములు గాని యున్నట్టు లెవ్వరికిని దెలియదు. కాని నిరంతరము దురాశ వానిహృదయమున వర్తించుచుండును; తాఁ దలఁచిన తలఁపు నెఱవేర్చుటకాతఁ డెట్టిమార్గమునైన నవలంబించును. ఆత్రోవలో శత్రువు కాని మిత్రము కాని అపకారి యేని యుపకారి యేని, దోషి

గాని నిర్దోషి గాని—ఎవ్వఁ డయిన నడ్డము వచ్చినయెడల వానిని నిస్సంకోచముగా నలఁగఁద్రొక్కును. కర్మము చాలక రఘునాథుఁ డానరణియందుఁ దోఁచుటయు, చంద్రరావు వానిని కీటమునువలె కాలఁ ద్రొక్కి, నిజమార్గమునఁ జనెను.

చంద్రరావు తనజన్మవృత్తాంతము నెన్నఁడు నెవ్వరికిని జెప్పలేదు. రాజాజస్వంతసింగు సేనాపతి యగుగజపతిసింగు బాల్యకాలమున వానిని బోషించెను. దిక్కులేని పిల్లవాఁడు గజపతిసింగునింటఁ బనులు చేయుచు, యజమానుని సంతాన మును గనుపెట్టుచు, యుద్ధములలో నాతినివెంటఁ జనుచుండెను చంద్రరావునకు పదునైదేండ్లవయసున వానిగంభీర చింతా ముద్రను, అప్రతిహతతేజమును, ప్రతిజ్ఞాశక్తిని విలోకించి గజ పతిసింగు సంతసించి, వానిని తనపుత్రుని రఘునాథునివలెఁ బ్రేమించుచు, తనయధీనమున సైనికునిగా నియోగించెను.

సైనికవ్రతము పూని యహరహము చంద్రరావు కనఁ బఱచు విక్రమము నాలోకించి వృద్ధభటులుగూడ విస్మయ మొందుచుండిరి. యుద్ధమునం దెచ్చట విశేషవిపత్తు కలదో, ఎచ్చట శవములు రాశీభూతము లగుచుండునో, ఎక్కడ ధూళి భూమ్యాకాశములను గప్పివేయుచుండునో, ఎచ్చోట నార్తనాదములతోను జయధ్వనులతోను చెవులు పగులుచుం డునో ఆ మహాప్రదేశములందు చంద్రరావు కాన్పించును. సంగ రము ముగిసినవెనుక విజయము లయినసైనికులు సంగీతముతోను,

సరసవాక్యములతోను, సమ్మోదముతోను, సురాపానము తోను కాలక్షేపము చేయుచోట నతఁడు కానబడఁడు, స్కంధావారమున నంధకారప్రదేశమునఁ గూర్చుండియుండును దూరముగా పొలములలో సంచరించుచుండును. ఎప్పుడు చూచినను వాసెమొగము ముడుచుకొనియే యుండును. వాని యుద్దేశము కొంతవఱకు సఫల మయినది: ఇప్పు డతఁడు ఊరును పేరును లేనివాఁడు కాఁడు. గజపతిసింగుసైనికులలో నెల్ల చంద్రరావు మిగులఁ దేజస్వి యనియు, వీరుఁ డనియు, పేరు మోసెను. గౌరవాభివృద్ధితో వానిదురాశయు, దర్ప మును మిక్కుట మయ్యెను.

ఒకానొకయుద్ధమున చంద్రరావు గజపతిసింగును మహా విపత్తునుండి యుద్ధరించెను. రాద్ధాంతమున సభ చేసి గజపతి వానిని యథోచితముగా నాదరించి యెల్లరు వినునట్లు "చంద్ర రావూ, నేఁడు నీసాహసముచేతనే నాప్రాణములు దక్కినవి ఇందులకుఁ ఏమిబహుమాన మీయువాఁడను?" అని యడిగెను.

అవనతవదనుఁడై చంద్రరావు వినయము తోఁప నిలిచి యుండెను.

గజపతి సస్నేహముగా ని ట్లనెను: "చక్కఁగా యోజించి, నీయిచ్ఛ వచ్చిన బహుమాన మడుగవచ్చును; ధనమో, పదవియో, మఱేదో, చంద్రరావూ, నీకు నే నీయ రాని దే మున్నది?"

అంతట చంద్రరావు మెల్లమెల్లగ కన్నులు పైకెత్తి యిట్లనెను: "రాజపుత్రులు చేసినవాగ్దానము నతిక్రమింప రని లోకప్రసిద్ధము. వీరపుంగవా, తమపుత్రిక యగులక్ష్మీదేవిని నాకుఁ బెండ్లి చేయుఁడు."

సభాసదులు నిర్వాక్కు లయిరి. గజపతి శిరస్సుపై నాకసము విఱిగి పడిన ట్లయ్యెను. కోపముచే నాతని శరీరము కంపించు చుండెను. ఒఱలోనుండి ఖడ్గము సగము వెలుపలికి వచ్చినది కాని యెట్టకేలకు కినుక నాఁపుకొని, పెద్దపెట్టున నవ్వి గజపతి యిట్లనెను: "వాగ్దానము చెల్లించుటకు సిద్ధముగా నున్నాను, అయిన నీవు మహారాష్ట్రమున జన్మించిన వాఁడవు. రాజపుత్రకుమారికలు మహారాష్ట్రదస్యులతో పర్వతకందరము లందు, నరణ్యములందు నివసింప నలవాటు పడినవారు కారు, ముందుగా లక్ష్మికి తగిన నివాసస్థానము సిద్ధపఱుపుము, కాననమున కుటీరమునకు మాఱుగా దుర్గము నిర్మింపుము; దస్యునామమునకు బదులుగా వీరనామము సంపాదింపుము. అటుపిమ్మట రాజపుత్రదుహితను వివాహ మాడుదువు గాని, ఇప్పుడింక నేమయిన యాచన కలదా?"

"ఇప్పుడు మఱేయాచనయు లేదు, ఉన్నప్పుడు ప్రభువువారికి దానిని విన్నవించెదను" అని చంద్రరావు ధీరముగా బలికెను.

ఉదారహృదయుఁ డగు గజపతిసింగు త్వరలోనే యానాఁటిమాట మఱచెను. కాని చంద్రరావుమాత్రము మఱువ లేదు. ఆరాత్రివేళ నతఁడు గుడారములో నిటునటు దిరుగుచుండెను పటకుటీరము తమోమయము. కాని, అంతకంటెను దుర్భేద్యమగు నంధకారము వానిహృదయమునందును, వదనము మీఁదను తాండవమాడుచుండెను.

రెండుగడియ లయినతరువాత చంద్రరావు దీపము వెలిఁగించి, ఒక పుస్తకమునం దేమో ప్రయత్నపూర్వకముగా లిఖించి, గ్రంథము మూసి, మరలఁ దెఱచి, చూచి, మూసివైచెను. అప్పుడు వికటహాసము వాని మోమునఁ దోఁచెను.

ఈనడుమ స్నేహితుఁ డొకఁడు డేరాలోనికి వచ్చి, "చంద్రా! ఏమి వ్రాయుచున్నావు?" అని యడుగఁగా, సహజమగు ధీరస్వరముతో నతఁడు "పద్దు వ్రాయుచున్నాను. ఎవనియొద్ద నేది తీసికొంటినో దాని వైనము వ్రాయుచున్నాను." అని బదులు పలికెను.

మిత్రుఁడు వెడలిపోయెను. చంద్రరావు మరల పుస్తకము తెఱచెను. నిజముగా నది పద్దులు వ్రాయు పుస్తకమే. అతఁడు ఋణమును గూర్చి లిఖించి యుండెను. చంద్రరావు పుస్తకము మూసివేసి, దీపము దీసెను.

తరువాత సంవత్సరమునకు ఔరంగజేబుతో జస్వంత సింగునకు ఉజ్జయినీసమీపమున మహాయుద్ధము సంభవించెను. ఆప్రవిదారణమున గజపతిసింగు మృతి నొందెను.

దిక్కులేని గజపతిసింగు పుత్రుఁడును, పుత్రికయు మార్వాడ్ దేశమునుండి మేవాడ్ దేశమందలి సూర్యమహాల్ దుర్గమునకుఁ జనుచుండిరి. రఘునాథుఁడు పండ్రెండు సంవత్సరముల వాఁడు, లక్ష్మి తొమ్మిదేండ్లది, వారివెంట నొక వృద్ధసేవకుఁ డుండెను. మార్గమధ్యమున దొంగలగుంపు సేవకుని వధించి వారి నిర్వురను మహారాష్ట్రదేశమునకుఁ గొనిపోయెను. చిన్న వాఁ డయ్యు రఘునాథుఁడు తేజస్వి అతఁ డొక్క రాత్రివేళ చోరులబారినుండి తప్పించుకొని పాఱిపోయెను. చోరనాయకుఁడు లక్ష్మీబాయిని బలవంతముగాఁ బెండ్లి యాడెను, అతఁడే చంద్రరావు.

చంద్రరావు మనోరథము కొంతవఱకు సఫల మయ్యెను. గజపతిగృహమునుండి యతఁడు కొంతధనము వెంటఁ దెచ్చుకొని యుండెను; ఆద్రవ్యముతో మహారాష్ట్రదేశమున జాగీరు కొని, పెద్దమనుష్యుఁ డయ్యెను. చంద్రరావువంశము పురాతన రాజపుత్ర గోత్రమునుండి యుద్భవించె నని యెల్లరు విశ్వసించిరి; సుప్రసిద్ధుఁ డగు గజపతిసింగు పుత్రికను పెండ్లియాడి యుంట స్పష్టమే గదా! వానివిక్రమము నవలోకించి శివాజీ వానిని జుమ్లాదారుగా నియమించెను. చంద్రరావు విపులైశ్వ

ర్యమును, జాగీరును గాంచి, అందఱు వానిని గారవించుచుం డిరి. చంద్రరావుకీర్తి దినదినాభివృద్ధి నొందఁ జొచ్చెను. అట్టి యెడ రఘునాథుఁడు వానియశోమార్గమున కడ్డముగా దుస్స మయమున నిలుచుటచే జన్మాంధారు వానిని వెంటనేఁ నలఁగఁ ద్రొక్కి మార్గముఁ బరిష్కరించెను.

## ౧౮

రఘునాథుఁడు దొంగలగుంపునుండి తప్పించుకొని పాఱిపోయి, గ్రామములవెంటఁ దిరుగుచు దినములు గడపుచుండెను. దిక్కు లేని యాచకునికట్టినిఁ జూచి, బిచ్చము పెట్టుట కెవ్వరును మాఱుమొగము పెట్టువారు కారు.

అటుతరువాత నైదుసంవత్సరములవఱకు రఘునాథుఁడు నానాప్రదేశములం దిరుగుచు, నగరాసిపాట్లు పడుచు, కాల క్షేపము చేయుచుండెను. లోక మనియెడి మహాసముద్రమున నా బాలుఁడు దిక్కు లేక కొట్టుకొనిపోవుచుండఁగా వాని నుద్ధ రించినవా రెవ్వరును లేరు. అతఁడు భిక్షావృత్తిచే జీవించుచుఁ గొన్నిదినములకు దానవృత్తి నవలంబించెను. వెనుకటిమహో దశ, తనతండ్రియాన్నత్యమును వానిహృదయమున సర్వదా వర్తించుచున్నను, అభిమాని యగుటను బాలకుఁ డావార్తల నెవ్వరికిని దెలుప లేదు. ఒక్కొక్కప్పుడు దుఃఖభారము సహింపలేక రఘునాథుఁడు నిర్జనప్రదేశమునకుఁ జని కడుపు

బ్రద్దలగునట్లు రోదనము చేసి, కొంతతడవునకు గృహమున మరలివచ్చి తనపనిలోఁ బ్రవేశించుచుండెను.

ఈడు వచ్చినకొలఁది రఘునాథునకు నిజవంశోచితభావలు తమంతఁ దామే యావిర్భవింపఁ జొచ్చెను. అల్పవయస్కుఁడగు నాసేవకుఁ డప్పుడప్పుడు యజమానుని శిరస్త్రాణమును తన తలపై ధరించి, ఖడ్గమును మొలఁ దాల్చుచుండెను. సంధ్యాసమయమున శాద్వలమునం దుపవశించి, సంగ్రామసింహుని యశోగీతములు గాని, ప్రతాపసింహుని యశోగీతములు గాని, పాడుచు, శ్రోతలం బొంగుచు గలు శరీరములను నుఱుచ నట్లు చేయుచుండెను. పదునెనిమిదవవత్సరము వచ్చినప్పుడు రఘునాథుఁడు శివాజీ మహోద్దేశమును గ్రహించి, దక్షిణ దేశమందు హిందూరాజ్యము ప్రబలు నని సంతోషించి, శివాజీ ప్రభునిసన్నిధి కరిగి సామాన్యసైనికునిఁగాఁ దన్ను నియోగింప నాతనిఁ బ్రార్థించెను.

జనులను గనుపెట్టుటయందు శివాజీ యద్వితీయుఁడు. కొలఁది కాలములో నతఁడు రఘునాథుని హవల్దారును జేసెను. వాని నామధేయము రఘునాథసింగు; కాని మహారాష్ట్ర దేశమున వానిని జనులు రఘునాథజీ యని పిలుచుచుండిరి.

రఘునాథుఁడు శివాజీసన్నిధానమున కేతెంచు నప్పటికి చంద్రరావు జుమ్లాదారు సహీనమండలి యొక్క హవల్దారు మృతి నొందుటచే రఘునాథున కాపదవి లభించెను. చంద్రరావు తన

జనకుని ప్రాంతబంటనియు, తన బాల్యస్నేహితుఁడనియు నెఱుఁగును. కాని చోరనాయకుఁడనియు, తనచెల్లెలి భర్తయనియు రఘునాథునకుఁ దెలియదు. కావున నతఁడు నానందముగా చంద్రరావుతో సంభాషింపఁ జనెను చంద్రరావు వానిని నాదరించెను. కాని జమ్మాదారు మొగము ముడుఁచుకొని పోయెను.

నానాఁటికి రఘునాథుఁడు కీర్తిమంతుఁడు కాఁజొచ్చెను, చంద్రరావుచింత గాటము కాఁదొడఁగెను. చంద్రరావు దృఢప్రతిజ్ఞాసంతుఁడు గదా! ఎట్లయిన నేమి? అతఁడు రఘునాథుని ప్రాణములు తీయించుపని చేసెను. దైవయోగమున వానిప్రాణములు దక్కెను. కాని యతఁడు రాజద్రోహియనియు, దుర్మార్గుఁడనియు లోకమున వ్యాపించెను గదా!

చంద్రరావు కొన్నిదినములపాటు సెలవు తీసికొని తన జాగీరునకుఁ జనెను.

అతఁడు బహిర్ద్వారమును సమీపించినతోడనే నగారా మ్రోగెను. దాసదాసీజనము ప్రభున కెదురుపోయెను గ్రామములోని పెద్దమనుష్యులు వానిని సందర్శింప వచ్చిరి. ఆతని యాగమనవార్త జాగీరునం దంతటను వ్యాపించెను. భర్తను గారవించుటకయి శాంతరూపిణియు, కృశాంగియు నగు లక్ష్మీబాయి అంతఃపురమున నేమో సన్నాహము చేయుచుండెను

నిక్కముగా లక్ష్మీబాయి లక్ష్మీదేవి వంటిది. ఆమె పరమశాంతురాలు, బుద్ధిమతి, పతివ్రత. బాల్యమున కడు గారాబముతోఁ బెరిగి, చిన్నతనముననే లక్ష్మీబాయి విదేశమున, నపరిచితుల నడుమ, మితభాషియు శాంతస్వభావుఁడు నగు భర్తచేతులలోఁ బడెను. వృక్షోత్పాటిత మగు సుకుమార కుసుమముభాతి నామె శుష్కించుపోయెను. తొమ్మిదేండ్ల బాలికజీవితము శోకావహ మయ్యెను. లక్ష్మీబాయి యీ దుఃఖము నెవ్వరికిఁ దెలుపఁగలదు? రెండు చల్లనిమాటలాడి యామె నూఱడించువా రెవరు? బాలిక పూర్వవృత్తాంతమును స్మరించుచుండును; జనకుని సహోదరుఁ దలచుకొని, యింతి నెప్పు రహస్యముగా కన్నీరు విడుచుచుండును.

దుఃఖము పాలై, కష్టములకు లోనైనప్పుడు బుద్ధితీక్ష్ణ మగును; కష్టసహిష్ణుత హెచ్చును. బాలిక యొకటి రెండు సంవత్సరములలోనే యింటిపనులను జక్కఁబెట్టుచు, పతిసేవా రత యయ్యెను. హిందూరమణులకు పతికన్న వేఱుగతి లేదు గదా! భర్త సదయహృదయుఁ డయ్యెనేని భార్యసంతోషించుచును, నిర్దయుఁడు విముఖుఁడు నయినను, స్త్రీకి పతిసేవకంటె వేఱొండుగతి లేదు. చంద్రరావు మిగుల నభిమానవంతుఁడు, దురాశాపరుఁడు, క్రూరుఁడు నయ్యు నయ్యబలయెడ నిష్ఠురముగాఁ బ్రవర్తించువాఁడు కాఁడు. ఆమెయుపచారములతో చంద్రరావు మిగుల సంతుష్టిఁ జెందును. యుద్ధము సమాప్త

మగటతోడనే భార్యకడకు వచ్చి యతఁడు సౌఖ్యము గాంచును; ఆమెరూపము నవలోకించి, మధురవాక్యముల నాకర్ణించి, లక్ష్మీబాయిని సస్నేహముగా ఱొమ్మునఁ జాల్చు ను. అయ్యెడ నామె లోకములో తానే ధన్యురా లని భావించును. హృదయేశ్వరుఁడు చూపెడు సామాన్యప్రేమతోనే పులకితగాత్ర యగును, మగఁడు వచించుతియ్యనిమాటకే ఆమె హృదయము నాట్య మాడును. ఉద్యానమునుండి పూల మొక్కను దెచ్చి గృహమధ్యమున చీఁకటిలో నుంపఁగా సూర్యకిరణము దానిపైఁ బడినప్పు డది యెంతగా పులకరించును !

ఇవ్విధమున సిలు దీర్చుచు, పతిసేవాపరతంత్రయై కొన్నిసంవత్సరములు గడుపఁగా లక్ష్మీబాయికి యౌవన మావిర్భవించెను. ఆమెజవ్వన మెంత శాంత మయినది! లక్ష్మి పూర్వవృత్తాంతము మఱచిపోయెను; అథవా యెన్నఁడయిన సాయంకాలములందు రాజస్థానపునంగతులు జ్ఞప్తికి వచ్చి, తన శైశవము, బాల్యక్రీడలు, ప్రియసహోదరుఁడును మానసమునఁ దోఁప నిశ్శబ్దముగా నామెచెక్కిళ్ళమీఁదుగా నొకటిరెండు బాష్పకణములు జాఱినను, లక్ష్మీబాయి వానిని తుడిచికొని మరల గృహకృత్యములందుఁ బ్రవేశించుచుండును.

నేఁడు చంద్రరావు భోజనము చేయుచుండ, ప్రక్కను నిలిచి లక్ష్మీబాయి వానికి వీవన వేయుచున్నది. ఇప్పు డీమెకు

పదునేడవవత్సరము. ఈమె సౌందర్యవతియేకాని రాజస్థాన కుసుమము మహారాష్ట్రమున వికసించితావులు వెదజల్లుచున్నను జవసత్వములు లేక క్షీణించుచున్నది.

"నీయన్న నాయధీనమున హావల్దారుగా నున్నాడు. కీర్తి సంపాదించుచున్నాడు" అని చంద్రరావు లక్ష్మితో నొకరోజున జెప్పియుండెను. ఆటలు ముగిసినతోడనే వాని మోము వన్నె తగ్గుట నవలోకించి లక్ష్మిబాయి సంశయగ్రస్త యయ్యెను.

మఱియొకనాడు భర్త వచించిన రెండువాక్యములచే నుత్సాహము నొంది, స్వామిపదయుగ్మముకడ గూరుచుండి యామె "ఈసేవకురాలి విన్నప మొకటి కలదు. చెప్పుటకు భయ మగుచున్నది" అని పలికెను.

పాన్పుపై శయనించి, చంద్రరావు తాంబూలము నము లుచు, అవనతవదనయై యున్న భార్యను సస్నేహముగా ముద్దాడి "ఏమో చెప్పు. నీకు నే నీయరాని దేమున్నది ?" అని వచించెను.

"నాసోదరుడు చిన్నవాడు, తెలివి తక్కువ వాడు."

చంద్రరావువదనము గంభీరమయ్యెను.

"వాడు మీసేవకుడు."

"కాదు, అతఁడు నాకంటెను సాహసి యని పే రొందినవాఁడు."

బుద్ధిమతి యగు లక్ష్మీబాయి వానియభిప్రాయము గ్రహించెను. ఆమె భయపడుచున్నట్లు లే జరిగినది. చంద్రరావు రఘునాథునియెడ నలుకఁ బూని యుండెను. ఆమె భీతిచే వణఁకుచు "చిన్నవాఁడు తప్పు చేసినను మీరు క్షమింప వలయును. మీరే క్షమింపనియెడల వాని కెవ్వరు వాని ననుగ్రహింతురు?" అని భర్తను వేఁడెను.

చంద్రరావుముఖము మరల నలుపువాఱుటచే నామె యానంగతి విడిచిపెట్టెను.

అటుతరువాత చంద్రరావు గృహమునకు వచ్చుట కిదియే మొదలు. రఘునాథునకు సంభవించినయవస్థ లక్ష్మీబాయి యెఱుఁగదు. అయినను, ఆమెహృదయ మేలనో చింతాకులమై యుండెను. నోరు దెఱచి యామె భర్త నేమియు నడుగ లేకపోయెను. చంద్రరావు నిద్రపోయిన పిమ్మట భృత్యుల నడిగి భ్రాతృవృత్తాంతము దెలిసికొనవచ్చును నని భావించెను.

చంద్రరావు భోజనము చేసి శయనాగారమున కరిగెను. వీటి తాకరండము చేతఁ బట్టుకొని లక్ష్మీబాయి తత్ప్రదేశము నకుఁ జనెను. చూడఁగా వానిముఖము చింతాక్రాంతమై యుండెను. భర్తకు తాంబూల మిచ్చి, ఆమె మెల్లఁగా నచ్చటి

నుండి వెడలిపోయెను. ఏమో యాలోచించుచు చంద్రరావు తలుపు మూసికొనెను.

మెల్లఁగా నతఁడు గుప్తస్థానమునుండి పెట్టెను బయటికిఁ దీసి, దెఱచి అందుండి పొత్తమును వెలువరించెను. చూడఁగా నయ్యది పద్దులు వ్రాయుపుస్తకము. రమారమి పదిసంవత్సరములక్రిందట గజపతిసింగునభలో నవమాన మొందిననాఁడు చంద్రరావు ఆపుస్తకమున ఋణమునుగూర్చి వ్రాసియుంచెను. ఆపత్త్రిము ద్రిప్పఁగా సుందరాక్షరములతో స్పష్టముగా నీక్రిందివిధమునఁ గన్పట్టుచుండెను.

"ఋణప్రదాత... ... ... గజపతి సింగు;
ఋణము ... ... ... అవమానము;
పరిశోధనము ... ... ...వానిరక్తముతోను,
వంశావమానముతోను."

ఒకసారి, రెండుసారు లీయక్షరములను బఠించి, మందహాసము తనవికటాననమునఁ దోఁప చంద్రరావు దానిక్రింద,

"నేటితో ఋణము తీఱినది!"

అని లిఖించి, తారీఖు వేసి, ఆపుస్తకము మూసెను.

పిమ్మట ద్వారము దెఱచి చంద్రరావు లక్ష్మీబాయిని బిలువగా నామె భయభక్తులతో భర్తసన్నిధి కేతెంచెను. అతఁడామెచేయి పట్టుకొని, ఇంచుక వెడనవ్వుతో "బహుకాలమునాటి ఋణము నేటితో దీఱినది!" అని వచించెను.

లక్ష్మీబాయి యదరిపడెను.

చంద్రరావు నివాసప్రదేశమునకు దాదాపు క్రోశముదూరమున ఈశానీమందిరము కలదు. పర్వతశిఖరముపై నాదేవళము పురాతనకాలమున నిర్మితము. భూతలమువఱకును శిలాసోపానములు కలవు. ఆసోపానములను బ్రక్షాళించుచు చిన్న యేఱు మర్మరవినాదముతోఁ బ్రవహించుచుండును. బహుకాలము నుండియు నసంఖ్యాకు లగు యాత్రికు లీపుణ్యజలమున మజ్జనము చేసి, ఈశానీదేవిని బూజించి పోవుచుండురు. ఇప్పటివఱకును దేవాలయగౌరవము కాని యాత్రికుల మొత్తము కాని తగ్గలేదు గుడివెనుక ననేకపురాణతరువులు కలవు. శృంగముల నుండి నేలవఱకును ఆ మహీరుహశ్రేణికంటె వే ఱేదియుఁ గాన్పింపదు. పగటివేళ నయితే మానిబిడపాదపసందోహమునఁ గొంచె మంధకారము కవియును ఆచెట్లక్రింద సేవిపూజకులు, నితరబ్రాహ్మణులును కుటీరముల నేర్పఱచుకొని నివసించుచుందురు. ఆపవిత్రప్రదేశమున కేఁగుచో శాంతరసభిన్న మగు భావోద్రేకము కలుగనేరదు. భారతవర్ష పూర్వకథలు, వేదఘోష, శాస్త్రప్రసంగములు తప్ప నన్య మచ్చోట వినఁబడదు. అనేకయుద్ధములతో మహారాష్ట్రము తలక్రిం దయ్యెను; కాని యాప్రశాంత దేవీమందిరము నెవ్వఁడును యుద్ధారవముతోఁ గలఁపలేదు.

జామురాత్రివేళ నాదేవళముకడ బాటసారి విహరించు చుండెను. వానిముఖమండలము మెత్తఁగా నుండెను, కనుబొమలు ముడివడి యుండెను, నేత్రము లున్మాదమును సూచించు చుండెను. హృదయము క్రోధ, విషాద, జిఘాంసలతో దహించుకొనిపోవు చుండెను.

చాలసే పతఁ డిటు నటుఁ దిరుగుచుండెను. వానిశరీరము బలహీన మయ్యెను, కాని హృదయవేదన శమింప లేదు. ఆతఁ డున్మత్తప్రాయుఁడు శీఘ్రముగా నుపశమము చేయని యెడల వానివివేచనాశక్తి సడలుటో, నశించుటో సంభ వించును. ప్రకృతియే చికిత్సకురాలు. తాపశోకమున పెద్దపర్వత ములవలె దాపరించు నష్టములను, శరీరమును శుష్కింపఁజేసి, అగ్నివలె దహించుకొనిపోవు చింతలను, ఔషధము గాని చికిత్సకుఁడు గాని లేని మనోవ్యాధులను నివారించుటకు బుద్ధిని పోఁగొట్టి సుఖము నిచ్చునది ప్రకృతియే కదా! ఉన్మాదమే యెందఱు దౌర్భాగ్యులకు శరణము! దీనికొఱకు దివారాత్రములు మొత్తుకొన్నను, ఎంతమందిదీనుల కిది లభింపకున్నది!

ఆవృక్షములక్రింద కొందఱు బ్రాహ్మణులు పురాణముఁ జదువుచుండిరి. ఆపుణ్యకథలు సుధావర్షము గురియుచున్న ట్లుండెను: అచ్చటివారల హృదయములు శాంతరసమగ్నము లయ్యెను.

ప్రశాంతపవనము పవిత్రపురాణకథలు పాంథుని సంతప్త హృదయమున శాంతిసేచనము సేయఁజొచ్చెను. ఆదీనుని యున్మత్తత క్రమముగ తగ్గిపోయెను. రఘునాథుఁడు చెట్టుక్రింద బవ్వళించెను. చింతాహారిణియగు నిద్రాదేవి వానిని తనయంకమున దాల్చెను.

రఘునాథుఁడు కలవరింపఁ జొచ్చెను.

ఒక్కటొక్కటిగా యౌవనోద్యమములు భగ్నమయ్యెను. ఆశాప్రదీపము నిర్వాణము నొందెను. ఆచీఁకటి రాత్రివేళ బంధువిహీనుఁ డగు నాపదుచువాని యంతరంగమున బహుదినచరిత్రము పూర్వజన్మస్మృతివోలె క్షీణముగా మెలఁగఁ జొచ్చెను. శోకభరమున మానస మాయాసకరము నొందినప్పుడు, ఆశేసయితము విడిచిపోవునప్పుడును బంధువిహీనుఁడు స్మరించుసంగతులనే రఘునాథుఁడు స్వప్నమునఁ గాంచుచుండెను. అనురాగభరిత మయిన జననీముఖము వానికిఁ గాన్పించెను. దీర్ఘకాయుఁడగు జనకునివదనము దృగ్గోచర మయ్యెను. బాల్యమున సూర్యమహాల్ దుర్గమునందు దా నాడిన యాటలు పాడిన పాటలును జ్ఞప్తికి వచ్చెను తోడ్తో వైష్ణవ సహచరి యగు ప్రియసహోదరి లక్ష్మిబాయి మనమ్మునఁ బొడకట్టెను. అట్టి శాంతభగిని యీజన్మమున మరల వానికిఁ గాన్పించునా? నేఁ డాపందువంటి సంసార మెక్కడ నున్నది? ప్రాణసమానయగు చెలియ లెక్కడ? నిద్రించుచున్న రఘునాథునికంటినుండి బాష్పకణము జాఱి నేలపైఁ బడెను.

అతఁడు తోఁబుట్టువు సుఖమును గూర్చి చింతించుచు కన్నులు విప్పెను. అప్పుడు వానికి గాన్పించినదేది? లక్ష్మీబాయి స్వయముగా వానితల తొడమీఁదఁ బెట్టుకొని యున్నట్టులును, చల్లనిహస్తమును వాని సంతప్తవదనముపై నెలకొల్పి యున్నట్లును, స్నేహరస ముట్టిపడు నేత్రములతో వానిమొగము వంక ఱెప్ప వాల్పక చూచు చున్నట్లును రఘునాథునకుఁ దోఁచెను! చింతచేఁ గాఁబోలు, ఆమె ప్రఫుల్లవదనము కొంచెము వాడి యుండెను; నేత్రములు విశాలములు తేజోవంతములు నయ్యుఁ గొంచెము వన్నె తగ్గి యుండెను.

రఘునాథుఁడు కన్నులు మూసికొని, యశ్రుసంయమము విడిచి, "భగవన్, అనేక దుఃఖములను సహించితిని. లేనిపోని యాశతో నాహృదయము నేల కలఁచెదవు? నాకు పిచ్చియెత్తలేదుగద!" అని మెల్లఁగ పలికి, నిట్టూర్పు విడిచెను. కోమలహస్తము వాని కన్నీటి బిందువులను తుడిచినట్లయ్యెను. రఘునాథుఁడు మరలఁ గన్నులు తెఱచెను. అది స్వప్నము కాదు; ప్రియసహోదరి వాని మస్తకమును తన యూరువుపై నిడుకొని, తలమూలమున నాసీనయై యుండెను.

రఘునాథుని మనస్సు క్రక్కదలెను. అతఁడు లక్ష్మీబాయి చేతులను తన సంతప్తహృదయముపై నుంచుకొని ఆమె ముఖము వీక్షించెను: వానికి వాక్స్ఫూర్తి లేదయ్యె. నేత్ర

ములనుండి కన్నీరు ప్రవహించెను. తుదకు సహింపలేక అతఁడు రోదనపూర్వకముగా నుచ్చైస్స్వరమున నిట్లనెను: "లక్ష్మీ, లక్ష్మీ, నిన్నీజన్మలో మరలఁ జూచు భాగ్యము కలిగినది. దౌర్భాగ్య సహోదరుని నీదగ్గఱ నుండనిమ్ము. ఈజీవితకాలములో వాఁడు కోరునది మఱేమియు లేదు."

లక్ష్మియు శోకము నణచుకొనలేక, అన్నతొమ్ముపైఁ జనమోము వెట్టి ప్రాణము లెగిరిపోవునట్లు లెలుఁగెత్తి యేడ్చెను.

వారు చాలతడవు మాటలాడ లేకుండిరి. అనేక వానరముల నాఁటివృత్తాంతములు వారిమనస్సులలో మెలఁగఁజొచ్చెను. దుఃఖప్రవాహము సంతోషప్రవాహముతోఁ గలిసెను. నడుమనడుమ బాష్పధారలచే నిర్భరదేహములు తడిసిపోవుచుండెను.

కొంతతడవునకు శాంతి నొంది లక్ష్మిబాయి చీరచెఱఁగుతో నన్నకన్నీరు దుడిచి యిట్లు పలికెను: "ఈశానీదేవి ప్రసాదముచేతను, కొంత నాప్రయత్నముచేతను నిన్నుఁ గనుఁగొంటిని. ఈదీనురాలిలలాటమున సంతోషరేఖగూడ కలదా! భాయీ, ఈచలిగాలిలో నున్నయెడల నీకు జబ్బు చేయును. లెమ్ము, మందిరములోనికిఁ బోవుదము. నే నిచ్చట చాలతడవుండుటకు వీలు లేదు."

వారిద్దఱు నాలయములోని కరిగిరి లక్ష్మీబాయి స్తంభముదగ్గఱఁ గూరుచుండెను. రఘునాథుఁడు వెనుకటివలెనే చెల్లెలియంకమున మస్తకము పెట్టుకొని పండుకొనెను.

అల్లనల్లన అన్నశరీరము నిమురుచు లక్ష్మీబాయి యేమో ప్రశ్నించుచుండ, రఘునాథుఁడు తగుసమాధానములను జెప్పుచుండెను.

అగ్రజునిదుఃఖకథ నాకర్ణించుచు లక్ష్మీబాయి కన్నీరు విడుచుచుండెను. రఘునాథునికథ ముగిసిన వెనుక నెట్లో దుఃఖము నణఁచుకొని నన్నుఁగూర్చి యెట్లు చెప్పుకొందును? అని భావించి, కన్నీటిం దుడుచుకొని లక్ష్మీబాయి తనవృత్తాంతము వానితోఁ జెప్పసాగెను. ఆమె చంద్రరావుపేరెత్తలేదు. మహారాష్ట్రమునకు వచ్చినతోడనే ఆమె నొకజాగీర్దారు పెండ్లియాడెను. హిందూరమణులు తమభర్తలను బేర్కొనరు. కాని ఆమెభర్తనామము గగనమండలమునఁ బ్రకాశించు హిమాంశుని సామాన్యనామమే. శశలాంఛనుని విధమున నామెపతికీర్తి నల్దిక్కుల వ్యాపించుచున్నది. లక్ష్మీబాయి సంతోషముతోనే కాలక్షేపము చేయుచున్నది హృదయేశ్వరుఁడు లక్ష్మిపై ననుగ్రహము చూపుచుండును; సహోదరుఁడు సుఖపడుచుండఁగా చూడవలె నని మాత్ర మున్నది. రఘునాథుని వార్త లామె కప్పుడప్పుడు తెలియవచ్చుచుండెను. వాని చూడవలె నని యామె ప్రయత్నించెను. ఆయభిలాష

తోనే నేఁడామె యీశానీదేవ్యాలయమునకు పూజార్థము రాఁగా మందిరముప్రక్క చెట్టుక్రింద నగ్రజుఁడు కానఁబడెను.

ఇవ్విధముగాఁ దనస్థితిగతులను సోదరునకుఁ దెలిపి కొండవంటి యాతనిదుఃఖమును పోఁగొట్ట లక్ష్మీబాయి యత్నించెను.

ఆమె నానావిధములఁ బ్రబోధించి వానిహృదయమును శాంతపఱిచి తుద కిట్లనెను: "ఎల్లకాలము మనజీవిత మీ విధముననే యుండఁబోదు. మానవజన్మ దుఃఖమయము. ఖేదము సంఘటిల్లినపుడు సహింపవలెను. సుదినములుకూడ వచ్చుచుండును. చిన్నతనమున సుఖము లనుభవించినాము, తరువాత కష్టము లనుభవించినాము. మరల సుఖము సంభవింప వచ్చును. నీనిరాశను విడువుము. నిద్రాహారములను విసర్జించినచో మానవదేహ మెన్నాళ్లు నిలుచును?"

"నిలువవలసిన యవసర మేమి? రాజద్రోహి యని సైనికునిపై నింద పడినప్పుడే ప్రాణము పోయిననేమి?"

"చూడు, నాకీలోకములో నెవ్వ రున్నారో? తండ్రి లేఁడు, తల్లి లేదు. చెల్లెలిని మఱచితివా? విధాత యీదీను రాలియెడ విముఖుఁ డయ్యెనా"

"లక్ష్మీ, నీకు మనోవ్యథ కలిగింప నెంచలేదు. ఈ జన్మలో నాకింక సుఖము లేదు. సైనికునిమనోవ్యథ నీ కేలాగునఁ దెలియును? ప్రాణములకంటెను యశస్సు ప్రియతరము;

మృత్యువుకంటెను నపకీర్తి వేయిమడంగులు దారుణము. నాకు కళంకము దాపరించినది.

"కళంకమును బాపుకొనుట కేల యత్నము చేయ రాదు ? మహానుభావుఁడు శివాజీసన్నిధి కేఁగుము. కోపము శాంతించినప్పు డాయన నీమాటలను తప్పక యవధరించును, నీవు నిర్దోషి వని తెలిసికొనును."

రఘునాథుఁడు ప్రత్యుత్తర మీయ లేదు; కాని వాని ముఖము జేవురించెను; కన్నులనుండి యగ్నికణములు రాలు చుండెను. జనకుని యభిమానము పౌరుషమును పుత్రునియందు వర్తించుచున్న వని గ్రహించి బుద్ధిమతి యిట్లనెను: మహారాష్ట్రప్రభునిసన్నిధికిఁ బోవుట నీకు సమ్మతము కాదేని, కార్యముద్వారా నీ వాదుర్యశము నేల పోఁగొట్టుకొన రాదు ? సైనికుని సాహసము, ప్రభుభక్తియును కార్యమువలనఁ దెలియ నగు నని నాయనగారు చెప్పుచుండెడివారు. ఖడ్గహస్తుఁడ వై, రాజద్రోహి యనుకళంకమును బాపుకొనరాదా ?"

ఆశచే నేత్రములు వికసింప, రఘునాథుఁడు "అ దెట్లు?" అని చెల్లెలి నడిగెను.

"శివాజీప్రభువు ఢిల్లీనగరమునకుఁ బోవ నున్నా రని వింటిని. అక్కడ ననేకకార్యములు సంఘటిల్లవచ్చును. సుభటుఁడు స్వామికి తన్నెఱింగించుకొనుటకు ఉపాయము

లనేక ముండును. నీవు నాయనగారివలె వీరుఁడ వగుదువేని నీ యుద్దేశము సఫలము కాకపోదు.”

రఘునాథుఁడు స్వస్థచిత్తుఁడై యున్నపక్షమున లక్ష్మీబాయి మనశ్శాస్త్రమునందు అనభిజ్ఞ కాదని గ్రహించియుండును. ఆమె పచరించిన యౌషధబలమున వెంటనే సంతాపము రూపు మాసి, సైనికునిహృదయము క్రమ్మఱ నుత్సాహోల్బణ మయ్యెను.

కొంతతడవు పతిఁడు చింతామగ్నుఁడై యుండెను. చప్పున వానివదనము, లోచనములును నూత్న కాంతి నొందెను. అంత రఘునాథుఁ డిట్లు పలికెను: “లక్ష్మీ, నీ మాటలు వినఁగా వినఁగా నూతన భావ ముదయించినది. భగవానునియనుగ్రహమున, రాజద్రోహిని పిఱికిపందను కానని యింకను లోకమునకు వెల్లడి చేయవచ్చును.”

“భాయీ, నీయుత్సాహము గాంచి నాప్రాణములు లేచివచ్చినవి! నీచెల్లెలు బ్రదికియున్నంతకాలము నీవుసఫల మనోరథుఁడవు కావలయు నని ఈశ్వరునిఁ బ్రార్థించుచుండును”

“నేను బ్రదికియున్నంతకాలము నిన్ను మఱచిపోను.”

లక్ష్మీబాయి అవనతముఖియై యుండి, “నే నొకసంగతి చెప్పఁదలఁచుచున్నాను, కాని భయ మగుచున్నది.” అని మెల్లన వాక్రుచ్చెను.

“లక్ష్మీ, నాయెదుట నేమాట చెప్పుటకయినను నీకు భయ మెందులకు? నేను సహోదరుఁడను గదా!”

“చంద్రరా వను జహగీర్దారుడు నీ కపకారము చేసె నని తెలియవచ్చినది.”

రఘునాథునియానంద మెగిరిపోయెను, ముఖము రక్తిమం దాల్చెను; కాని యతఁడు శాంతముగా “రాజసన్నిధిలో చంద్రరావు పలికినవాక్కు లసత్యములు కావు. అతఁడు అప కారము చేసెనో, లేదో నాకు తెలియదు” అని నుడివెను.

“ఆయన యేమయినఁ జేసియుండును గాక, భాయియా, నీ వాయనకు కీడు చేయరాదు.”

నిరుత్తరుఁడై రఘునాథుఁ డేమో చింతించుచుండ లక్ష్మీబాయి మరల నిట్లనెను: “అన్న నిదివఱ కెన్నఁడు నేదియుఁ గోరియుండ లేదు. ఇదియే మొదటియాచన. భాయియా, ఈనా మొదటియాచనను త్రోసివేయకుము.”

రఘునాథునిహృదయము కరఁగిపోయెను. చెల్లెలిచేతు లను పట్టుకొని యతఁడు “లక్ష్మీ, చంద్రరావే నాకొంపఁదీసెనని లోలో ననుమానించితిని. కా నిమ్ము నీ కీయరానిదే మున్నది? దేవాలయమునఁ బలుకుచున్నాను. చంద్రరావునకు నెట్టియపా యము కలిగింపను. వానిదోషములను క్షమించితిని, భగవం తుఁడు కూడ క్షమించును గాక!” అని పలికెను.

"భగవంతుఁ డాయనదోషములను క్షమించును గాక" అని లక్ష్మీబాయి మనఃపూర్వకముగా వచించెను.

తూర్పుదిక్కున రాగరేఖలు వొడమెను. అంతట లక్ష్మీబాయి, "నావెంటఁ గొంతపరివారము వచ్చియున్నది. ఇఁక నేఁ బోవలయును. పరమేశ్వరుఁడు నీమనోరథముఁ దీర్చును గాక!" అని పలికి, స్నేహముగా నన్న యొద్ద సెలవు దీసికొని, వెడలిపోయెను.

"పరమేశ్వరుఁడు నీకు సుఖము నొసఁగుఁ గాక!" అని పలికి రఘునాథుఁడు చెల్లెలిని వీడ్కొని, దేవాలయమునుండి నిర్గమించెను.

౨౦

రుద్రమండలదుర్గమును జయించునాఁడు యుద్ధమునకుఁ బూర్వము రఘునాథుఁడు సరయుఃఘ్రసకుఁ గనఁబడుటకయి యామె యొద్దకుఁ జనియుండెను. కన్నులవెంట బాష్పములు జాలువాఱ సరయూబాల రఘునాథుని వీడుకొల్పెను.

ఒకరోజు, రెండురోజులు గడచెను; రఘునాథునివార్త తెలియవచ్చినది కాదు. ఆశాదేవి తొలుదొల్త నామెచెవిలో నిట్లు చెప్పెను: "రఘునాథుఁడు యుద్ధములో పరాక్రమము చూపి, రాజసన్మానము వడసినాఁడు; త్వరితముగా నిచ్చటికి

వచ్చి జనార్దనునితో యుద్ధవిశేషముల జెప్పెను." కాని రఘు
నాథుఁడు రానే లేదు

రఘునాథుఁడు రాజద్రోహి యనియు తత్కారణమున నవమానితుఁడు దూరీకృతుఁడు నయ్యె ననియు పిడుగువంటి వార్త వచ్చెను. తొలినిమిషమున సరయూబాల యులికిపడెను ఆమాటలలోని యర్థమామెకుఁ దెలిసినది కాదు. క్రమముగా నామెముఖ మెఱ్ఱవాఱెను, కన్నులు నిప్పులు గ్రక్కఁజొచ్చెను, శరీరము వడఁకుచుండెను. అప్పుడామె దాసిని జూచి, "ఏమంటివి? ఆయన ద్రోహి యనియా? ముసల్మానులతోఁ జేరె ననియా? సరి! నీవు వట్టి మూర్ఖురాలవు! నిన్ననిన లాభము లేదు. ఎదుటినుండి దూరముగా పో" అని కసరికొట్టెను.

క్రమముగా సైనికులు దేశములోనికి రాఁజొచ్చిరి. ఎవ్వనినోట విన్నను రఘునాథుఁడు రాజద్రోహి యను మాటయే! జనార్దనుఁడు, కన్నుల నీరు గ్రమ్మ, "అట్టి చక్కని వానిమానసమున నిట్టిదురాలోచన కలదని యెవ్వఁ డెఱుఁగును!" అనెను. సరయూబాల యామాటల నాకర్ణించి, ప్రత్యుత్తర మీయ లేదు. లోకులు రఘునాథుఁడు ద్రోహి యని చెప్పుచున్నను, ఆమె నమ్మ లేదు. అతఁడు నిర్దోషి యనియే ఆమె తలఁచుచుండెను.

ఇవ్విధమునఁ గొన్ని దినములు దాఁటినపిమ్మట నొక సంజవేళ సరయూబాల సరోవరమున కరిగెను. సరస్తీరమున

జటాజూటధారియు, దీర్ఘకాయుఁడు నగుగోసాయీ యాసీనుఁడై యుండెను. మొట్టమొదట విస్మయ మొందినను వాని యాకారము చూచినకొలఁది నామెహృదయమున భక్తి యావిర్భవించెను.

గోసాయీ సరయువును సవిమర్శముగాఁ జూచి, గంభీర స్వరముతో "భద్రురాలా, ఈగోసాయీదగ్గఱ నీ కేమయినఁ బ్రయోజన మున్నదా? ఏదేని మనోరథముతో నాకడకు వచ్చితివా? నీముఖమున దుఃఖలక్షణములు కాన్పించుచున్న వేమి? కన్నులవెంట నీరు కాఱుచున్న దేమి?" అని యడిగెను.

సరయువు బదులు చెప్పలేకపోయెను. క్రమ్మఱ గోసాయీ "నీ యభిప్రాయము నాకుఁ దెలియుచున్నది. బంధువునుగూర్చి తెలిసికొనఁ దలఁచుచున్నావు" అనెను.

సరయువు డగ్గుత్తికతో "గోస్వామీ తమశక్తి యసాధారణము. అనుగ్రహించి యింకను గొంచెము చెప్పుదురేని మీకుఁ గృతజ్ఞురాలనై యుందును. ఆబంధువు విపత్తులో నున్నాఁడు" అని ప్రత్యుత్తర మిచ్చెను.

"లోకములో నెల్లరు నతనిని రాజద్రోహి యని తలఁచుచున్నారు."

"దేవరవారికిఁ దెలియని దేదియు లేదు."

"రాజద్రోహి యని భావించి శ్రీరామమహారాజు అతనిని వెడలఁగొట్టినాఁడు."

ఆమెయాననము కషాయకాంతి వహించెను, కన్ను లెఱ్ఱనయ్యెను. "మ తేమయిన నమ్మెదను; కాని ఆయన రాజ ద్రోహి యనుమాట విశ్వసింపను ! మహాత్మా ! నాకు సెల వీయవలెను" అని యామె పలికెను.

కన్నులనిండ నీరు గ్రమ్మఁగా నతఁడు "నే నింకను కొంచెము చెప్పవలసి యున్నది" అని మెల్లన వచించెను.

"ఆన తిండు !"

"మానవహృదయమును గ్రహించుట కష్టము. రఘు నాథునిహృదయమునం దే ముండెనో తెలిసికొనుట కొకటే యుపాయము కలదు. ఆతని ప్రేయసియొద్దకుఁ జనుము. ప్రణ యినీహృదయము ప్రియునిహృదయమునకు దర్పణమువంటిది. ఆమెమనోగతము నడుగుము. ఆమెయభిప్రాయ మసత్యము కానేరదు."

సరయువు నభోమండలమువైపు దృష్టి నిలిపి "జగదీశా, ఇంతదనుక నామనస్సున శాంతి నెలకొల్పి యున్నావు. ఆయో ధయే భర్త కావలె నని యెవతె యాశ పెట్టుకొన్నదో, ఆమె బ్రదికియుండఁగా నాతనిపై విశ్వాసము వదలదు !" అని వక్కాణించెను.

ఒక్కింతసేపు యోచించి మరల గోసాయి యిట్లనెను: "భద్రురాలా, నీమాటల సాకర్ణింప నీవే యాతనిప్రియురాల వని తెలియు చున్నది. నేను దేశదేశములు తిరుగువాఁడను. ఒకవేళ నతనిని గలిసికొనినఁ గలిసికొన వచ్చును. కాఁబట్టి, యతని కేమయినఁ జెప్పెదవా? నా దగ్గఱ సిగ్గుపడ వలసిన పని లేదు. నేను సన్న్యాసిని గదా!"

సరయువు కొంచెము లజ్జతో "మహాత్మా! నకాయన గారు ఎప్పుడు కాన్పించినారు?" అని యడిగెను.

"నిన్నటిరాత్రి యీశానీమందిరమునఁ గనఁబడినాఁడు. నన్ను నీదగ్గఱకుఁ బంపినవాఁ డతఁడే."

వా రిప్పుడు చేయఁదలఁచినపని తమకుఁ దెలిపినారా?

"అన్యాయముగా వచ్చిన యపయశమును తొలఁగించుకొనుట. అథవా అట్టి ప్రయత్నములో ప్రాణములనైనఁ గోల్పోవుట."

"వీరుని ప్రతిజ్ఞ! వారు మీకుఁ గనఁబడినయెడల నిట్లు చెప్పుఁడు: సరయూబాల రాజపుత్త్రాంగన. ప్రాణములకంటెను కీర్తిని మిన్నఁగాఁ దలఁచును. భగవంతుఁడు వారి యత్నములను సఫలము చేయునుగాక!"

"తప్పక చేయుఁ గాక! కాని, భద్రురాలా, మంచివారలకును సర్వదా జయము గలుగదే. అతనికి మాత్రము కార్యసిద్ధి తప్పక యగు ననుటకు ప్రమాణ మేమి యున్నదా? విశేషించి రఘునా

ఘుడు తలపెట్టిన కార్యము విఫలమైనతో నిండియుండును. ఒక వేళ ప్రాణము పోయినను పోవచ్చును."

"రాజపుత్త్రుల కది క్రొత్తకాదు. ప్రయత్నమున మరణము సంభవించునెడల వారి యశోగీతములు పాడుచు, నుల్లాసముతో నరయువు ప్రాణములు విడుచు నని వారితోఁ జెప్పుడు."

ఉభయులు నొకింతసేపు మిన్నకుండిరి. తరువాత సరయూబాల "వారు తమతో నిం కేమయినఁ జెప్పిరా?" అని యడిగెను.

కొంచె మాలోచించి గోసాయీ యిట్లనెను: "లోకులు ద్రోహి యనువానికి హృదయమున నెట్లు చోటిచ్చెదవు? జనులు నామము నుచ్చరింప వెఱచువానిపేరు నేలాగున స్మరింతువు? దౌర్భాగ్యరఘునాథుని సరయూబాల జ్ఞప్తియం దుంచుకొనునా? అని యతఁడు నిన్నడిగినాఁడు."

"మహాత్మా, సరయువు రాజపుత్త్రయువతి, విశ్వాసఘాతకురాలు కానేర దని వారికిఁ దెలుపుఁడు"

"మహాదేవ! ఇఁక నాతనికి మనోవ్యథ లేదు. లోకులు చెడ్డవాఁ డందురు గాక! ఒక్కయువతి మాత్ర మింకను తన్ను విశ్వసించుచున్న దని రఘునాథుఁడు తెలిసికొనును. ఇఁక నేఁ బోయెద. నే నీమాటలు చెప్పునెడల నతని చిత్తము శాంతి ఁదును."

"భగవంతుఁడు వారికి శరణమగుఁ గాక!" అని సర యువు సజలనయనయై పలికెను. మరల నిర్వురు నిశ్శబ్దముగా నుండిరి. "మహాత్మా! నాహృదయము శాంతపఱచినారు. తమ నామ మడుగ వచ్చునా?" అని యామె యతనిని బ్రశ్నించెను.

"గోసాయీ సీతాపతి."

చీకటి వ్యాపింపఁ జొచ్చెను. ఆ యంధకారమున గోసాయీ ఒంటరిగా రాజ్‌గఢ్ దుర్గాభిముఖుఁడై చనెను.

౨౧

కొలఁది రోజులకు రాజధాని యగు రాజ్‌గఢ్ దుర్గమున రాత్రి రెండుజాముల వేళ సభ జరిగెను. ప్రధాన సేనాపతులు, మంత్రులు, ఉద్యోగస్థులు, శాస్త్రవిదు లగు బ్రాహ్మణులును సదస్సునకు విచ్చేసిరి. పరాక్రమశాలి, ధీసంపన్నుఁడు, రాజనీతి విశారదుఁడు, వృద్ధుఁడు నగు న్యాయశాస్త్రి సభయం దుండెను. అన్నివిషయములందును ఈయనయే శివాజీకి సహా యము చేయుచుండెను. శివాజీ వలెనే ఈయన కూడ స్వదే శాభిమాని. సభాభవనము నిశ్శబ్దముగా నుండెను. మహా రాష్ట్రులు తమగౌరవలక్ష్మిని వీక్షించుటకయి సమకూడి యుండిరి.

కొంతసేపటికి శివాజీ మోరేశ్వరుని సంబోధించి "పీష్వాజీ, నేను వానికి లోబడి జాగీర్దారుగా నుండవలయు ననియేనా తమ యుపదేశము?" అని ప్రశ్నించెను.

"మానవ సాధ్య మగుదానిని తమరు సలిపి యున్నారు. విధినిర్బంధము లంఘింప నెవ్వరితరము?" అన్నాడు పీష్వా.

"స్వర్ణదేవా, నాయాజ్ఞానుసారముగా మీ రీదుర్గమును నిర్మించునప్పుడు ఇది స్వతంత్రనృపాలుని రాజధాని యాగు ననియా? జాగీర్దారుని యావాసస్థాన మగు ననియా మీ తలంపు?"

"దేవా, భవానీదేవి యనుమతిచొప్పున ననేక కార్యములు చేసియుంటిరి. ఆమె యాజ్ఞప్రకారముగానే పట్టు విడిచితిరి. అందాక్షేపణ మేమియు లేదు. హిందూసేనాపతితో యుద్ధము భగవతి నిషేధించినది కదా!" అన్నాడు స్వర్ణదేవుడు.

"ఏది యనివార్యమో అది సంఘటిల్లినది. ఇపుడు దేవరవారు ఢిల్లీనగరి కరుగుట ఉచితమా, కాదో వివేచింపుడు" అని అన్నాజీ దత్తు పలికెను.

అన్నాజీ, మీమాటలు బాగుగా నున్నవి కాని, ఏయాశ బహుదినములనుండి హృదయమున నాటుకొని ఉన్నదో అది శీఘ్రముగా వదలదు. మహారాష్ట్రదేశము వృద్ధిలోనికి వచ్చుననియు మరల హిందూనృపాలుడు ఆసేతు హిమాచలము భరతఖండము నేలు ననియు భవానీదేవి నాకుఁ

జెప్పుచుండెడిది. నాయాశ కేవల స్వప్నమగునేని, భగవతి నాహృదయమును నిష్కారణముగా నేల కలంచివైచెను ?”

ఈవాక్కుల నాలకించి సభలోనివా రెల్లరు నీరవులైరి. ఆ శాంతసభలో చీఁకటిమూలనుండి “ఈశానీదేవి వచింపదు. మనుష్యులు ప్రయత్నపరు లగుదురేని భగవతి వారికి సాహాయ్య మగును” అని గంభీరవాక్కు వినఁబడెను. ఉలికిపడి శివాజీ తిరిగి చూడఁగా గోసాయీ సీతాపతి ప్రత్యక్ష మయ్యెను.

ఉత్సాహముచే నేత్రములు వికసింప శివాజీ యిట్లనెను. “మహాత్మా, నాచిన్ననాఁటి యుత్సాహము మీరిప్పు డుద్రేకింపఁ జేసితిరి. బాల్యకాలమునాఁటి వృత్తాంతమునుజ్ఞప్తికిఁ దెచ్చితిరి. దాదాజీ కొణదేవుఁడు మరణసమయమున నాకు “వత్సా ! నీవు చేయుకార్యముకంటె మహత్తరము వేఱొకటి లేదు. ఈమార్గమును విడువవలదు. ఈశానీదేవి నీకుఁ జూపిన మార్గము ననుసరింపుము” అని యుపదేశించెను. రహారమి యిరువదిసంవత్సరములనాఁటి మాటలు ఇప్పటికిని నా చెవులలో మ్రోఁగుచున్నవి. దాదాజీవాక్కులు వ్యర్థములా ?”

“వారియుపదేశము వ్యర్థము కానేరదు. ఉన్నతమార్గము ననుసరించుచో తగినఫలము సిద్ధించును. మార్గమధ్యమున నిరుత్సాహులమై, మొదటియుద్దేశమును విడుతుమేని, అది దాదాజీ వంచనయా ? మనభీరుతయా ?”

సభాస్థలమున కలకలము సంభవించెను. వీరులకోశము లందు ఖడ్గములు ఝణఝణధ్వని చేసెను.

గోసాయీ మరల గంభీరముగా నిట్లనెను: "రాజన్, జాగీర్దారుఁడుగా నుండి వసీరుఁడు రాజయ్యెనో, బహుకాలము స్వాతంత్ర్యము వహించియుండెనో, మ్లేచ్ఛులను దండించెనో, అట్టివాఁడు స్వాతంత్ర్యమునకు జలాంజలి విడుచునా? బాలభానునిభంగి పారతంత్ర్యతిమిరమును పాఱద్రోలి, హిందూ గౌరవద్యుతి నల్గడల బ్రసరించిన యీ మహారాష్ట్రసూర్యుఁడు అకాలమున నస్తమించునా? రాజన్, హిందూగౌరవలక్ష్మి దేవరవారిని వరించినది; స్వేచ్ఛాపూర్వకముగా తమరు తద్విసర్జనము చేయుదురా? వివేచించి చూడుఁడు."

సభాసదులు మిన్నకుండిరి, శివాజీ యూరకుండెను, కాని యతని నేత్రములు ధగధగ లాడుచుండెను. కొంతసేపటికి గోసాయీవంకఁ జూచి యతఁడిట్లనెను: "మహాత్మా, మీ వాణి నాహృదయమున దృఢముగా నాటుకొన్నది. మీ యొక్క మాట అడిగెదను. రాజపుత్రసేనాని మహాపరాక్రమవంతుఁడు, బుద్ధిశాలి, రణకుశలుఁడు; ఆయనకు గొప్పసైన్యమున్నది. అట్టివానిని మోహరించుటకు మనకు తగినంతసైన్యమేది?"

"రాజపుత్రులు వీరులే, కాని మహారాష్ట్రులు దుర్బలులు కారు. జయసింగు రణకోవిదుఁడే, కాని శివాజీ ఛత్రి

పతి తప్పక పట్టుడు కాదు. పరాజయము కలుగు నని సంశ యించు వో పరాజయమే కలుగును. పురుషసింహా, విపత్తు లను తృణీకరించి కార్యసాధనము జూడుము. తమయతో గీత ములను పాడుచున్నా డదెవ్వడు లేడు ?"

"ఏది తప్పు, కాని హిందువులు హిందువులతోఁ బోరుట సొంపా ? అది పుణ్యకర్మ యగునా ?"

"ఆపాప మెవ్వనికి ? స్వధర్మముకొఱకు, స్వదేశము కొఱకు యుద్ధముచేయువానికా ? దేశద్రోహుల ధనమును స్వీకరించి స్వజాతికి విరుద్ధముగాఁ బ్రవర్తించువానికా ?"

శివాజీ కొంతతడవు మౌనముద్ర నహించి తరువాత మెల్లఁగా తలయెత్తి యిట్లనెను:

"గోసాయిరాజ్, మహారాష్ట్ర మిప్పటికిని వీరశూన్యము కాలేదు, పరాధీనము కాఁబోదు. మరల యుద్ధము సంభవిం చుట నిక్కము, కాని ఇరో జింకను రాలేదు. అపజయము కలుగు నన్నశంక లేదు. వేఱొకకారణమున ప్రస్తుతము యుద్ధ విముఖుఁడ నైతిని.

"నేఁ బూనిన మహావ్రత సాధనకొఱకు బహువిధో పాయముల నవలంబించితిని. మ్లేచ్ఛులు మనతోఁ జేసినసంధి ప్రకారము నడుచుకొనరు; నేనుగూడ వాండ్రయెడ సరిగా ప్రవర్తింపను.

"హిందూధర్మసంరక్షకుఁడవు, సౌర్వసరత్నసుఁడవు, పరాక్రమశాలియు నగుజయసింగుతో సంధి చేసితిని. ఆసంధి భంగము చేయను.

"సత్యపాలనమున సనాతన హిందూధర్మసంరక్షణము జరుగనిచో సత్యోల్లంఘనమున జరుగునా? అని రాజా జయసింగు నాతోఁ బలికినవాక్య మింకను మఱచిపోలేను.

"మహాత్మా, కపటవర్తనుఁడు ఔరంగజేబు మనతో స్థాపించినసంధిని మీఱును. అప్పుడు మీ యుపదేశమును గ్రహించువాఁడను. కాని, సత్యపరాయణుఁ డగు జయసింగు తోడి సంధిని మీఱుటకు వీలు లేదు."

"మహారాజా, డిల్లీనగరమునకుఁ బోవ నిశ్చయించితిరా? అని అన్నజీ యడిగెను.

"సరే యని రాజా జయసింగునకు వాగ్దానము చేసితిని."

"మహారాజా, చక్రవర్తి మోసగాఁడు; వానిమాటలు మీరు విశ్వసింతురా? మనఃపూర్వకముగా నతఁడు మిమ్ము నాహ్వానించెనో లేదో గ్రహింపలేదా?"

"అన్నజీ, డిల్లీనగరమున నా కెట్టియాపదయుఁ గలుగదని రాజా జయసింగు స్వయముగాఁ జెప్పినాఁడు."

"దుర్మార్గుఁడు, ఔరంగజేబు మిమ్ముఁ జెఱసాలలోఁ బెట్టినచో జయసింగు ఎట్లు రక్షించును?"

“సంధి నతిక్రమించుటవలనఁ గలుగుఫలము ఔరంగ్ జేబు తప్పక యనుభవింపఁగలఁడు. దత్తాజీ, మహారాష్ట్రమున ప్రజ్వరిల్లు యుద్ధానలమును చల్లార్చుటకు సముద్రోదకము నయితము చాలదు. ఢిల్లీసామ్రాజ్య మీ మహావహ్నియందు దగ్ధమైపోవును. పాపమునకుఁ బ్రతిఫలము తప్పదు.”

శివాజీ ప్రయాణము చేయ నిశ్చయించెనని తెలిసికొని యింకెవ్వరును మాఱు మాటాడలేదు. పిమ్మట మహారాష్ట్రాధిపుఁడిట్లనెను: పీష్వాజీ మోరేశ్వర్, అబాజీ సోనదేవ్, అన్నజీ దత్తో, మీవంటి కార్యదక్షులు, రాజభక్తులు మహారాష్ట్రము వీరభూమి. మ్లేచ్ఛుఁడు తప్పుపని చేసినపక్షమున మహారాష్ట్రమున దుర్లభులు. నేను లేనప్పుడు మీరు మువ్వురును దేశమును శాసింపవలయును. నాయాజ్ఞలనుంబోలె మీయాదేశములను ప్రజలు శిరసావహింతురు. ఇవ్విధమున జనులకుఁ దెలిపి చనువాఁడను.”

అప్పుడు మాలసూరే ముందఱకు వచ్చి “మహాప్రభూ విన్నప మున్నది. చిన్నతనమునుండియు కష్టకాలమున మిమ్ము నే విడిచి యుండలేదు. అనుజ్ఞనొసఁగుఁడు. తమతో ఢిల్లీనగరమునకు వచ్చెదను” అని శివాజీని ప్రార్థించెను.

శివాజీ నజలనయనుఁడై “మాలసూరే, నీకు నే నీయరాని దేమున్నది? నీకోరికప్రకారము చేయుము” అని పలికెను.

“రాజన్, నాకింక ననుజ్ఞ నొసఁగ వలయును. తీర్థయాత్ర చేయవలసి యున్నది. భగవంతుఁడు మీకు జయము

నమస్కారమ్ప్రభూ ! శివాజీ మరల నిశ్చయముగ విచారమ్మునను చేయును," అని గోసాయీగా పలికెను.

"సీతాజకి గోసాయీజీ, కుశలముగా తీర్థయాత్ర చేయుడు. యుద్ధసమయమున నిమ్ము స్మరించెదను. మీవంటి నిట్టి యల్పవయస్సున నే నిట్టి తేజస్సు, సాహసమునుగలవానిని జూచియుండలేదు.

—౨—

౧౬౬౬ వసంతకాలమందు ఐదువేల గుఱ్ఱపుదళములు, వేయి పదాతికసైన్యమును మాత్రము వెంటబెట్టుకొని శివాజీ ఢిల్లీ నగరమునకు ఆఱు కోసుల దూరమున విడిసెను. సైనికులు విశ్రాంతి దీసికొనుచుండిరి. చింతామగ్నుఁడై శివాజీ యిటు నటుఁ దిరుగుచుండెను. ఢిల్లీకి వచ్చుట యే మంత మంచిపని? మొగల్మానులయాధిక్యము నంగీకరించుట వీరోచిత కార్యమా? ఇప్పటి కయిన మరలిపోవుటకు వీలు లేదా?" అను నాలోచన లతని విశాలహృదయమును చీకాకుపఱుచు చుండెను. ఎంతటి కష్టకాలమునం దయినను అతనిముఖము ఇంతగా చింతారేఖాంకితమై యుండలేదు.

ఉగ్రస్వభావుఁడు, తేజస్వి, తొమ్మిది యేండ్ల కుమారుఁడు, శంభుజీ శివాజీతో పచారుచేయుచు మాటిమాటికి జనకునివదనముజూచుచుండెను. తండ్రి యభిప్రాయములువానికిఁ

గొంచెము దెలియుచుండెను. రఘునాథపంత్ న్యాయశాస్త్రి కొంత వెనుకగా ప్రచారము చేయుచుండెను.

కొంతసేపటికి శివాజీ మంత్రిని జూచి "న్యాయశాస్త్రీ, తమ రెప్పుడయిన ఢిల్లీనగరిం జూచితిరా"? అని ప్రశ్నించెను.

"చిన్నతనములో జూచియుంటిని."

"పెద్దగోడవలె దూరమునం గానంబడుచున్న య దేమో చెప్పఁగలరా? తదేకధ్యానముతో దానివంకఁ జూచుచున్నారు!"

"మహారాజా, ఆ కనంబడునది చివరిహిందూసార్వభౌముండగు పృథురాయుని దుర్గప్రాకారము"

"ఇదియేనా అప్పృథురాయుని దుర్గము! ఇదియేనా ఆతని రాజధాని? ఇక్కడనేనా కడపటి హిందూ సార్వభౌముఁడు రాజ్యము చేసెను? న్యాయశాస్త్రీ, ఆదినములు స్వప్నము వలెఁ గడచిపోయినవి కదా! సూర్యుఁ డస్తమించి, మరల నుదయించును; శీతకాలమున వృక్షములు పర్ణములును రాలిపోయి వసంతమునఁ గ్రమ్మఱఁ గాన్పించును. మనగౌరవ దినము తిరుగ వచ్చునా?"

"భగవానుని యనుగ్రహమున నది సంభవింప వచ్చును. మీబాహుబలమున హిందూజాతి యున్నతికి రాఁగలదు."

"అమాత్యపుంగవా, బాల్యకాలమున మనము కొంకణ దేశమున విన్న కథకులపాటలు, చాంద్‌కినివృత్తములు తమకు జ్ఞప్తియందున్నవా ? ఈజీర్ణదుర్గము ప్రాసాదములతో నిండి యున్నది. పతాకా తోరణాదులచే నలంకృతం బయినసగర మునందు సభాభవనమున సార్వభౌముఁడు కొలువు దీర్చి యున్నాఁడు. నాగరకులు సంతోషముతో నగరవీధులందు సంచరించుచున్నారు. విశాల పణ్యవీథికలందు క్రయవిక్రయ ములు జరుగుచున్నవి. లలనలు కలశములతో జలమును దెచ్చు చున్నారు. ప్రాసాదము నెదుట సైన్యము సజ్జీకృతమై యున్నది. ఏనుఁగులు, గుఱ్ఱములు, రథములును, బారులు తీర్చి యున్నవి. వాద్యకారులు సానందముగా వాద్యములు వాయించుచున్నారు. గీతసౌరభము మనోహరముగా భువన మున్పైఁ బ్రసరించుచున్నది. ఈసమయమున మొహమ్మద్ గోరీ దూత రాజసభలోఁ బ్రవేశించినాఁడు. అవృత్తాంతము జ్ఞప్తియందున్నదా ?

"దేవా, చాంద్‌కిని కథ మనసులో వర్తించుచున్నది. కాని దేవరవారినోట నాకథ మిగుల మనోహరముగా నుండును.

"ముసల్మాన్ దూత పృథురాయనితో నిట్లనెను : దేవా, మాప్రభుసింహుఁ డిప్పుడు భవద్దేశంబునం దర్థమున్ దావాంఛించుచునున్నవాఁడు తమరద్దానిం బ్రమోదంబుతో శ్రీవారిం బిలిపించి యిచ్చినయెడన్ నేమం బగు స్నేహ కేఁకన్. నావాక్యంబులు సావధానముగ విన్నారా నృపాలాగ్రణీ !

పృథురాజు :

ఎప్పుడు వేఱొకభాషన
కుప్పరమునఁ బా పోసంగు నో భాస్వంతుం
డెప్పుడె చోటింకొకనికిఁ
దప్పక పృథురా జొసంగుఁ దనరాజ్యమునన్.

దూత :

మాయధీశునితోడ మీమామగారు
చేసికొన్నారు సంధి సన్నాహముగను,
కాన అఫ్గానుసైన్యమే కాక యునిని
జూడఁగల్గుదు రావు రాఠోడుబలము.

పృథురాజు :

మంచి! దిట్లని చెప్పుఁడు మామగారి
కల్లుఁ డొనరించె వందన మంచు; మఱియు
సంగరక్షేత్రమందు దర్శనము చేసి
పెల్లుగా వారి సంతోష పెట్టు ననియు.

అటుతర్వాత చవాన్ బలంబు వెడలెన్ హర్షంబుతో విద్విష
ద్భటసంఘంబులు దాని దాఁకి, యతిబీభత్సంబుగాఁ బాఱెను
త్కటవాతాహతిపాంసుపుంజమువలెన్. గోరీ యుడాయించె
నెచ్చటికో ప్రాణముతో "త్రిరోరి" కదంతొమ్మనుండి యూరోజి
నన్ !

“అమాత్యపుంగవా, ఆ వాసరము దాఁటిపోయినది. ఇప్పుడు చాంద్ కవిగీతములను పాడువా రెవ్వరు ? వినువా రెవ్వరు ? అయినను, పూర్వులశౌర్యోతకీర్తిని స్మరించినప్పుడు స్వప్నము నందుఁబోలె క్రొత్తక్రొత్త యాశలు జనించును. ఈ విశాలకీర్తిక్షేత్రము విశేషకాలము తిమిరాచ్ఛాదితమై యుండఁబోదు. భగవానుఁడు రోగిని మరల నారోగ్యవంతుని జేయును; దుర్బలుని బలవంతుని జేయును. దుర్దశలో నున్న హిందువులు ఇఁకముందయినను వృద్ధిలోనికి రావచ్చును”

## ౨౩

శివాజీ శంభుజీలు శిబిరమునఁ గూరుచుండి యుండఁగా రక్షక భటుఁడు చనుదెంచి “మహారాజా, జయసింగుగారి పుత్త్రుఁడు రామసింగుగారు సైనికుని వెంటఁ బెట్టుకొని, చక్రవర్తి యాజ్ఞా ప్రకారము దేవరవారి నాహ్వానించుటకు వచ్చినారు” అని పలికెను.

“ఆయనను సగౌరవముగాఁ దీసికొని రమ్ము”

“బాబా, ఆహ్వానము చేయుటకు ఔరంగజేబు ఇర్వోరసు మాత్రము పంపినాఁడా ?” అని యుగ్రస్వభావుఁ డగు శంభుజీ తండ్రి నడిగెను.

చక్రవర్తి చేసిన యవమానమునకు లోలోపలఁ గోపము నొందియు, శివాజీ క్రోధమును బైటికి రానీయ లేదు. ఇంతలో

రామసింగు గుడారములోఁ బ్రవేశించెను. రాజపుత్త్రుఁడు తండ్రి వలెనే తేజస్వి, సత్యప్రియుఁడు. తీక్ష్ణబుద్ధి యగు శివాజీ యతని ముఖము చూచినతోడనే యతఁడు నిష్కపటహృదయుఁ డని గ్రహించెను. అయినను, ఔరంగజేబు ఏ మయిన దుస్తంత్రము పన్నెనో, లేదో, ఢిల్లీనగరమునఁ బ్రవేశించినచో నేవిధ మయిన యాపద కలుగునో, కలుగదో యనియు సంభాషణలో రామసింగునుండి గ్రహింపవలయు నని శివాజీ భావించెను. రామసింగు జనకునివలన శివాజీమహత్త్వమును విని యుండెను; ఇప్పుడు విస్మయముతో మహారాష్ట్రవీరుని వీక్షించెను. శివాజీ రామసింగును గవుగిలించుకొని పీఠముపైఁ గూర్చుండఁబెట్టెను.

ఉపవేసించిన పిమ్మట రామసింగి ట్లనెను: "దేవరవారి నిదివఱ కెన్నఁడును సందర్శించి యుండలేదు, కాని నాయన గారి నోట తమయాపదవృత్తాంతమును విని యున్నాను. మిముబోఁటిస్వదేశప్రియుని ధర్మపరుని, మహావీరుని దర్శించుటచే నేఁడు కన్నులకఱవు దీఱినది."

"నాకును పరమసౌభాగ్యము! మీజనకునివంటి న్యాయవిచక్షణులు, సత్యప్రియులు, వీరపురుషులు రాజస్థానమునందును దుర్లభులు ఢిల్లీకి వచ్చుటచే నట్టివారితనూజునిఁ జూచుట సంభవించినది!"

"మహారాజా, తమరు ఢిల్లీనగరికి దయచేయు చున్నారని వినియే చక్రవర్తి నన్ను తమసన్నిధికిఁ బంపినాఁడు. ఎప్పుడీ నగరములోఁ బ్రవేశింపఁ గోరుచున్నారు?"

"ప్రవేశసంబంధమున మీయుపదేశ మేమి?"

"ఇప్పుడే ప్రవేశించుట మంచి దని నాయభిప్రాయము. ఆలస్య మగునెడల వేఁడిగాడ్పులు వీచును. గ్రీష్మము దుస్సహ మగును."

"సరే! ఇప్పుడు మీరు ఢిల్లీలో నివసించుచున్నారు; కావున నచ్చటివృత్తాంతము మీకుఁ దెలిసియుండును. నేను నగరముఁ బ్రవేశించుట యుచితమో, కాదో మీరు చెప్పఁ గలరు."

నిష్కపటహృదయుఁ డగురామసింగు శివాజీయభిప్రాయము గ్రహించి, దరహాసముతో "మహారాజా, క్షమింపుఁడు, మీయభిప్రాయమును ముందుగాఁ దెలిసికొనవైతిని. నేను, మీస్థితియం దయినపక్షమున నెల్లకాలము పర్వతము లందు నివసించువాఁడను, నాఖడ్గమునే నమ్మి యుండువాఁడను కత్తివలె నక్కఱకు వచ్చుచుట్టములు లేరు. అయిన, ఈసందర్భమున నేను కేవల మజ్ఞుఁడను. నాయనగారు తమతో ఢిల్లీకి పోవలసిన దని చెప్పినప్పుడు తమరు వచ్చుటయే మేలు. వారి యాలోచన యెన్నఁటికిని వ్యర్థము కానేరదు" అని పలికెను.

"ఔను, మీతండ్రిగారు నన్నిచ్చటికిఁ బంపినారు. వారు నాకు చేసినవాగ్దానము తమకు విదిత మనియే తలఁచుచున్నాను."

“అవగతమే. ఢిల్లీకి వచ్చినందున కేవలము సహాయము రాదు ఆవిషయమై నాడు మీరు వాగ్దానము చేయుటయే కాక నాకును ఆజ్ఞ యిచ్చినారు.”

“అందు మీయభిప్రాయ మేమి?”

“తండ్రియానతి తప్పక యాచరణీయము. రాజపుత్రు లాడినమాట తప్పరు. తమరు సురక్షితముగా స్వరాజ్యమునకు దిరిగిపోవచ్చును ఆవిషయమై యీదాసుఁడు సాధ్యమగు నంతవఱకు సాయము చేయును.”

శివాజీహృదయము శాంతి నొందెను. అనుమానము విడిచి చిఱునగవుతో నతఁడు, “మంచిది! మీయాలోచన చొప్పున వర్తించెద; ఇప్పుడే బయలుదేఱుదము” అని పలికెను తరువాత కొలఁదిసేపటికి వారిద్దరు ఢిల్లీనగరాభిముఖులై చనిరి.

మార్గము వెనుకటి ముసల్మాన్ప్రభువుల జీర్ణమందిరము లతో నిండి యుండెను. ప్రథమమున వారు ఢిల్లీ జయించి, పృథురాయనిదుర్గముకడఁ దమరాజధానిని నిర్మించుకొనిరి. కావున మొదటిబాదుషాల మసీదులు, ప్రాసాదములు, సమాధిమందిరములును భగ్నావశిష్టములై యుండెను. జగద్విఖ్యాత మగుకుతుబ్ మినార్ అక్కడిదే. కాలక్రమమున నూతన ప్రభువులు క్రొత్తక్రొత్తమందిరములను ఉత్తరమున నిర్మింపఁ దొడఁగిరి. క్రమముగా నగరము ఉత్తరదిక్కునకు వ్యాపించెను. పోవంబోవ కొన్నిమసీదులు, మినార్లు, స్తంభములు, సమా

ధులు జీర్ణములై కంటఁబడుచుండెను. రామసింగు శివాజీకి ఆయాస్థానముల వృత్తాంతము దెలుపుచుండెను. ఇరువురు ఒకరి స్వభావము నొకరు గ్రహించుచుండిరి. ఢిల్లీలో నేదేని విపత్తు సంభవించినయెడల మిత్త్రుఁడున్నాఁడని శివాజీ యూఱటఁ జెందెను.

మార్గమధ్యమున లోడీవంశచక్రవర్తులగోరీలు కాన్పించెను. ఒక్కొకబాదుషాగోరీపై నొకగుంబుజ్, మేడయును నిర్మితములు. అఫ్గానులయధికార మంతరించినప్పుడు ఢిల్లీ యీప్రదేశమున నుండెను; పిమ్మట నుత్తరమునకు వ్యాపించెను

అటుతరువాత హుమయూన్‌గోరీ, దానికిఁ బిమ్మట "చౌసట్‌ఖంబా" అనఁగా, తెల్లరాతితోఁ జేసిన యఱువదినాల్గుకంబములమీఁద నిలిచియున్న గొప్పమందిరము కనఁబడెను. దానివెనుక లెక్కలేనిగోరీ లుండెను. పృథుసార్వభౌముని దుర్గమునుండి యిప్పటిఢిల్లీవరకును రాను రా నామార్గము భారతఖండపూర్వచరిత్రను దెల్పుచుండెను ఒక్కొకప్రాసాదము చరిత్రలోని యొక్కొకపత్త్రము, గోరీ అక్షరము. కరాళ మగు కాలము ఆచరిత్రనురచించినకవి.

వారు ముందునకు పోఁజొచ్చిరి. ఢిల్లీప్రాకారమును సమీపించినతోడనే రామసింగు సగర్వముగా పెద్దమందిరమును శివాజీకిఁ జూపి, యిట్లనెను: "మహారాజా, ఈ కాన్పించు మందిరము నాయనగారు సిద్ధాంతులకొఱకు నిర్మించినారు.

నానాదేశవిద్వాంసులు మామందిరమునకు వచ్చి, ఖగోళము లను బరీక్షింతురు."

"మీతండ్రిగారు వీరులగుటయే కాక విజ్ఞులుకూడ నగు దురు. వారివంటి సర్వగుణసంపన్నులు లోకములో నరుదు. పవిత్రక్షేత్ర మగు వారాణసీనగరమున నిట్టి నక్షత్రశోధనశాల వారు నిర్మించినా రని విన్నాఁడను."

ఢిల్లీప్రాకారమునఁ బ్రవేశించునప్పుడు గుండెలు తటతట గొట్టుకొనఁగా, శివాజీ తనయశ్వము నాఁపి, వెనుకకుఁ దిరిగి చూచెను. ఇప్పటికిని స్వాతంత్ర్యము కలదు, కాని పరక్షణ మున తాను ఖైదీ కావచ్చు నని తోఁచెను. తత్క్షణమే ధర్మాత్ముఁ డగు జయసింగు సన్నిధియందు జేసిన వాగ్దానము జ్ఞప్తికి వచ్చెను. అంత నతఁడు జయసింగు పుత్త్రుని యుదార ముఖమండలము నవలోకించి, ఒఱలోని "భవానీ" ఖడ్గము దెస దృష్టి నిల్పి, ఢిల్లీద్వారముఁ బ్రవేశించెను.

పరమస్వతంత్రుఁ డగు మహారాష్ట్రవీరుఁ డానిముసము ననే బంది యయ్యెను!

౨౪

ఢిల్లీనగరము మనోహరముగా నలంకరించి యున్నది. ఔరంగ్ జేబు విలాసప్రియుఁడు కాఁడు; కాని పని వచ్చినప్పుడు కావలసినంత యాడంబరము కనఁబఱుచు చుండును. దర్బిద

మహారాష్ట్రమునుండి విపులసంపన్న మగు మొగల్ రాజధానికి శివాజీ వచ్చినాఁడు. కావున మొగలుల యైశ్వర్యమును జూచి తన హీనస్థితిని గుర్తెఱిఁగి, ఇఁకను యుద్ధము చేయుట మాను నని చక్రవర్తి తననగరమును కన్నులకు మిఱుమిట్లు గొల్పునట్లు అలంకరింపవలసిన దని భృత్యుల కాన తిచ్చెను. చక్రవర్తి యాజ్ఞానుసారముగా రాజధాని యుత్సవదినమున లలనవోలె నపూర్వవేషముఁ దాల్చి యుండెను.

శివాజీ రామసింగులు రాజమార్గమునఁ జను చుండిరి. త్రోవవెంట గుఱ్ఱపురౌతులు, ప్రభాతులు రాకపోకలు సేయు చుండిరి. నగరము జనాకీర్ణ మగు నరణ్యమువలె నుండెను. అంగళ్లలో వణిజులు వెలపోవువస్తువులను రాసులుగా సమర్చి యుంచిరి. విలువ గల వస్త్రములను, వెండిబంగారు నగలను, విచిత్ర గృహోపకరణములను, తినుబండములను జూచుచు వారు ఘంటాపథమునఁ బోవుచుండిరి కొన్నిచోట్ల గృహముల మీఁద పతాక లెగురుచుండెను; కొన్నిప్రదేశములందు మంచి వేషములు ధరించి గృహస్థులు వసారాలలో నిలిచియుండిరి; కొన్నియెడల కులకామినులు గవాక్షములనుండి సుప్రసిద్ధ మహారాష్ట్రవీరుని విలోకించు చుండిరి. పథమున శకటముల యందు, మేనాలలో, గుఱ్ఱములపై, ఏనుఁగులమీఁద రాజులు, మన్సబ్‌దారులు, షేఖులు, ఉమ్రాహులు వచ్చుచుఁ బోవు చుండిరి. అశ్వికులవేగముచేత నగరము క్రక్కదలు

చుండెను. సుందరాలంకారములతోను, శోణాంబరములతోను అలంకరించిన గజేంద్రములు తుండముల నాడించుచు మంద గమనముతోఁ జనుచుండెను. ఓంకారనాదములతో మేనాలు మోయుచు బోయీలు నడచుచుండిరి. శివాజీ యిట్టినగర మెన్నఁడు చూడ లేదు. రాజ్‌గఢ్ పూనా లెక్కడ ? ఢిల్లీనగరి యెక్కడ ?

రామసింగు మూఁడుగంబుజాలను జూపి "విలోకింపుఁడు, అది జుమ్మామసీదు షాహజహాన్ చక్రవర్తి "మందిరము గట్టించెను. అట్టిమసీదు ప్రపంచములో నింకొకటి లేదని వాడుక" అని పలికెను.

ఆశ్చర్యముచే నేత్రములు వికసింప శివాజీ దాని నవలోకించెను. ఎఱ్ఱఱాతితోఁ గట్టిన చుట్టుగోడ బహుదూరము వ్యాపించి, శోభావంతమై యుండెను. దానిపై తెల్లఱాతితో నిర్మించిన మూఁడుగంబుజాలు, రెండుప్రక్కల రెండు మినార్లును గగనమును భేదించుకొని పోవుచ ట్లుండెను.

దానియెదుట శోణశిలానిర్మిత మగు దుర్గప్రాకారము కన్పట్టెను. దుర్గము వెనుక యమునానది కలదు; ముందఱ రాజమార్గ మున్నది. ప్రాకారముపై వందలకొలఁది పతాకలు వాయుపథమునఁ గదలుచు, మొగల్ చక్రవర్తి వైభవమును వెల్లడి చేయుచుండెను దుర్గద్వారముప్రక్క మన్సబ్‌దారు శిబిర ముండెను. అతఁడు ద్వారరక్షకుఁడు. సింహద్వారము

నెదుట సైనికులు బారులు దీరి, నిలిచి యుండిరి. బందూకుల సన్నీలు సూర్యరశ్మితో తళతళ లాడుచుండెను; వానికి గట్టిన పట్టుజెండాలు గాలితాకున చలించుచుండెను. రాజమార్గము ప్రక్క నానావిధవస్తువులు విక్రయించుచుండిరి. దుర్గప్రాకారము మొదలు మస్జిద్ గోడవరకును ఘంటాపథము జనసంకులమై యుండెను. అశ్వారోహులును, గజారోహులును, శిబికారోహులును నగు ప్రధానరాజపురుషులు కొందఱు సపరివారముగా దుర్గము లోనికి బోవుచుండ, మఱికొందఱు వెలుపలికి వచ్చుచుండిరి. వారల వేషభూషలు కన్నులు మిఱుమిట్లు గొల్పుచుండెను. కోలాహలముతో చెవులు పగిలిపోవుచుండెను. అన్నిసందడుల నణగం ద్రొక్కి, నడుమనడుమ దుర్గమధ్యమునుండి ఫిరంగుల ధ్వని నగరమును కలంచివేయుచుండెను; రాజాధిరాజ యగు ఆలంగిర్ బాదుషా అనగా జగత్సార్వభౌముని యైశ్వర్యమును భువనమునకు ఘోషించుచుండెను.

శివాజీ రామసింగుతో దుర్గములోం వచ్చెను; ప్రవేశించి యచ్చటం గాంచినదానిచే నింకను విస్మయము నొందెను. పెద్ద కార్ఖానాలో చాలమంది శిల్పులు నానావిధవస్తువులను జేయుచుండిరి. విచిత్రమైన బంగరు, వెండిసరిగలతోం గూర్చిన వస్త్రములు, మఖమల్, మజ్లిక్, ఛిట్, గాలిచాలు, చాందినీలు, గుడారములుం పరదాలు, పాగాలు, సాలువులు, అంగీలు, బేగములకొఱకు సువర్ణ, రత్నాదిభూషణములు, వివిధవర్ణముల

చిత్రవస్తువులు, నిర్మించుచుండిరి. భరతఖండమునందలి మంచి పనివాండ్రు నెలజీతములు పుచ్చుకొనుచు, చక్రవర్తి యాదేశానుసారముగా ననుదినము దుర్గములో పని చేయుచుండిరి. ఔరంగజేబుకొఱకు, విలాసప్రియ లగు బేగముల కొఱకు, మిగిలిన యంతఃపురజనముకొఱకు నావశ్యకము లగువివిధ వస్తువు లిచ్చటఁ జేయుచుండిరి.

ఇంతలో శివాజీ "దివాన్ ఆమ్" అను శోణాశ్మవినిర్మిత ప్రాసాదమును సమీపించెను. సాధారణముగా చక్రవర్తి యీమందిరముననే కొలు వుండును; కాని శివాజీకి తనయైశ్వర్యమును జూప నెంచి, స్వచ్ఛశిలానిర్మితము, నానావిధ చిత్రపదార్థమండితము, అద్వితీయము నగు "దివాన్ ఖాన్" ప్రాసాదమున నిండుకొలు వుండెను. అనేకమణులు దాపినదియు, సూర్యకాంతిప్రతిస్పర్ధియు నగుమయూరసింహాసనముపై అలంగీర్ బాదుషా యుపవేశించి యుండెను. వానికి నలిర్కుల వెండికమ్ము లుండెను. కమ్ములవెలుపల హిందూదేశములోని గొప్పగొప్ప ప్రభువులు, మన్సబ్దార్లు, ఉమ్రావులు, సేనాపతులును నిశ్శబ్దముగా నిలిచి యుండిరి. రామసింగు శివాజీని రక్షకభటుల కెటింగించి, సభాభవనమునఁ బ్రవేశ పెట్టెను.

ఢిల్లీనగరిశోభ గాంచి శివాజీ యనుమానపడఁ జొచ్చెను; రాజసభకుఁ బోయినపిమ్మట చక్రవర్తియుద్దేశ

మాతనికి స్పష్టముగాఁ దెలిసెను. ఇరువదిసంవత్సరములకాల మెవ్వఁడు స్వాతంత్ర్యము నిలుపుకొనుటకు తనతో యుద్ధము చేసి తుదకు లోఁబడి మిగుల సాయము చేసెనో, మహారాష్ట్రమునుండి ఢిల్లీనగరమునకు తన్నుఁ జూచుట కెవ్వఁడు వచ్చియుండెనో, అట్టివానిని చక్రవర్తి యేవిధముగా నాహ్వానించెను ? శివాజీ సామాన్యుఁడువోలె సభాభవనమున నమ్రుఁడై నిలువఁబడి యున్నవాఁడు ! అతనిముఖనాడులలో వేఁడినెత్తురు ప్రవహింపఁ దొడఁగెను. కాని యుపాయము లేదు. సాధారణ సేవకులవలె సమ్రాట్టునకు తస్లీమ్ చేసి, శివాజీ మామూలు నజరు నొసంగెను. ఔరంగజేబు దూరోద్దేశము సఫల మయ్యెను. లోక మెఱింగెను, శివాజీ తెలిసికొనెను, శివాజీ, ఔరంగజేబు ప్రతిస్పర్ధులు కారు: దాసుఁడు ప్రభునితో, దుర్బలుఁడు బలవంతునితో యుద్ధము చేయుట వెఱ్ఱి తనము !

ఈయుద్దేశము లోకమునకు వెల్లడి చేయుటకయి చక్రవర్తి నజరు గ్రహించి, విశేషాదరము చూపక, శివాజీకి "పాంచ్ హాజార్" అనఁగా పంచసహస్రసేనాపతుల నడుమఁ జోటిచ్చెను. అప్పుడు నేత్రములు నిప్పులు గురియ శరీరము క్రోధముచే వణఁకుచుండ, పండ్లు బిగఁబట్టి శివాజీ యస్ఫుట స్వరముతో, "ఏమి ! పాంచ్ హాజారీ ! చక్రవర్తి మహారాష్ట్రమునకు వచ్చునపుడు శివాజీకొలువులో నెందఱు పాంచ్ హాజారీ

లున్నారో చూడనవ్వును. వారు నుచ్ఛులులు కారని కూడ బోధపడును" అని పలికెను.

అవసరము లగుకార్యములు జరిగినతరువాత కొలువు ముగిసెను. చక్రవర్తి లేచి, ప్రక్క నున్న బేగమ్‌మహాల్ లోనికిఁ బోయెను అంతట నదీప్రవాహమువలె దుర్గమునుండి జనప్రవాహము వెలుపలికి పాఱఁజొచ్చెను. ఎవరి నివాసము లకు వారు చనిరి. సముద్రమువంటి ఢిల్లీనగరియందు జనప్రవాహము త్వరితముగా లీనమైపోయెను.

శివాజీవాసార్థ మొకగృహము నిర్దిష్ట మాయెను. మహారోషముతో నతఁడు సాయంకాల మానద్మమును జేసి, యొంటిగాఁ గూరుచుండి, యేమో చింతింపఁ జొచ్చెను.

కొంచెమునేపటికి చక్రవర్తియానతి యీవిధముగా వచ్చెను: "నేఁడు సార్వభౌమునిసమ్ముఖమున కుపితుఁడై శివాజీ యుచ్చరించినవాక్కులు బాదుషాకు వినఁబడినవి; కాని సమ్రాట్టు శివాజీని శిక్షింప నెంచ లేదు. ఇఁకముందు మహారాష్ట్రునకు రాజదర్శనము లభింపదు"

భవిష్యత్తు విపత్పూర్ణ మగు నని శివాజీ తలంచెను. బోయవాఁడు సింహమును బట్టుకొనుటకు వల పన్నునట్లు, క్రూరుఁడును, దుర్బుద్ధియు నగుచక్రవర్తి శివాజీని బంధించుటకు దుస్తంత్రవాగురను ప్రసారించు చుండెను. శివాజీ ఇట్లు తల పోయఁ జొచ్చెను: "ఈవలను చించి, మరల స్వతంత్రుఁడ

నగుదునా? సీతావతీ! నీయుపదేశ మెంతమంచిది! నీయుత్కృష్ట వాక్కు నాచెవిలో నిప్పటికిని మ్రోఁగు చున్నది. ఔరంగ్ జేబ్, జాగ్రత్త! ఇంతపర్యంతము శివాజీ నీకడ సరిగాఁ బ్రవర్తించినాఁడు. వానితో మోసము గట్టిపెట్టు శివాజీయును అవిద్యలో నీకంటె రెండాకు లెక్కువ చదివినవాఁడు. నీవు తిన్నఁగా మెలఁగవేని భవానీదేవితోడు! మహారాష్ట్రమున బ్రజ్వరిల్లు యుద్ధాగ్నిలో నీఢిల్లీనగరము, విస్తీర్ణసామ్రాజ్యము ఒక్కపెట్టున దగ్ధమై పోవును!

-౨౩-

శివాజీ యింక మహారాష్ట్రమునకుఁ బోఁగూడ దని చక్రవర్తి యభిప్రాయము. వానకపటవర్తనమును గ్రహించి శివాజీ మిక్కిలి క్రుద్ధుఁ డయ్యెను. కాని రోషము నణఁచుకొని, ఢిల్లీ నుండి వెడలిపోవు నుపాయము నాలోచింపఁ జొచ్చెను.

రఘునాథపంతు న్యాయశాస్త్రి బహువిధముల యోజించి, చక్రవర్తియంగీకారమును పడయుట మే లనియు, అతఁడనుమతి నొసంగనిపక్షమున మఱియొకమార్గము నవలంబింప వలసియుండు ననియు పలికెను.

న్యాయశాస్త్రి విద్వాంసుఁడు, వాక్పాటవము కల వాఁడు; అతఁడు రాజసభకు విజ్ఞాపనాపత్త్రికను గొనిపోయెను. శివాజీ చక్రవర్తికిఁ జేసినయుపకారము, అతఁడు ఢిల్లీనగరము

నకు వచ్చినకారణము, బాదుషా చేసినవాగ్దానము మొదలగు సంగతులు దానియందు వివరించినాఁడు. అందు శివాజీ యీవిధముగా ఔరంగజేబుకు విన్నవించెను: "నే నే కార్యములను సాధించెద నని యంగీకరించితినో వానిని నిర్వహించుట కిప్పటికిని సంసిద్ధుఁడనై యున్నాను; బీజపూర్, గోల్కొండ రాజ్యములను దేవరవారికి స్వాధీనము లగునట్లు యత్నించెదను. ప్రభువువారికి నాతోడ్పాటుతోఁ బనిలేనిపక్షమున, ఆజ్ఞ యయ్యేనేని నాజాగీరునకు వెడలిపోవువాఁడను. హిందూస్థానపుజలము, వాయువు, నాకును నాసేనకును ఎంతమాత్రము సరిపడలేదు; కావున నే నిచ్చట నుండుట మంచిది కాదు."

చక్రవర్తి శివాజీకి ప్రత్యుత్తర మంపెను; కాని దానియందువివిధ విషయము లున్నను,మహారాష్ట్రవీరుఁడున్న దేశమునకుఁ బోవుటం గూర్చిన మాటయే లేదు. కాని యుద్దేశము స్పష్టమయ్యెను. అప్పటినుండియు శివాజీ పాఱిపోవుటకు యత్నింపఁ దొడఁగెను.

ఒకనాఁటి సాయంకాలమున శివాజీ చింతామగ్నుఁడై గవాక్షముప్రక్క గూరుచుండి యుండెను. సూర్యుఁ డస్తమించెను. రాజమార్గమున జనప్రవాహ మవిరతముగాఁ బ్రవహించుచుండెను. హిందువులు, మొగలులు, ఆఫ్గానులు, తార్తారులు, తురుష్కులు, పారసీకులు, అరబ్బులు, కాఫ్రీలు,

సిద్దీలు మొదలగు వివిధజాతులవారు నడచుచుండిరి. రాజులు, ఉమ్మరావులు, సేనాపతులు, మన్సబ్‌దార్లు, వర్తకులు, యాత్రికులు, సైనికులు లోనుగాఁ గలవారు చనుచుండిరి.

క్రమక్రమముగా జనప్రవాహము సన్నగిల్లఁ జొచ్చెను. అంగడివారలు తమతమ దుకాణములను మూయసాగిరి. నగరమందలి కలకలము క్రమముగా తగ్గిపోయెను. గృహములనుండి దీపకళికలు కనఁబడుచుండెను. ఆకసమున నక్షత్రములు మినుకు మినుకు మనుచుండెను. యమునానది శాంతముగాఁ బ్రవహించుచుండెను.

ఇంతలో జుమ్మామస్జిద్ నుండి నమాజుధ్వని వినఁబడెను. ఆ మస్జిద్ శిఖరములు నీలాంబరపటంబున నస్పష్టముగా గాన్పించుచుండెను. దానిచుట్టుగోడ పర్వతశ్రేణివలె నస్ఫుటముగాఁ గానఁబడుచుండెను. తక్కిన నగర మంతయు చీఁకటిగా నుండెను.

ఇంకను ప్రొద్దుపోవుచుండెను. శివాజీ చింతాతంతువు ఛిన్నము కాలేదు. వెనుకటివృత్తాంతము లాతని మానసచక్షువునకు గోచరించుచుండెను. బాల్యస్నేహితులు, ఆశలు, ప్రయత్నములు. జనకుఁడు, దాదాజీ, బాల్యమున వీరవృత్తాంతములం జెప్పి, యౌవనమున సాహసము కలిగించి విపత్సమయములం దూఱడించి, యుద్ధకాలముల నుత్సాహము కలిగించిన జననియు నాతని జ్ఞప్తికి వచ్చెను. అనంతరము యౌవనోద్యమ

ములు, దుర్గవిజయములు, దేశవిజయములు, ఆపదలపై నాప
దలు, యుద్ధములు, దోర్దండప్రతాపము స్మృతికి వచ్చెను.
కడచిన యిరువదిసంవత్సరములలో అపూర్వవిజయములతోనో,
సాహసకార్యములతోనో భీకరయుద్ధములతోనో అంకితమై
యుండని సంవత్సరము లేకుండెను.

"ముసల్మాన్ సామ్రాజ్య మంతరించునా? హిందూ
సార్వభౌముని మస్తకముపై మరల రాజఛత్రము వ్రేలాడునా?"
అని శివాజీ తలపోయుచుండఁగా ఘంటాధ్వని చెవిఁ జొచ్చెను.
ఆనినాదము దుర్గమునందలి "నగార్‌ఖానా" నుండి బయలు
దేఱి, వాయుపథమున వ్యాపించి, నగరము నిశ్శబ్దముగా నుం
డుటచే బహుదూరము వినఁబడెను. చప్పుడు అణగకపూర్వము
కిటికీతలుపు దటాలునఁ దెఱచి మనుష్యాకృతి గృహములోఁ
బ్రవేశించెను.

శివాజీ కృపాణమును పగముదూసి, పరికించి చూచెను
ఆగంతుకుఁడు ఏమియు లెక్కసేయక మోమునుండి నిశాశిర
మును దుడుచుకొనెను.

ఆ వచ్చినవానితలపై జడలును, శరీర మంతటను భస్మ
మునుండెను. వానిహస్తమున నెట్టియాయుధము లేదు.

చీఁకటింటిలోఁ గూడ శివాజీపై దృష్టి నిలిపి యాపురు
షుఁడు "మహారాజుగారికి జయ మగుగాక!" అని పలికెను.
అంధకారమున శివాజీ వానిని గుర్తింప లేకపోయినను, కంఠస్వ

రమును బట్టి గనుగొనెను. లోకములో నక్కఱకు వచ్చు మిత్రులు చాల నరుదు. విపత్సమయములం దట్టి చెలికాఁడు లభించునేని హృదయము తాండవ మాడును. శివాజీ సీతాపతికి నమస్కరించి, అతనిని కౌఁగిలించుకొని దీపము వెలిఁగించి, తనప్రక్కఁ గూరుచుండఁ బెట్టుకొని యిట్లనెను: "మిత్ర రత్నమా, రాజగఢ్ సమాచారములేమి? మీ రెప్పు డచ్చటి నుండి వచ్చితిరి? ఏమి పనిమీఁద నింత దూరము విచ్చేసితిరి? అర్ధరాత్రమున గవాక్షముగుండ నాకడకు వచ్చుటకుఁ గారణ మేమి?"

"మహారాజా, రాజగఢలో నంతయు సరిగా నున్నది. నాకు మహారాష్ట్రవార్తలు విశేషముగా తెలియవు. ప్రభువు వారు దేశము విడిచిన తరువాత నేను గూడ నక్కడ చాల రోజు లుండలేదు. తీర్థయాత్రలు చేయవలయునని దేవరవారి కిదివఱకే చెప్పియుంటిని కదా! కావున మధుర మొదలుగాఁ గల పుణ్యస్థలములను సందర్శించి, పిమ్మట ఢిల్లీ నగరికి వచ్చితిని. దేవరవారిని సందర్శింపఁ గలిగినప్పుడే శుభసమయము. పవలైన నేమి? రాత్రియైన నేమి?"

"ఏదో విశేషకారణ ముండనిదే చీఁకటివేళ, గవాక్ష మార్గమున దయచేయరు. అనుగ్రహించి, ఆకారణ మేదో తెలుపుఁడు."

"విన్నవించు చున్నాను. వచ్చినది మొదలు ప్రభువు గారికి సుఖమేనా?"

"శారీరకసుఖము మాత్రమే. శత్రుమధ్యమున మన స్వాస్థ్య మేలాగున నిలిచి యుండును?"

"చక్రవర్తి మీతో సంధి చేసి యుండఁగా శత్రువు లెక్కడ?"

"పామునకు కప్పకు సంధియెంత కాలము నిలుచును? సీతా పతీ, సమస్త వార్తల నెఱిఁగియే నన్ను మోమోటపెట్టు చున్నారు. రాజ్ గఢ్ దుర్గములో మీ హితోపదేశము ననుస రించినపక్షమున నిప్పటికిని కొంకణమున పర్వతభూములలో స్వతంత్రుఁడ నై యుండువాఁడను."

"దేవరవారు ఆత్మతిరస్కారము చేసికోవలదు. మనుష్యమాత్రు లెల్లరు భ్రాంతి పడు చుందురు. జగత్తే మిథ్య కదా! సంధివాక్యములను విశ్వసించి తమ రిచ్చటికి విచ్చేసితిరి. దేవా, అధర్మమునకు జయము కలుగదు. ఇప్పుడు మిమ్ము బందిగమునం దుంచినపాపముచేత చక్రవర్తి సగోత్రముగా నశించును. మహారాజా, రాజ్ గఢలో తమరు వచించిన వాక్కులను మహారాష్ట్రమునం దిప్పటికి నెవ్వఁడును మఱచి యుండఁడు. ఔరంగ్ జేబ్ అక్రమకార్యములను జేయు నేని, మహారాష్ట్రమునఁ బ్రజ్వరిల్లుయుద్ధాగ్ని యందు మొగల్ సామ్రాజ్యము దగ్ధమై పోవును!"

ఉత్సాహముచే నేత్రములు వికాసము నొందఁగా శివాజీ యిట్లనెను: "సీతాపతీ, ఆ నమ్మక మింకను పోలేదు. ఇప్పటికిని మన వారల దెబ్బ వీఁడు రుచిచూడఁ గలఁడు కాని మనసుభటులకును మొగల్ సైనికులకును యుద్ధము జరుగుచుండఁగా నేను దూరప్రదేశమున చెఱసాలలో నుందునా?"

"సర్వతోముఖ మగు వాయువును చక్రవర్తి వలలోఁ గట్టి యుంపఁగలిగినప్పుడు తమ్మును ఢిల్లీప్రాకారమునడుమ బందిగా నుంపఁ గలఁడు."

"అయిన తప్పించుకొని పోవు నుపాయము గనిపట్టి నాకుఁ దెలుపుటకే నిగూఢముగా రాత్రివేళ వచ్చితి రని తలఁచుచున్నాను."

"దేవరవారిది తీక్ష్ణబుద్ధి. ఏదైన తమకుఁ దెలియకుండ దాఁచుట వట్టిమాట!"

"ఆయుపాయ మేది?"

"మాఱువేసము దాల్చి చీఁకటిలో దేవరవారు అనాయాసముగా గృహమునుండి నిష్క్రమింప వచ్చును. నగర ప్రాకారమున తూర్పుభాగమందు ఇనుపకమ్మి కలదు; దాని నూఁతఁగాఁ జేసికొని గోడ దాఁటుట మహారాష్ట్రవీరున కసాధ్యము కాదు. ప్రక్క యమునానదిలో పడవలో నెనిమిది మంది పడవవాండ్రు కలరు. నిముసములో దేవరవారు మథురానగరమును జేరవచ్చును. అచ్చట ప్రభువువారి కనేక

మిత్రులు యున్నారు. అక్కడనుండి సురక్షితముగా మహారాజు గారు స్వదేశమునకుఁ జనఁ గలరు."

"మీచేసినయేర్పాటులకు సంతోషించితిని. తమరు ప్రకృతబంధువులు. అయిన గోడ దుముకునప్పు డెవ్వఁ డయిన నన్నుఁ జూచినపక్షమున పలాయన మసాధ్యము. ఔరంగ్ జేబుచేతులలో మృత్యువు తప్పదు."

"సమీపముననే తమసైన్యములోని పదిమంది విలుకాండ్రు మాఱువేసములతో డాఁగి యుందురు. ఎవ్వఁ డయిన శత్రువు ప్రభువువారి నానవాలు పట్టినను, అడ్డగించినను వానికి మరణము తప్పదు."

"మంచిది! పడవకడకుఁ జనునప్పుడు నదీతీరమందలి యామికుఁడు సంశయము నొంది పడవను పోనీయఁ డేని?"

"అందలివారును తమసైనికులే. వారిశరీరములమీఁద కవచము లుండును, తూణీరములు నిండుగా నుండును. ఆకస్మికముగా పడవ నెవ్వఁడు నడ్డగింపఁడు."

"మధురానగరము చేరినవెనుక మిత్రులు దొరకని పక్షమున?"

"దేవరవారి పీష్వా బావమఱఁది మధురలో నున్నాఁడు. ఆయన నమ్మఁదగినవాఁడు. తమ రాయన నెఱుఁగుదు రనియే తోఁచుచున్నది. నేఁడు నే నాయనయొద్దనుండి

నే వచ్చినాను. అచ్చట సమస్తము సిద్ధము. ఆయన లిఖించిన యుత్తర మిదిగో ”

గోసాయీ వస్త్రమునుండి పత్రికను విప్పి శివాజీకి సమర్పించెను. అతఁడు లేనగవుతో దానిని మరల సీతాపతి కిచ్చి “ చదువుఁడు ” అని పలికెను. గోసాయీ జాబు చదివెను.

“ గోసాయీ జీ, తమరు పరోపకారములయందే జీవితము వినియోగించుచున్నా రని నే నిదివఱకు తలఁప లేదు. మంత్రులు సయితము తమకంటె నెక్కువ యుపాయశాలురు కారు. కాని, సందేహములు బాధించు చున్నవి. నేను తప్పించు కొందు ననుకొనుఁడు: నాకుమారుఁడు, మంత్రి రఘునాథపంతు, ప్రియమిత్రుఁడు తానాజీ వీ రే మగుదురు ? నాసైని కులు ఔరంగ్ జేబుకోపమునుండి యేలాగున పరిత్రాణము నొందుదురు ? ”

“ తమపుత్రుఁడు, మంత్రి, ప్రియమిత్రుఁడు ఈ మువ్వురు తమవెంటనే నేఁటిరాత్రి బయలుదేఱవలయును. సైనికులు ఢిల్లీయందున్నను నష్టము లేదు. ఔరంగ్ జేబు వారల నేమి చేయును ? నిశ్చయముగా విడిచిపెట్టును.

“ ఆర్యా, తమరు వాని నెఱుఁగరు. భ్రాతృవధ చేసి సింహాసన మెక్కినవాఁడు ! ”

"ఒకవేళ చక్రవర్తి మీపై నిరులకు కఠినశిక్ష విధించి నను, దేవరవారు సురక్షితముగా నున్నారన్న వార్త విన్న పక్షమున సానందముగా ప్రాణముల నీయనిమహారాష్ట్రు డున్నాఁడా?"

"మహాత్మా, విధేయుఁడను. కాని విశ్వాసయోగ్యు లగుభటులను విపత్తులో విడిచి, నేను మాత్రము కుశలముగా నున్న నేమి లాభము? అట్టిపని యెన్నఁడు చేయను. ఉపా యాంతరము నాలోచింపుఁడు.

"వేఱొక యుపాయము లేదు."

"కొన్ని దినములు గడపవలయును, ఇది మొదటి యాపద కాదు

"కాలవిలంబము మంచిది కాదు. ఈరాత్రి పలాయ నమునకు వీలుగా నున్నది. రేపటిమాట యెటు లుండునో!"

"క్షమింపవలయును. మీ వాక్యములు యుక్తముగా నున్నవి. కాని ఆశ్రితులను సంకటమున విడిచి, శివాజీ ఆత్మ పరిత్రాణము చేసికొనువాఁడు కాఁడు. ఆలాగున ప్రవర్తించుట క్షత్త్రియధర్మము కాదు."

"దేవా, విశ్వాసఘాతకుని శిక్షించుట క్షత్త్రియ ధర్మము కాఁబట్టి తురకవానికి శాస్తి చేయుఁడు."

"దుర్మార్గులను భగవంతుఁడే దండించును. ఎంతో కాలము పట్టదు."

"దేవా, చక్కఁగా యోజించి చూడుఁడు, తప్పు వివేచించుటకు వీ లుండదు. చెఱసాలలో నుందురు."

"కా నిందు ఆశ్రితులను విడుచుటకు వీలు లేదు."

సీతాపతి మిన్న కుండెను. అతని నేత్రముల బాష్పకణ ముల నవలోకించి శివాజీ గోసాయీహస్తము సస్నేహముగా పట్టుకొని "ఆర్యా, క్షమింపుఁడు. మీ యనురాగము, మీరు నాకొఱకు పడినకష్టములును మఱపునకు రావు రాజగఢలో మీ యుపదేశము, ఢిల్లీలో మీ ప్రయత్నము నాహృదయము నాటుకొని యుండును. మీరు నాదగ్గఱ నుండుఁడు. మీ యాలోచనచే నెల్లర నుద్ధరింప వచ్చును," అని వచించెను.

"దేవా, మీమధురవాక్యములచే సన్మానితుఁడ నైతిని. మీసన్నిధియం దుండ వలయు ననియే నాకోరిక. కాని, వ్రతకారణమున నిచ్చట నుండుటకు వీలు లేదు."

"ఇ దేమి! అసాధారణవ్రతముగా నున్నదే! ఎందుల కిట్టికఠోరవ్రతము నవలంబించితిరి " "

"ఇప్పుడు యావద్వృత్తాంతము నేలాగునఁ జెప్పు దును? దివాభాగమున రాజసందర్శనము నిషిద్ధము. ఇది వ్రతములో నొకయంగము."

"బళే! ఏయభిప్రాయముతో నీవ్రతము ననుష్ఠించు చున్నారు?"

"నాలలాటమున మంగళరేఖ యున్నది. నాయిష్ట దేవతకు విముఖత కలిగినది. అశుభము తొలఁగించుకొనుటకై ఈయపూర్వనిష్ఠ పూనితిని."

"అమంగళరేఖ కల దని చెప్పినవా రెవరు? ఈవ్రత మును పూనవలసిన దని పలికినవా రెవరు?"

"కార్యక్రమమున నేనే దానిని గ్రహించితిని. ఈశా నీమందిరమున నొకరు నా కీవ్రతము బోధించినారు. మనోరథ మీడేఱు నేని నమగ్రవిషయమును దేవరవారికి విన్నవింతును; కాదేని, ఈతుచ్ఛప్రాణములను విసర్జింతును."

"నిజమే! ప్రాణములకయిన నానపడక యెవరికొఱకు సకలకష్టములకు లోనగుదుమో వారియసంతుష్టికంటె నెక్కుడు మర్మభేది యగుదుఃఖము లేదు. అట్టివ్యథ నొకసారి చూచితిని."

"దేవా, ఎప్పుడు?"

నిర్దోషికి యాతన కలిగించితిని. వానిమాట జ్ఞప్తికి వచ్చినప్పుడు కష్టముగా నుండును."

"ఆదీనునిపే రేమి?"

"రఘునాథజీ."

ఇంటిలోనిదీపము చల్లాఱెను. శివాజీ మరల దీపము వెలిఁగింప నుద్యమించుచుండ సీతాపతి యతనితో, "దేవా,

దీపములో నవసరము లేదు. తరువాతివృత్తాంతము చెప్పుడు "
అని వచించెను.

"ఇంక నేమున్నది ? అతఁడు నాకొలువులో మూడు సంవత్సరము లుండెను. ఆకాలములో తనపనులను సరిగా నెఱవేర్చు చుండెడివాఁడు. చూచుట కతఁడు కేవలము మీవలె నుండెను. మీరు జ్ఞప్తికి వచ్చినప్పు డతఁడు జ్ఞప్తికి వచ్చును."

"తరువాత ?"

"చూడఁగానే యాతఁడు వీరుఁ డని తోఁచెను. పిమ్మట నతనిని నాకొలువులోనికిఁ దీసికొని, స్వయముగా ఖడ్గ మిచ్చితిని. విపత్సమయములం దతఁడు సర్వదా ఛాయవలె నావెంట నుండువాఁడు. వానివీరాకృతిఁ నల్లనిశిరోరుహంబులు, ఉజ్జ్వలలోచనములును ఇప్పటికిని నాకన్నులకుఁ గట్టినట్లున్నవి."

"అటుతరువాత ?"

"రఘునాథజీ దెబ్బలాటలో నాప్రాణములు నిలిపెను; యుద్ధములో నతనివిక్రమముచే దుర్గము పట్టుపడెను."

"అటుపిమ్మట ?"

"భ్రాంతిఁ జెంది ఆయనుచరుని పరాభవించి, కొలువు నుండి తొలఁగించితిని. రఘునాథుఁడు నాముఖము నుపలక్షించి, శిరస్సు వంచి, నిశ్శబ్దముగా వెడలిపోయెను."

శివాజీకంఠము స్తంభించెను, కన్నులనుండి రెండు బాష్పకణములు రాలెను. కొంతవఱకు నిద్దరు మిన్నకుండిరి.

తుదకు సీతాపతి శివాజీతో "దోషిని దండించుట రాజధర్మము కదా, అందు మీ భ్రాంతి యేమి?" అని యడిగెను.

"రఘునాథుఁడు దోషియా? అతఁడు రణరంగము నకు వచ్చుటలో కొంతజాగయ్యెను. ఆకారణమున నతఁడు దోషి యని భావించితిని. మహానుభావుఁడు, జయసింగు ఆసంగతి విచారించి, యుద్ధమునకుఁ బూర్వము రఘునాథుఁడు జనార్దనదేవుఁ డను బ్రాహ్మణునిసన్నిధికి ఆశీర్వచనము గ్రహించుటకు చనె నని నాకుఁ దెలిపెను. అట్టినిర్దోషి నవమానించితిని. ఆయవమానముచే నతఁడు మృతి నొందె నని వింటిని."

శివాజీకి కొంచె మూఁగి "సీతాపతీ!" అని పిలిచెను.

ప్రత్యుత్తరము రాలేదు. విస్మితుఁడై, శివాజీ దీపము వెలిఁగించి చూడఁగా గోసాయిగా సీతాపతి గృహములోఁ గానఁబడలేదు!

౨౯

మఱునాఁటియుదయమున జాము ప్రొద్దెక్కునప్పటికి నిద్రాభంగ మయ్యెను. రాజమార్గమున కోలాహలము వినఁబడెను. లేచి, గవాక్షముగుండ క్రిందికి చూడఁగా అగృహమునకు నల్వంకల శస్త్రపాణు లగురక్షకభటులు జాగరూకులై నిలిచి యుండిరి. వారలయనుమతి లేనిది లోపలివారు వెలుపలికిని, వెలుపలి

వారు లోనికిని పోవుటకు వీలు లేకుండెను. శివాజీకి సేనాపతి మాటలు జ్ఞప్తికి వచ్చెను. నెపోకటిరాత్రి పలాయనము చేయుటకు వీ లుండెను. నేఁడు శివాజీ బంది యయినాఁడు!

శివాజీ ప్రార్థనాపత్రికను బంపినది మొదలుగా చక్రవర్తి సంశయగ్రస్తుఁడై మహారాష్ట్రప్రభువు నివసించుమందిరమునకు నల్దిక్కుల రక్షకభటులను నిలుపవలసిన దనియు శివాజీ గృహములోనుండి వెలుపలికిఁ జనువారి నాతనివెంటఁ గొందఱు భటులు పోవుచుండవలయు ననియు కొత్వాలుకు ఆజ్ఞ యొసఁగెను. ఈసంగతు లెలాగుననో గ్రహించి, గోసాయీ సేనాపతి శివాజీ పలాయనముచేయుటకు సర్వము సిద్ధము చేసి, చీకటి రాత్రి యతనిసన్నిధి కేఁగినాఁడు. శివాజీ గోసాయీకి మానసిక నమస్కారము చేసెను.

ఔరంగజేబుకపటవర్తనము నేటికి స్పష్టమయినది అతఁడు తొలుదొల్త శివాజీకి గౌరవపురస్సరముగా నాహ్వానపత్రిక నంపెను. శివాజీ వచ్చినతోడనే యతనిని సభాభవనమున నవమానించెను. పిమ్మటకొలువుకూటమునకు రావలదని యాన తిచ్చెను. తుదకు ఖైదిని జేసెను! ఒకానొకజాతిసర్పము జంతువును భక్షించుటకుమున్ను నిజదేహమును బెంచి, చిక్కినజంతువుశరీరమును చుట్టవేసి, సంపూర్ణముగాఁ దనవశమున నుంచుకొని, క్రమక్రమముగా దానిని మ్రింగులాగున, చక్రవర్తి మెల్లన మనువలను ప్రసారించి శివాజీని పూర్ణముగా

తనచేతఁ జిక్కించుకొను నాశను చేయు సంకల్పించెను. శివాజీ శత్రువుగూఢోద్దేశమును గ్రహించి, మహోగ్రుఁడై వేగముగా నడుగులు వేయుచు, పండ్లు బిగియఁ బట్టి "ఔరంగ్ జేబ్, జాగ్రత్త! టక్కరితనములో నీకంటె రెండాకులెక్కువ చదివి నాను: ఈఋణమును వడ్డితోఁగూడ నొకనాఁడు తీర్చెదను." అని పలికెను.

కొంతతడ వేమో చింతించి, శివాజీ రఘునాథపంతును బిలిపించెను. న్యాయశాస్త్రి ప్రభుసన్నిధికిఁ జని, నిశ్శబ్దముగా నుండెను.

"పండితప్రవర, తమరు తురకవానిచేష్టలను జూచుచున్నారు గదా? ఈయాటలు మనము నయిత మాడ వలయును. నేఁడు మన మెల్లరము ఖైదీల మగుదు మని రాత్రియే నాకుఁ దెలిసినది. అయినను, అనుచరులను రక్షింపక, నేను తప్పించుకొని పోవ నిచ్చగింపనైతిని. ముందు చేయవలసినపని యేమి?"

"మనయనుచరులను స్వదేశమునకుఁ బోనీయవలయు నని చక్రవర్తికి విజ్ఞాపన పంపవలయును. మనపరివారము ఎంత తగ్గిన నతఁ డంతగా సంతోషించును. నిస్సంశయముగా నతఁడు మనకోరిక నీడేర్చు నని నాయభిప్రాయము."

"ఆర్యా, మీయభిప్రాయము యుక్తమే. అధూర్తుఁడు ఈవిషయమున నడ్డు చెప్పఁ డని నాకును తోఁచుచున్నది."

విజ్ఞాపనాపత్రిక ప్రతినిధికిఁ జేరెను. శివాజీ తలంచి నట్టులే జరిగెను. మహారాష్ట్రులు ఢిల్లీనగరము విడిచెదరని తెలిసికొని ఔరంగ్‌జేబ్ మిగుల సాహసమొంది, వారలను వేర్వేరుగా నంగీకారపత్రికల నొసంగెను. ఆపత్రికలు రెండు మూఁడురోజులలో శివాజీకి చేరెను.

రాజకార్యములను చక్కఁబెట్టి, ఔరంగ్‌జేబు "గోసల్ ఖానా" మందిరమున నాసీనుఁడై యుండెను. అది మంత్రులతో రహస్యాలోచనము చేయుప్రదేశము కాని నేఁడతఁ డొంటరిగా నున్నాఁడు. ఒక్కొకపర్యాయ మతనివదనమున చింతారేఖలు కాన్పించుచుండెను. మఱియొకసారి నేత్రములు జాజ్వల్యమానము లగుచుండెను. పెదవులమీఁద లేనగ వగ పడుచుండెను. అతఁడు తనమంత్రులనే నమ్మలేకుండెను. భరత ఖండములో నతఁడునమ్మినవాఁడు లేఁడు. తనయభిప్రాయము లొరులతోఁ జెప్పఁడు. బుద్ధిబలముచే నెల్లరను తోలుబొమ్మల వలె నాడించుచు దేశమును స్వతంత్రముగా పరిపాలింపవలయు నని వానియభిలాష.

కొంతసేపటికి సైనికుఁ డేతెంచి, తస్లీమ్ చేసి "జాహఁ పనా, దానేశ్ మంద్ గారు దర్శనార్థము వచ్చియున్నారు" అని విజ్ఞాపింపఁగా, సార్వభౌముఁడు "దానేశ్ మంద్ గారు రావచ్చును" అని పలికి, విచారము పాఱద్రోలి, మోమునఁ జిఱునగవు తెచ్చిపెట్టుకొని యుండెను.

దానేశ్ మంద్ మంత్రి కాఁడు, రాజ్యకార్యములందు విశేషసంబంధము కలుగఁజేసికొనువాఁడు కాఁడు. అతఁడు ఫారసీ, అరబీభాషలందు నిరుపమానపండితుఁడు; కావున చక్రవర్తి అతని గౌరవించుచుండును. అప్పుడప్పుడు ఏ మయిన నడుగుచుండును; ఉదారహృదయుఁడగు దానేశ్ మంద్ మాయమర్మములు లేకుండ హితోపదేశము చేయుచుండును. ఔరంగ్ జేబ్ అన్న దారా బందిగమునం దున్నపుడు అతనిని విడిచిపుచ్చుట మంచి దని దానేశ్ మంద్ చక్రవర్తికి బోధ చేసెను. దానేశ్ దూరదర్శి కాఁడనియు, తెలివితక్కువవాఁడనియు భావించును. కాని విద్యాధన, గౌరవములం గాంచి యతనిని సన్మానించుచుండును. వృద్ధుఁడు చక్రవర్తికి ప్రణామము చేసి, కూరుచుండెను.

దానే— "ఇట్టి సమయమున దాసుఁడు జాహాపనావారి సన్నిధికి వచ్చుట కేవలము వెఱ్ఱిపని రాజకార్యములు సవరించి దేవరవారు విశ్రాంతిఁ దీసికొనుసమయ మిది. అయినను నారాక దేవరవారియనుగ్రహముచేతనే. ఫారసీకవి చక్కఁగా లిఖించినాఁడు:

సూర్యునికొఱకు నమస్త ప్రాణులు నిరీక్షించుచుండును. భానుఁడు కాంతి నొసఁగి యెల్లరను సంతోషపెట్టును, కాని వెలుతురు నీయ కుండునా?

ఔరంగజేబు నగుమొగముతో "దానేష్ మంద్, ఇతరులవిషయమై యెట్లయిన నగుఁగాక, తమరు ప్రవేశయందయినను మాననీయులే." అని పలికెను.

ఇష్టాలాపములు జరిగినతరువాత దానేశ్ మంద్ ఇట్లనెను: "జాహాపనా! ఆలంగీర్ నామమును సార్థకము చేయవలయును. హిందూస్థాన మెల్ల దేవరవారి యాధిపత్యమున నున్నది; ఇఁక దక్షన్ దేశము కూడ కొలఁదిదినములలో దేవరవారిక్రిందికి రాఁగలదు" అని పలికెను.

"ఏమి! మీ కేలాగునఁ దెలిసినది?"

"దక్షిణదేశ ప్రధానవైరి తమచేతిలో నున్నాఁడు."

"శివాజీనిగూర్చి పలుకుచున్నారా! దానేశ్ మంద్, తమరు నాయుద్దేశమును బాగుగా నెఱుఁగుదురు దేశమందలి మహాపురుషులను సన్మానించుటే నాయభిమతము. శివాజీ ధూర్తు, రాజద్రోహియు నగుఁగాక, యోధ కదా! అందుచేత నతనిని గౌరవించుటకు ఢిల్లీ కాహ్వానించితిని. రాజసభయందతనిని సముచితముగా సత్కరింప నెంచితిని. కాని యతఁడు తిన్నఁగా ప్రవర్తింప లేదు. అయిన నతనిని శిక్షింపక, కొలువుకూటమునకు మాత్రము రాఁగూడ దని శాసించితిని. ఇప్పుడతఁడు మననగరములో ననేక సన్న్యాసులతోను, రాజద్రోహులతోను ఆలోచనలు చేయు చున్నట్లు తెలియుటచే, కొత్వాలు కొంచె మతనిపై కన్ను వేసి యుండ నాజ్ఞాపించితిని.

కొలఁదిదినములలో సన్మానపూర్వకముగా శివాజీని పంపి వైచెదను."

"ప్రభువువారి యాదేశము నాకర్ణించి మిక్కిలి సంతోషించినాను."

"ఎందుచేత ?"

నిష్కపటుఁడగు దానేశ్‌మంద్ ఇట్లు లనెను. "దేవర వారికి ఆలోచన చెప్పుట నాకు సాధ్యమా ? కాని జహోవనా, శివాజీయెడ సరిగా ప్రవర్తింపకున్నను, బహుకాలము చెఱసాలయం దుంచినను, మూఢమతులు లోకులు నానావిధములఁ బలుకుదురు. చక్రవర్తి శివాజీ నాహ్వానించి, కారాగృహమునం దుంచుట న్యాయము కా దందురు."

కోపము నణఁచుకొని, చిఱునగవుతో "దానేశ్‌మంద్, మూఢు లాడుమాటల వలన నష్టము లేదు. అయినను న్యాయము, దయయు సింహాసనమునకు వన్నె దెచ్చును." అని ఔరంగ్‌జేబ్ వాక్రుచ్చెను.

"జాహోపనావారి ప్రపితామహుఁడు, అక్బర్‌షాహ ఈవిధముననే దేశమును శాసించెను. దేవరవారును వారిలాగున పరిపాలనము చేసి, అభ్యుదయము నొందుదురు గాక !"

"అనఁగా ?"

"దేవరవారికి గోచరింపని దేమున్నది ? అవధరింపుఁడు. అక్బర్‌షాహ సింహాసనము నెక్కినపుడు రాజస్థాన,

బీహారు, వంగ, దక్షిణదేశములయందు వైరు లుండిరి. ఢిల్లీ నగరసమీపముననే పగవాండ్రు విచ్చలవిడిగా సంచరించు చుండిరి. ఆయన కాలధర్మము నొందునప్పటికి సామ్రాజ్యము నిష్కంటకమై యుండెను. తొలుదొల్త పరమశత్రువులుగా నున్న రాజపుత్రులే బాదుషాహ కొలువులోఁ జేరి, కాబూల్ మొదలుకొని వంగదేశమువఱకు ఢిల్లీశ్వరుని విజయపతాకలను నాటిరి. విజయ మేలాగునఁ గలిగెను? కేవల బాహుబలము చేతనా? కేవల సాహసముచేతనా? తైమూర్‌లంగ్ వంశమున బాహుబలము కాని, సాహసము కాని లేనివాఁడు లేఁడు. కాని, అక్బర్ షాహ గాక, తక్కినవా రెవరయిన నట్టి విజయము నొందిరా? లేదు. జాహాపనా, సత్ప్రవర్తనచేతనే అట్టి యభ్యుదయము కలిగెను. ఆయన పగవారిని సన్మానించువాఁడు; తనక్రింది హిందువులను నమ్మువాఁడు. వారును విశ్వాసపాత్రము లగుటకు యత్నించుచుండువారు. మానసింగ్, తోడర్ మల్లు, బీర్ బల్ మొదలగు హిందువులే మొగల్ సామ్రాజ్యమునకు స్తంభము లయిరి. ఉత్తములయెడ నవిశ్వాసము కనఁబఱుప రాదు. హీను డయినను దయతోఁ జూచుచుప్పుడు వాఁడు క్రమముగా విశ్వాసయోగ్యుఁ డగును. దక్షిణదేశయుద్ధముల యందు శివాజీ మనకు చాల సాయము చేసినాఁడు. జాహాపనా, శివాజీని సన్మానించినపక్షమున నతఁడు ముఖ్యస్నేహితుఁ డై యుండును."

"ఔరంగ్‌జేబు చేసినపనికి మునల్మాన్‌సభ్యులు లజ్జించు చుండిరి. గౌరవించి, శివాజీని స్వస్థానమునకుఁ బంపవలసిన దని చక్రవర్తితోఁ జెప్పుటకు దానేశ్ వచ్చియుండెను. చేతితో పర్వతమును కదలింపవచ్చును. కాని సార్వభౌముని ప్రతిజ్ఞను ఎట్టి హితబోధచే నయినను మార్చుట యుక్తనే.

దానేశ్ వచించిన మంచిమాటలు రుచింపకపోవుటచే చక్రవర్తి మందహాసము చేసి "దానేశ్‌మంద్ శాస్త్రమును బాగుగా నెఱిఁగినవారు! దక్షిణదేశమున శివాజీ స్తంభమును నిలుపుదును; రాజస్థానమున రాజపుత్రు లిదివఱకే స్తంభములై యున్నారు; ఉత్తరమున కాశ్మీరమునకు మరల స్వాతంత్ర్య మొసఁగెదను; వంగదేశమునకు పఠానులను మరల గౌరవపుర స్సరముగాఁ బిలిపించెదను. ఈనాల్గు స్తంభములమీఁద మొగల్ సామ్రాజ్యము దిట్టముగా నిలుచును" అని నుడివెను.

మొగము జేవురింపఁగా దానేశ్‌మంద్ "దేవరవారి తండ్రిగారు ఈదాసు ననుగ్రహించువారు. తమకు నాయందు అనుగ్రహ ముండుటచేతనే మనసులోని మాటలను పలుకు చుండుట; జాహాపనాకు అహితము చెప్పవలయు నన్న యూహ లేదు" అని విన్నవించెను.

దానేశ్ అమాయకత్వమును జూచి చక్రవర్తి యతనిని ప్రేమించుచుండును. అతనికి కష్టము తోఁచె నని గ్రహించి, ఔరంగ్‌జేబ్ ఇట్లనెను. దానేశ్‌మంద్, నామాటలు మఱియొక

లాగున నెంచఁబోకుఁడు. అక్బర్ షాహా బుద్ధిమంతుఁడే కాని కాఫరును, ముసల్మానును సమదృష్టితోఁ జూచుట ధర్మసమ్మతమా ? సామ్రాజ్యభారమును పరుల కప్పగించుటకంటె స్వయముగా నిర్వహించుట మేలుకాదా? నాబాహుబలముచే హిందూదేశమును శాసింపఁ గలిగినప్పుడు, ఎందులకా కాఫర్ల తోడ్పాటు నభిలషింపవలయును? బాల్యకాలమునుండియు ఖడ్గమునే నమ్మియున్నాను. ఆఖడ్గముతోనే సింహాసనమును సంపాదించినాను. దానితోనే దేశమును పరిపాలింతును. ఇతరులసాయము నపేక్షింపను. ఎవ్వనిని విశ్వసింపను.''

''జాహాపనా, స్వయముగా దైనికకార్యములను నిర్వహింపవచ్చును; కాని విస్తీర్ణ సామ్రాజ్యమును ఇతర సాహాయ్యము లేకుండ పరిపాలించుట సాధ్యమా? అన్ని భాగములందును ఏకకాలమున దేవరవారు వర్తిల్లు టెట్లు? ఎవ్వరినైన నియోగింపనిచో రాజ్యతంత్ర మేలాగున నడచును?''

''సరిగా కావలసినంతమంది భృత్యులను నియోగించెదను కాని వారు సేవకులవలెనుందురు. స్వతంత్రులు కానేరరు నేఁ డొకనికి అధికార మిచ్చినపక్షమున రేపు వాఁడు స్వతంత్రుఁడగును; ఒకనిని నమ్మినయెడల వాఁడు శీఘ్రముగా విశ్వాసఘాతకుఁ డగును. ఇట్టి సందర్భమున అధికార విశ్వాసములను ఇతరులయం దుంచుటకంటె తనయందే నిలుపుకొనుట మేలు కాదా? దానేశ్ మంద్, మీరు గుఱ్ఱమునెక్కి ఖలీనముద్వారా

దానిని సంపూర్ణముగా వశపఱుచుకొనఁగలేని యెడ మీరు త్రిప్పినట్లు తిరుగక తప్పునా? చక్రవర్తియును ఆవిధముగానే పరిపాలనము చేయవలయును. ఎవ్వనిని విశ్వసింపరాదు. ఎవ్వనికి నధికార మొసఁగరాదు. సేనాపతులను, తక్కిన సేవకులను సంపూర్ణముగా వశమునం దుంచుకొని, పనులు చేయింపవలయును"

"దేవా, మానిసిగుఱ్ఱము కాఁదుగదా! వానికి స్వాతంత్ర్యము, అభిమానము కలవు."

"మనుజుఁడు గుఱ్ఱము కాఁ డన్నమాట తెలియును. అశ్వమునకు కళ్ళెము తగిలింతుము; నరునకు ఆశ పెట్టియు, భయపెట్టియు పనులు చేయింతుము. మంచిపనులు చేయువారికి బహుమానము లొసఁగుదుము. తప్పుడు పనులు చేయువారికి శాస్తి చేయుదుము. బహుమానపుటాశతోను, శిక్షాభయముతోను జనులు పనిచేయుదురు."

"ప్రభూ, మానవ హృదయమునం దివి కాక యితర భావన లున్నవి. శిక్షాభయముచేఁ బనిచేయువాఁడు ఏదోవిధముగా పని ముగించివేయును. కాని యెవనిని తమరు గౌరవింతురో, ఎవని కధికార మొసఁగి వానిని నమ్ముదురో, అట్టివాఁడు కృతజ్ఞతను కనఁబఱచుటకు ప్రభుకార్యమునందు ధనము, ప్రాణములను గూడ విడుచును. గ్రంథములందు కావలసినన్ని యుదాహరణము లున్నవి"

"దానేశ్ మంద్, నేను మీవలె శాస్త్రజ్ఞుఁడను కాను, పుస్తకములందలి మాటలు నమ్మువాఁడను కాను. లోకానుభవమే నాకు శాస్త్రము. మానవశక్తి మిక్కిలి నీచముగఁ గానఁబడుచున్నది. దుర్వర్తనము, వంచన, విశ్వాసఘాతుకత మొదలగువానిని విలోకించియున్నాను కావున నధికారము నాచేతుల యందే యుంచుకొన్నాను. కాఫర్లపై జిజియాపన్ను విధించితిని. ద్రోహులగు రాజపుత్రులను శిక్షించెదను. మహారాష్ట్రులను దండించెదను. బీజపూర్ గోల్కొండలను జయించెదను. హిమాలయము మొదలు కుమారికాగ్రమువఱకును దేశము నొక్కఁడనే పాలించెదను. ఎవ్వనిసాయమును గ్రహింపను. అలంగీర బాదుషాహా తనపేరు సార్థకము చేసికొనును!"

ఉత్సాహముచే నతని కన్నులు విప్పారి యుండెను. అతఁడు గూఢోద్దేశముల నెవ్వనికడను ప్రకాశము చేసియుండలేదు; కాని, మాటవరుసను నేఁడు వానిని వెలిఁబుచ్చినాఁడు. దానేశ్ మంద్ దగ్గఱ నొకటి రెండు మాటలు పలికినను నష్టములేదని యతఁడు తలఁచెను

పిమ్మట దరహాసముచేసి చక్రవర్తి "సరళహృదయుఁడా! నేఁడు నా యాలోచనలు కొంచెము కొంచెముగాఁ దెలిసినవా?" అని వృద్ధు నడిగెను.

అలంగీర్ బాదుషాహా తన దురాలోచనలను కొంతవఱకు తగ్గించి దానేశ్ మంద్ చేసిన హితోపదేశము నవలం

బించినయెడల, మొగలు సామ్రాజ్యము అంత శీఘ్రముగా నశించి యుండదు.

సైనికుఁ డొకఁడు వచ్చి, వంగి సలామ్‌చేసి "జాహాపనా, రామసింగుగారు దర్శనార్థము వచ్చినారు" అని విన్నవించెను.

"రా నిమ్ము" అని చక్రవర్తి వాని కాజ్ఞ యొసఁగెను. రామసింగు మహాలులోని కరుదెంచెను.

"దేవరవారి సన్నిధి కిట్టిసమయమున వచ్చుట నావంటివానికి తగకపోయినను నాయనగారి సన్నిధానమునుండి మిగుల నవసరమగు వృత్తాంతము వచ్చుటచేత ప్రభువువారికి దాని నెఱిఁగింప వచ్చితిని."

"మీతండ్రిగారి దగ్గఱనుండి మాకును పత్రిక వచ్చుటచే నచ్చటి వంగతు లన్నియు బోధపడినవి."

"నాయనగారు శత్రువుల నోడించి వారి రాజధాని బీజపూరు నాక్రమించినారు; కాని సైన్యము తక్కువగా నుండుటచేత ఆనగర మింతవఱకును చేఁ జిక్కినది కాదు. విశేషించి గోల్కొండసుల్తాను బీజపూరునకు సాయము చేయుటకు నికాసమ్‌ఖాన్ అనుసేనానిని చాలసైన్యముతోఁ బంపినాఁడు."

"ఔను."

"నల్వంకల శత్రువులు మూఁగి యున్నను నాయనగారు జాహాపనాయాజ్ఞానుసారముగా నిప్పటికిని యుద్ధము

చేయు చున్నారు. ఈయుద్ధమునందు జయము గల్గుట యసంభవము. అందుచేత కొంతసేనను పంపఁ దగు నని నాయనగారు ప్రభువుగారికి విన్నవింపు మన్నారు.”

“మీతండ్రిగారు వీరాగ్రగణ్యులే. తమబలములతో బీజపూర్ స్వాధీనము చేసికొనలేకపోయినారా ?”

“సాధ్య మగునంతవఱకు ప్రయత్నము చేయుదురు. అదివఱకు పరాజితుఁడు కాని శివాజీప్రభువును వారు ఓడించిరి; తత్పూర్వము ఆక్రమింపని బీజపూరును ఆక్రమించిరి. ఇప్పుడు తమ సన్నిధినుండి కొంచెము సైన్యమును బంప వేఁడుచున్నారు. ఆప్రకారము చేయుదురేని, దక్షిణదేశము మొగల్ రాజ్యములోఁ జేరిపోవును.”

ఇట్టి సందర్భమున మహాచక్రవర్తి యాయనను తగు సేనను బంపి, దక్షిణదేశవిజయమును సంపూర్ణముగా కావించి యుండును. తాను కుశాగ్రబుద్ధి ననియు, దూరదర్శి ననియు అతని యభిప్రాయము. తుద కతఁడు సేనను పంపనే లేదు. ఔరంగ్‌జేబ్ రామసింగుతో ని ట్లనెను: “రామసింగ్, మీ నాయనగారు నాకు మిత్రులు. వారు విపద్దశయం దున్నారని వినుటకు మిగుల చింతించుచున్నాను. వారి కీవిధమున నుత్తరము వ్రాయుఁడు: “తమ యసాధారణబలముచే జయము కలుగు నని చక్రవర్తి భావించుచున్నాఁడు. అయిన ప్రస్తుతము

ఢిల్లీయందు సేనలు తక్కువగా నుండుటచేత తమకు తోడ్పడు టకు ఏమియుఁ బంపఁజాలకున్నాఁడు!"

జాలి గొలుపునట్లు రామసింగు "జాహాపనా, మా నాయనగారు ఢిల్లీప్రభువుల పురాతనసేవకుఁడు; షాహాజహాన్ బాదుషా వారికాలమునను, జాహాపనావారి కొలువులోను అనేక యుద్ధములు చేసినారు, అనేకకార్యములు చక్కఁబెట్టి నారు. ప్రభు కార్యనిర్వహణముకంటె వారికి మఱియొక యుద్దేశ్యములేదు. ఈభయంకరస్థితియందు దేవరవారు వారికి సాహాయ్యము చేయనిపక్షమున ససైన్యముగా వారు నిహ తులు కావలసినదే యని తోఁచుచున్నది" అని పలికెను.

తన దీనవాక్యములచేతను, కన్నీటిచేతను, తురుష్కుని హృదయము కరఁగ దని, రామసిం గెఱుఁగఁడు. చక్రవర్తి గూఢాభిప్రాయ మెట్టిది? రాజా జయసింగు మహాపరాక్రమ వంతుఁడు. ఆయనకు పెక్కుసేనలు కలవు. కీర్తి దిగంతవ్యాపి. మొదటినుండియు నతఁడు బాదుషాహాకొలువులో నున్నవాఁడు. ఆయనకుఁ గల యధికారము మఱెవ్వనికిని లేదు. అందుచే సార్వభౌముఁడు జయసింగును నమ్మలేకుండెను. ఈయుద్ధ మున పరాజయము సంభవించిన పక్షమున జయసింగుకధి కారము, కీర్తియును కొంతవఱకు తగ్గిపోవును. మరణమే సంప్రాప్తించినచో చక్రవర్తి హృత్కంటకము రాలిపోవును. సాలెపురుగు పన్ను జాలమువలె ఔరంగజేబ్ దుస్తంత్రజాలము

విస్తీర్ణము, అవ్యర్థము నయినది. అందు జయసింగను కీటము తగుల్కొన్నది. ఇంక తప్పించుకొని పోవుమాట లేదు. మాయలు, మర్మములు నెఱుంగని రామసింగు కన్నీరు విడిచినంత మాత్రమున చక్రవర్తి తనయుద్దేశమును మార్చుకొనునా ?

అనురాగము, దయ మొదలగు సుకుమారవృత్తులను ఔరంగ్ జేబ్ నమ్మువాఁడు కాఁడు. వాని కతఁడు హృదయమున చోటీయలేదు; తనమార్గమున కడ్డము వచ్చిన పురుషులను, సోదరులను ఒకేవిధ మగు ధీరభావముతో త్రొక్కివైచెను. తండ్రిని ప్రాణములతో నుంచుట ప్రేమచేతఁ గాదు. అన్నను వధించుట కోపవశమునఁ గాదు. అట్టి బాలకోచితవృత్తులు, అతనికడ లేవు. జనకుఁడు జీవించియున్నను నష్టము లేదు; కావున నాతఁడు ప్రాణములతో నుండవచ్చును. అగ్రజుఁడు బ్రదికి యున్నయెడల ముందు సింహాసనమునకు ప్రతిబంధకము కాఁగలఁడు.

ఇంక జయసింగు నస్సైన్యముగా మరణింపవలసి యున్నది. అతఁడు మంచివాఁడో దుర్మార్గుఁడో, విశ్వాసియో ద్రోహియో తెలిసికొనవలసిన పని లేదు. కావలసినయంశము జయసింగు మృతి. ఆలాగుననే జరిగెను. కొన్నిమాసముల తరువాత జయసింగు మరణించె నని తెలియ వచ్చెను. చక్రవర్తి యాజ్ఞానుసారముగా, రహస్యముగా నతనికి విషప్రయోగము జరిగె నని చరిత్రకారులు కొంద ఱభిప్రాయపడిరి.

నిట్టూర్పు విడిచి రామసింగు "దేవా, ఇంకొక మనవి యున్నది" అని పలికెను.

"విజ్ఞాపింప వచ్చును."

"శివాజీఛత్రపతి ఢిల్లీకి వచ్చునపుడు నాయనగారు వారికి వాగ్దానము చేసినారు."

"మీతండ్రిగారు నా కాసంగతి తెలిపినారు."

"వాగ్దానము చేసి, దానిని చెల్లింప కుండుట రాజపుత్రులనడుమ మిగుల నిందాకరము. శివాజీప్రభువు దోషము చేసినను తమరువారిని క్షమించి, స్వస్థానమునకుఁ బంప వలయును."

కోపము నాఁపుకొని, మెల్లఁగా "చక్రవర్తి తగినట్లు చేయును. మీ రావిషయమున చింత నొందవలదు."

శివాజీ యను రెండవకీటము చక్రవర్తి దురాలోచనా వాగురయందు తగుల్కొనెను. దానేశ్ మంద్, రామసింగులు దాని నుద్ధరింప యత్నించిరి. చేతఁ గాలేదు.

జయసింగుదోష మేదో శివాజీదోషము గూడనదియే. సంధి జరిగినతరువాత శివాజీ చాల శ్రమపడి ఢిల్లీప్రభువునకు దక్షిణమున తోడ్పడెను. అయిన నేమి? శివాజీ పరాక్రమశాలి, విస్తీర్ణరాజ్యమునకుఁ బ్రభువు, మిగుల నైశ్వర్యవంతుఁడు. కాఁబట్టి యట్టివానిని చక్రవర్తి విశ్వసించునా?

మన మెవ్వరిని నమ్మెదమో వారు క్రమముగా మనయెడ విశ్వాసము విడుతురు. రాజపుత్రులు, మహారాష్ట్రులును విరోధు లగుటచేతనే మొగల్ సామ్రాజ్యము క్షీణించి పోయెను.

## ౨౭

శివాజీకి వ్యాధి యంకురించె నని ఢిల్లీనగరమున వ్యాపించెను. దివారాత్రము లతనిమందిరము తలుపులు, కిటికీలు మూసి యుండెను. విరామము లేకుండ వైద్యులు వచ్చుచుఁ బోవు చుండిరి. ఆవ్యాధి యుపశమిల్లుట కష్ట మనియు, శివాజీ మృతి నొందినాఁ డనియు జనులు చెప్పుకొను చుండిరి; కాని జీవించి యున్నాఁ డన్న వార్త సయితము వెంటనే వ్యాపించు చుండెను. ఆశ్వికులు, సేనాపతులు మార్గమునఁ బోవుచు శివాజీ గృహము దగ్గఱ కొంచెమాఁగి, రక్షకభటులను మహారాష్ట్రాధీశుని దేహ స్థితిని గూర్చి యడుగు చుండిరి. రాజులు, మన్సబ్‌దార్లు త్రోవం బోవుచు సదనమువంక దృష్టి నిగుడ్చు చుండిరి. ఔరంగ్‌జేబ్ చాల సారులు శివాజీ కె ట్లుండెనో తెలిసికొను టకు మనుష్యులను బంపు చుండెను. రక్షకభటులు వెనుకటి వలెనే జాగరూకు లై యుండిరి. అతనిరోగమునకు చక్రవర్తి నలుగురయెదుట విచారము నటించుచు, "ఈరోగముతోనే శివాజీ చచ్చునెడల విశేషనింద కలుగదు. అనాయాసముగా కంటకము రాలిపోవును" అని భావించు చుండెను.

సాయంకాలమున ముసల్మాన్ వైద్యుఁడు, మిక్కిలి వృద్ధు, శివాజీగృహద్వారముకడ నిలిచెను. "ఎందులకు మీరు శివాజీగారిని దర్శింపఁ గోరుచున్నారు?" అని రక్షకభటు లతని నడిగిరి. "చక్రవర్తి యా దేశమున రోగికి చికిత్స చేయ వచ్చితిని" అని యతఁడు ప్రత్యుత్తర మిచ్చెను. తోడనే వార లతనికి మార్గము విడిచిరి.

శివాజీ మంచముపైఁ బన్నుండి యుండెను. సేవకుఁ డొకఁడు వచ్చి, యతనితో "చక్రవర్తి వైద్యుని పంపినాఁడు" అని చెప్పెను. చక్రవర్తి తనకు విషప్రయోగము చేయించుట కీసన్నాగము పన్నె నని తలఁచి, శివాజీ సేవకునితో "తబీబుకు నా సలాం తెలుపుము. హిందూభిషక్కులు చికిత్స చేయుచున్నా రనియు, ఈయనుగ్రహము చూపినందులకు బాదుషాహావారికి వేయిసలాములు చేసితి ననియు ఆతనితోఁ జెప్పుము." అని పలికెను.

భృత్యుఁడు వెలుపలికిఁ బోవుటకుఁ బూర్వమే వైద్యుఁడు పిలువనిదే లోపలికి వచ్చెను. శివాజీ కోపమ్ము నణఁచుకొని క్షీణస్వరముతో వెజ్జుకు సలాం చేసి, కూరుచుండ నియమించెను. వృద్ధుడు కూరుచుండెను.

ఆకారముఁ జూడ వైద్యునియెడ నెట్టి సందేహము కలుగుటకును వీలు లేదు. అతఁ డెన్నియేండ్లో గడచినవానివలె నుండెను. తెల్లని పెద్దగడ్డము బొడ్డువఱకు వ్రేలాడు చుండెను.

తలమీఁది పెద్దపాగా ముఖ్యాతిక మొగమును గప్పియుండెను. అతని కంఠస్వరము గంభీరము.

"మహాశయా, భృత్యునిద్వారా తమరు పంపిన యాదేశము వింటిని. తమరు నాచికిత్స నిచ్చగింపకున్నను, మానవులను రక్షించుట ధర్మ మగుటచే స్వధర్మము నాచరించుచున్నాను."

కోపముతో తనలో "ఈపీడ యెక్కడనుండి దాపరించినది దైవమా! అని శివాజీ అనుకొనెను.

"తమ కేమివ్యాధి?"

"ఈపాడురోగ మేమో తెలియకున్నది. సర్వదా దేహము నిప్పువలె మండుచుండెను. హృదయమునను, సర్వావయవములందును వేదన".

"వ్యాధికంటెను శత్రువును వధింపవలయు నన్నకోరిక శరీరమును బాధించును. అనేకసమయములందు హృదయవేదన మానసికక్లేశమువలనఁ గలుగును. తమకును అదేనా బాధ?"

విస్మితుఁడు, భీతుఁడు నయి శివాజీ ఆవిచిత్ర వైద్యుని వంకఁ జూచెను. తబీబుమొగము పై లక్ష్యము నొందలేదు. హాకీం శివాజీ హస్తమును, శరీరమును చూడగోరెను. ఇంకను భీతుఁడై శివాజీ విధిలేక చెప్పినట్లు చేసెను.

కొంతసేపు నాడి పరీక్షించి "తమ కంఠస్వరమువలె నాడి క్షీణముగా లేదు. రక్తము బాగుగా ప్రవహించు

చున్నది. మాంసపేటికలు వెనుకటివలెనే దృఢముగా నున్నవి. ఇదంతయు వట్టి కపటనాటక మేనా?" అని హాకిం శివాజీతోఁ బలికెను.

మరల విస్మితుఁడై శివాజీ ఆయసామాన్యభిషగ్వరుని వంకఁ జూచెను. అతనిముఖము గాంభీర్యముద్ర వహించి యుండెను. కపటభావ మింతమాత్రము కానవచ్చినది కాదు. శివాజీ నాడుల వేఁడినెత్తురు ప్రవహింప సాగెను. కాని యతఁడు కోపము నణఁచుకొని, క్షీణస్వరముతో నిట్లనెను: "తమరు సెల విచ్చినలాగుననే ఇతర చికిత్సకులును జెప్పినారు. ఈ మహా వ్యాధి బాహ్యలక్షణ శూన్యమైనది; కాని దినదినము నువ్వు గింజచొప్పున శక్తిని హరించుచున్నది."

ఇంచుక చింతించి హాకిం ఇట్లనెను: "ఆల్ఫ్ లాజ్లా వా లాజ్లాన్" అను మా చికిత్సా శాస్త్రమున వేయియు నొక వ్యాధులు నిర్దేశించి యున్నవి. వానిలో కొన్ని బాహ్యలక్షణ శూన్యములు. వానికి చికిత్సచేయుపద్ధతి శాస్త్రమునందున్నది. ఒకటి బక్ నుత్ నే—ఆసిరీ—ఇపారత్—కర్ద్. పని చేయకుండ తప్పించుకొనుటకు ఖైదీలు నటించువ్యాధికి చికిత్స శిరశ్ఛేదనము. రెండు: దిగ్ రాన్—దోజఖ్—ఎఖ్తియార్—కునంద్, పడుచువాండ్రు ఈ వ్యాధివలన నరకమునకుఁ బోవుదురు. దీనికి మందు పాదరక్షాప్రహారము. మూఁడు; ఆయే బహా—బర్ గేశేఫ్ తా—జేరేబగల్. మోనగాండ్రు తమ

టక్కరితనమును దాఁచుటకు ఈరుజ నభినయించెదరు. దీనికి నౌషధము కలదు. తమ కాయగదము నిచ్చెదను."

ఈమాటలు శివాజీకి సరిగా బోధపడలేదు. కాని హాకీం తీక్ష్ణబుద్ధి తనగుట్టును కనిపట్టె నని యతఁడు తలఁచి, ఇతి కర్తవ్యతామూఢుఁడై "ఏ 'మాయౌషధము?" అని చికిత్సకుని ప్రశ్నించెను.

"అది మిక్కిలి మంచిదే, కాని ఉత్కటవిషము కూడ నగును. రబ్బుల్-ఆల్మినార్ అనుదానిని తమ కిచ్చెదను. నిజముగా రోగ ముండెనేని తత్క్షణమే యది శమించును; లేని పక్షమున ప్రాణములు వెంటనే పోవును."

శివాజీగుండెలు తటతట గొట్టుకొనెను. వదనమునుండి స్వేదబిందువులు నేలపై రాలెను. ఔషధమును సేవింపకున్న, నతనిమోసము బయటఁ బడును; సేవించినచో, మరణము నిశ్చయము!

హాకీం మందు సిద్ధము చేసెను.

ముసల్మానులు స్పృశించినపానీయముఁ ద్రావను" అని పలికి, శివాజీ సత్తువకొలఁది పాత్రమును దూరముగఁ బాఱ వైచెను. హాకీం కొంచెమేనిఁ గోపము నొందక "ఇది క్షీణతా లక్షణము కాదు" అని మెల్లఁగా ననెను.

అతికష్టముతో నింతపర్యంతము శివాజీ క్రోధమును మ్రింగియుండెను. ఇఁక సహింపలేక "రోగిని పరిహసించి

నందుల కిది శిక్ష" అని పలుకుచునే చప్పున లేచి, వైద్యుని చెక్కిటిపై చెంపకాయ తీసి, గడ్డమును బలిమిని లాగెను.

ఆదొంగగడ్డము సంపూర్ణముగా నతనిచేతిలోనికి ఊడి వచ్చెను. ఆచెంపపెట్టుతో పాగా దూరముగాఁ బడెను. శివాజీస్నేహితుఁ డగుతానాజీ మాలసూరే కిలకిల నవ్వఁ జొచ్చెను!

తానాజీ కొంతసేపటికి హాసము నణఁచుకొని, తలుపు మూసి, శివాజీదగ్గఱకు వచ్చి కూరుచుండి, యి ట్లనెను: "ప్రభువుగారు సర్వదా చికిత్సకులకు ఇట్టివారితోషికమే యిచ్చు చుందురు కాఁబోలు! రోగము శాంతించులోఁగా దేశములో వైద్యుఁడు మిగులఁడు. పిడుగునంటి దెబ్బతో నిప్పటికిని తల తిరుగుచున్నది."

మందహాసముతో శివాజీ యిట్టు లనెను: "మిత్రుఁడా, పెద్దపులితోడి చెలిలాటములో నప్పుడప్పుడు దెబ్బలు తగులు చుండును. మంచిది! నిన్నుఁ జూచి మిక్కిలి సంతోషించి తిని. ఎన్నాళ్ళనుండి నీకోసము నిరీక్షించుచున్నా ననుకొంటివి! విశేషము లేమి?"

"దేవరవారియాదేశములచొప్పున ప్రవర్తించితిని. ఒక్కొ టొక్కటిగాఁ జెప్పెదను. చక్రవర్తి యొసఁగిన యంగీకార పత్రికలతో సైనికులు సురక్షితముగా డిల్లీనుండి వెడలి పోయినారు"

"భగవానునకు నమస్కారము ! ఇప్పుడు నామనసు శాంతి నొందినది. ఆకాశమున నెగురునివిహంగము పంజరములో చిరకాల ముండదు. సమయము చూచి తప్పించుకొని పోవును. నాపలాయనమును గూర్చి విచారము లేదు."

"సైనికులు ఢిల్లీనగరమునుండి వెడలిపోయి, గోసాయీలవేషములతో మధుర మొదలగు ప్రదేశములం దున్నారు. మధురామార్గమును నేను చక్కఁగా నెఱుఁగుదును. ఏయే ప్రదేశములందు మనవారిని నిలుప నాజ్ఞాపించితిరో ఆయా చోటుల వారిని నిలిపినాను."

"నీవు కార్యదక్షుఁడవు. తప్పక మనము స్వరాజ్యమునకుఁ బోవఁగలము."

"నగరప్రాకారము వెలుపల, తమరు సెల విచ్చినట్లు మంచిగుఱ్ఱమును సిద్ధము చేసినాను. రోజు నిశ్చయించినపిమ్మట సమస్తము సంసిద్ధముగా నుండును."

"మేలు !"

"రాజా జయసింగుగారి పుత్త్రుఁడు, రామసింగుగారి గృహమునకుఁ బోయి, ఆయనతండ్రి తమకుఁ జేసినవాగ్దానమును జ్ఞప్తికిఁ దెచ్చితిని. జనకునివలె రామసింగు సత్యప్రియుఁడు, విశాలహృదయుఁడు, తమకొఱకు ఆయన స్వయముగా చక్రవర్తి యొద్దకుఁ జని, అతిదీనముగా వానిని ప్రార్థించె నఁట !"

"ఔరంగ్‌జేబ్ ఏ మనెను ?"

"చక్రవర్తి తగినట్లు చేయు నఁట."

"ఒకనాఁడు దీనికిఁ బ్రతిఫలము లభించును లే!"

"రామసింగు ఆవిషయమున విఫలప్రయత్నుఁ డయ్యెను. కాని రాజపుత్రునిమాట అన్యథా కానేరదనియు, ధనము, సైన్యము మొదలగువానితో తమకు తాను తోడగు ననియు, తన ప్రాణము పోయినను నరే యనియు, రామసింగు సరోషముగా నాతోఁ బలికినాఁడు."

"తండ్రికిఁ దగినకొడుకు! కాని అతనిని కష్టములపాలు చేయుట నా కిష్టము లేదు. పలాయనమునుగూర్చి నే నాలోచించిన యుపాయ మతనితోఁ జెప్పితివా?"

"చెప్పితిని. విని, ఆయన మిక్కిలి సంతోషించెను. అన్నివిధముల నతఁడు తమకు సాయము చేయ సిద్ధముగా నున్నాఁడు."

"మంచిది!"

దానేశ్‌మంద్ మొదలగు పెద్దమనుష్యులను మంచి మాటలతోఁ గాని, ధనముతోఁ గాని మీపక్షమునకుఁ ద్రిప్పితిని. హిందువులలోఁ గాని, ముసల్మానులలోఁ గాని మీపక్షవర్తి కాని పెద్దమనుష్యుఁడు డిల్లీలో లేఁడు. కాని చక్రవర్తి యెవ్వని యాలోచనయు చెవిఁ బెట్టఁడు."

"సమస్తము బాగుగా నున్నది! నా కారోగ్యము కలుగునా?"

"నావంటి గొప్పవైద్యుఁడు తమవ్యాధి చికిత్స చేయ నారంభించినప్పుడే రోగము మాయదా ? త్రాగుటకు మంచి షర్బత్ సిద్ధము చేసితిని, కాని, తమరు దానిని పాఱఁ బోసితిరి !"

శివాజీ మఱియొకగిన్నెఁడు చేయవలసిన దని పలికెను. తానాజీ క్రమ్మఱ సిద్ధము చేసినషర్బత్ త్రాగి, అతఁడు వేసగవృత్తో, "భిషగ్వరా, మీయౌషధము ఎంత మధురమో అంత సౌఖ్యదాయకము. నావ్యాధి యిప్పుడే నిర్మూలించినది." అని నుడివెను.

శివాజీకడ ననుజ్ఞ తీసికొని, మరల గడ్డమును, పాగాను ధరించి తానాజీ యిలు వెడలెను ద్వారరక్షకుఁ డొకఁ డతనిని జూచి "రోగ మెట్లున్నది ?" అని యడిగెను.

"వ్యాధి భయంకర మయినదే కాని నామందు చాల పనిచేసినది. శీఘ్రముగానే రోగము నిర్మూలించును" అని పలికి, హకీం శిబికలో నెక్కి, వెడలి పోయెను.

ఒకరక్షకభటుఁడు రెండవవానిఁ జూచి "హకీం గొప్ప వానివలె నున్నాఁడు. ఎంతమందివైద్యులో కుదుర్పలేనిరోగ మును ఒకనాఁటిలోనే నయము చేసినాఁడు !" అని పలికెను.

"ఏల నయము చేయఁ గూడదు ? హకీం రాజ వైద్యుఁడు" అని రెండవవాఁడు బదులు చెప్పెను.

తరువాత రెండుమూడు రోజులకు శివాజీ రుజ తగ్గిపోయెనని నగరములో వ్యాపించెను. హిందువులు ముసల్మానులును సంతసించిరి. ఔరంగజేబు ఈవార్త నాకర్ణించి యథోచితముగా సంతోషము గనఁబఱిచెను.

నగరమున సందడి సంప్రాప్తమయ్యెను. బ్రాహ్మణులకు, దేవాలయములకు శివాజీ ముద్రలు పంపసాగెను. బజారులోని తీపివస్తువులన్నియుఁ గొని పెద్దమనుష్యుల గృహములకుఁ బంపఁ జొచ్చెను. వైద్యులను ద్రవ్యముచే సంతుష్టులఁ జేసెను. మసీదులకు, ఫకీర్లకు కానుకలు పంపెను. చక్రవర్తి మనస్సులో నెట్లున్నను, పౌరులెల్లరు శివాజీ వదాన్యతకు మిగుల నాహ్లాదమొంది, అతనిని ప్రశంసించుచుండిరి. 'ఢిల్లీకా లడ్డు' దొరుల నారంభించెను. ఎవ్వఁడైన నీపనులు చూచి విచారము నొందెనో లేదో కాని, చక్రవర్తిమాత్రము త్వరలోనే చింతాకులుఁడయ్యెను.

పెద్దపెద్దగుండిగలలో నుంచి మిఠాయీలను శివాజీ నగరములో హిందూ ముసల్మాను స్నేహితుల యిండ్లకు స్వయముగాఁ బంపుచుండెను. గుంటగ రమారమి నాలుగైదు అడుగుల యెత్తుండెను. ఒక్కొక్కదానినై దాటుగురు మోసికొనిపోవుచుండిరి. ఈప్రకారముగా కొన్నాళ్ళు శివాజీ తీపివస్తువులను విచ్చలవిడిగా పెచ్చుపెట్టుచుండెను.

ఒకనాఁటి సంధ్యాసమయమున శివాజీగృహములోనుండి రెండు పెద్దగుండిగలు బయలుదేఱెను. "ఇవి యెవరియింటికి?" అని రక్షకభటు లడుగఁగా "రాజా జయసింగుగారి గృహమునకు" అని వాహకులు ప్రత్యుత్తర మిచ్చిరి.

"ఇంక నెన్నాళ్ళు మీప్రభువుగా రీవిధముగా తినుబండములను బంపుచుందురు?" అని భటు లడుగఁగా "నేటితో సరి" అని వాహకులు కదలిచనిరి. ఇట్లు కొంతదూరము పోయి, నిర్జనస్థానమున, చీఁకటిలో నా రెంటిని క్రిందదింపి నల్దిక్కులు పరికించి చూచిరి. ఎవ్వరు కనఁబడలేదు. సంకేతము తెలుపఁగా నొకదానిలోనుండి శివాజీ, రెండవదానిలో నుండి శంభుజీయును వెలుపలికి వచ్చి, భగవంతుని స్తుతించిరి.

జాగు సేయక వా రిరువురు ప్రాకారాభిముఖులై చనిరి. చీఁకటివేళ జనులు మార్గమువెంట తక్కువగా నడచుచుందురు అయినను, వారికి త్రోవలో నప్పుడప్పు డొక, రిద్దఱు కనఁబడుచుండిరి. శివాజీ కిట్టివి క్రొత్తలు కావు. కాని శంభుజీ జంకుచుండెను. ధీరుఁ డయినను శివాజీ కొంచెము సంచలింపక పోలేదు.

గుండెలు కొట్టుకొనుచుండ నిర్వురును ప్రాకారము చేరిరి. అచ్చటి ద్వారరక్షకుఁ డొకఁడు "ఎవ రాపోవువారు?" అని వారి నడిగెను.

"మేము గోసాయిలము"

హారే ర్నామ హారే ర్నామ హారే ర్నామైవ కేవలమ్
"ఎక్కడికి పోవుచున్నారు ?"
"మథురాక్షేత్రమునకు"
కలౌ నా స్త్యేవ, నా స్త్యేవ, నా స్త్యేవ గతి రన్యథా.

ఉభయులు ద్వారమును దాటిరి. గోడవెలుపలఁ గూడ మేడ లుండెను. వానిని దప్పించుకొని వారు వేగముగా ముందునకు చనిరి. దూరమునం దొకవృక్షమునకు గుఱ్ఱము కట్టియుండెను. చూడఁగా నది తానాజీ వర్ణించినయశ్వమే.

"భాయీ, అశ్వరక్షక్, తుంహారా నాం క్యా హై?"
"జానకీనాథ్"
"కహాఁ జాఓగే ?"
"మథురామేఁ"
"సబ్ ఠీక్ హై"

శివాజీ గుఱ్ఱమెక్కి, శంభుజీని తనవెనుక నెక్కించుకొనెను. ఆరాత్రివేళ పల్లియలగుండ నిశ్శబ్దముగా నతఁడు పలాయనము చేయుచుండెను. ఆకసమున నక్షత్రములు మినుకు మినుకు మనుచుండెను. అప్పుడప్పుడు చిన్నమబ్బులు గగనము నావరించుచుండెను. వర్షకాల మగుటచే యమునానది నిండి వేగముగా ప్రవహించుచుండెను. మార్గము బురదతో నిండి యుండెను. శివాజీ అశ్వమును బరుగెత్తించుచుండెను.

దూరమున గుఱ్ఱపుడెక్కలచప్పుడు వినఁబడెను. అతఁడు దాఁగుకొనఁ దలఁచెను; కాని చుట్టుప్రక్కల వృక్షమే లేకుండుటచే విధి లేక పయనము చేయుచుండెను.

మున్నూ రశ్వారోహులు ఢిల్లీనగరాభిముఖులై వేగముగా వచ్చుచుండిరి. వారియొఱలలో ఖడ్గము లుండెను. శివాజీగుండెలు తటతటఁ గొట్టుకొనెను. అందులో నొకఁడు "ఎవరా పోవువారు ?" అని కేక వైచెను.

"గోసాయీలము."

"ఎక్కడనుండి వచ్చుచున్నారు ?"

"ఢిల్లీనగరమునుండి."

"మేము త్రోవ తప్పినాము తిన్ననిత్రోవ వచ్చువఱకును మావెంట వచ్చి, మీమార్గమునఁ బోవచ్చును."

శివాజీపైఁ బర్వతము పడినట్లయ్యెను. వారు చెప్పినట్లు చేయనిచో బలవంతి పెట్టుదురు. వెనుకకుఁ బోవుట కతని కిష్టము లేదు. ఇతికర్తవ్యతామూఢుఁడై శివాజీ ఖిన్నుఁ డుండెను.

అశ్వికుఁ డొకఁడు ముందునకు వచ్చి శివాజీని పలుకరించుచుండఁగా మిగిలినయిరువురు నిట్లు మాటలాడిరి :

"ఈకంఠస్వరము నే నెఱిఁగినదే. దక్షన్‌లో నయిస్తఖాన్‌సాహెబ్ క్రింద చాలరోజులు పని చేసితిని. అప్పుడు విన్న ట్లున్నాను. ఈమనుష్యుఁడు గోసాయీ కాఁడని తోఁచుచున్నది" అని యొకఁడనెను.

" కాకపోయిన నేమి ? " అన్నాఁడు రెండవవాఁడు.

" అతఁడు శివాజీ యనియే నాయభిప్రాయము. "

" పోరా పిచ్చివాఁడా ! శివాజీ ఢిల్లీలో ఖైదీగా నున్నాఁడు. "

" శివాజీ సింహగఢ్ దుర్గములో నుండె నని మేము తలఁచి యుండ, రాత్రివేళ పూనాలో ప్రవేశించి మ మ్మందఱను చావఁ గొట్టినాఁడు ! "

" ఎందుల కీగడబిడ ? నెత్తిమీఁదిబట్ట తొలఁగించిన యెడల అన్ని సందేహములు తీఱును. "

ఒకరౌతు బల్లెముతో శివాజీపాగాను నెట్టివై చెను. రహస్యము బట్టబయ లయ్యెను ! వాఁడు శివాజీ నానవాలు పట్టెను. భవానీదేవిని స్మరించి మహారాష్ట్రవీరుఁడు కా నున్న దాని కెదురు చూచుచుండెను. అతనిదృష్టి శంభుజీపైఁ బడఁగా కన్నులనిండ నీరు క్రమ్మెను.

టటాలున చప్పు డయ్యెను. శివాజీ కన్నులు తుడుచుకొని చూడఁగా నొకరౌతు శరవిద్ధుఁడై క్రిందఁ బడెను, వెంటనే రెండవవాఁడు గుఱ్ఱము మీఁదినుండి జాఱెను, తోడనే మూఁడవవాఁడు నేల రాలెను. శత్రువులు ముగ్గురు నిహతు లయిరి !

" ఏ మిది ! " అని విలోకింపఁగా జానకీనాథుఁడు ప్రత్యక్షమయ్యెను. అతఁడే ప్రాణములు విడిచి మునలొనల

ప్రాణములు తీసెను. శివాజీ ఆశ్చర్య మొందెను; అతఁడు గుజ్జువాఁడు కాఁడు; తద్వేషధారి యగుసీతాపతి !

"సీతాపతీ, ఆపత్సమయములందు మీకంటె నాకుఁ మిత్త్రుఁడు వేఱెవ్వఁడు ? మిమ్మును అశ్వపాలకునిఁగాఁ దలఁచి నందులకు క్షమింపవలయును. ఈ కార్యమునకుఁ దగినబహుమాన మే మయిన నీయఁగలనా !" అన్నాఁడు శివాజీ.

గోసాయీ శివాజీయెదుట మోఁకరించి, బద్ధాంజలియై, "మహారాజా, మాఱువేషము దాల్చినందులకు నన్ను క్షమింపవలయును. నేను అశ్వపాలకుఁడను కాను, సీతాపతిని, కాను. తమపురాతనసేవకుఁడను, రఘునాథుఁడను. తెలిసి వచ్చినది మొదలుగా తమకొలువులో నుంటిని. ఇంకను ఉండఁ గోరుచున్నాను. ఇంతకంటె నాకు వేఱొకవాంఛ లేదు. నాదోషములను దేవరవారు క్షమింపవలయును" అని పలికెను.

శివాజీ యాదరిపడి "రఘునాథా ! రఘునాథా ! నీవిషయమై చాల పొరపాటు చేసినాను. అయిన నీ వీమహాకార్యముచే నాకుమంచిశిక్ష నొసఁగితివి. వెనుకటిసంగతులను తలఁచినచో గుండె లదరును. బ్రదికియున్నంతకాలము శివాజీ నీసుగుణములను మఱవఁడు." అని వచించెను.

నేఁటితో రఘునాథునివ్రతము సమాప్త మయినది. శివాజీ హృదయశల్యము రాలిపోయినది.

చీఁకటి పడినతరువాత సరయూబాల సీతాపతిని వీడ్కొని నిజావాసమునకుఁ జనెను; తన గృహమునకుఁ బోయినతోడనే శూన్యహృదయ యయ్యెను. ఏస్వదేశీయయోధను మొదటిసారి సందర్శించినమాత్ర నామె విస్మితయు, నానందితయు నయ్యెనో, ఎవ్వానిని కొన్నిమాసములనుండి హృదయేశ్వరునిఁగా భావించుచుండెనో, ఎవనికి జనార్దనుఁడు తను నిచ్చి వివాహము చేయుటకు సమ్మతించిన ట్లగపడెనో, అట్టిరఘునాథుఁడు కాన్పింపమిచే నామె శూన్యహృదయ యయ్యెను.

ఆరోజు గడచెను, సప్తాహ మయ్యెను, మాసము దాఁటెను. ఆమెహృదయధనము క్రమ్మఱ లభింపదయ్యెను. అప్పు డప్పు డామె గవాక్షముప్రక్క నాసీన యై గంటలకొలఁది మార్గము వెంటఁ జూచుచు, చింతామగ్న యై యుండును. కాని, రఘునాథుఁ డాత్రోవవెంట రాలేదు.

ఒక్కొకప్పుడు మామిడితోఁటలో నొంటిగా సంచరించుచుండునపుడు వెనుకటిసంగతు లామెజ్ఞప్తికి వచ్చును: తోరణదుర్గము, ఆగమనము, పూఁదోఁట, కంఠమాల, రాజ్‌గఢ్ దుర్గాగమనము, వీడుకోలు ఇవి యన్నియు జ్ఞప్తికి వచ్చెను. నిశ్శబ్దముగ నామెగండస్థలముమీఁదుగా బాష్పకణములు జాలువాఱును ఒక్కొకప్పుడు రాత్రులందు హృత్కవాట ముద్ఘాటితమై, భాద్రపదంబున తరంగిణివలె శోకప్రవా

హము వెల్లివిరిసి పాఱుచుండును: అప్పుడు దగ్గఱ నెవ్వరునుండ
కపోవుటచే నామె కడు పుబ్బునట్లు రోదనము చేయును;
శ్రావణమాసవర్షధారలవలె, నేత్రములనుండి నిరంతర బాష్పధా
రలు ప్రవహించును. రజని ప్రభాత మగును, శోకవివశయై
ఆమె నేలపైఁ బడును.

ప్రాతఃకాలమున తోఁటలో పుష్పములం గోసి, హృద
యముపై నిడుకొని యామె యేమో చింతించుచు కుసుమ
ములం జూచును. అప్పుడు ప్రసూనపత్రసంలగ్న ప్రాతశ్శిశిర
బిందుసందోహమున నొకటిరెండు స్వచ్ఛాశ్రుకణంబులు కలిసి
పోవును. సాయంకాలమున సరయువు వీణఁ జేఁ బూని గీత
ములు పాడుచుండును.

దుఃఖముచే నామెశరీరము క్రమముగా శుష్కింపఁ
జొచ్చెను; ముఖము పాండువర్ణము ధరించెను. జనార్దనుఁ
డిప్పటికిని ఆమెమనస్స్థితిని గ్రహింప లేదు; కాని శరీరస్థితిని
జూచి చింతించి, కారణ మారయ లేకుండెను.

స్త్రీలకడ స్త్రీలరహస్యములు దాఁగి యుండనేరవు.
ఆమెచెలిమికత్తెలు చూచాయఁగా సంగతి కనిపట్టి "సరయువు
నకు పెండ్లియీడు వచ్చినది. వివాహము చేయుఁడు" అని
జనార్దనునితో కథాసందర్భమునఁ జెప్పిరి. ఈమాటలు సరయూ
బాలకుఁ దెలిసెను; అప్పు డామె "నాకు వివాహేచ్ఛ లేదు

ఎల్లకాలము నాయనగారిపాదసేవ చేయుదాన నని జెప్పుఁడు"
అని చెలికత్తెలకుఁ గబు రంపెను.

జనార్దనుఁ డామాటలు లెక్క సేయక వరుని వెదక సాగెను. రాజపురోహితుని పెంపుడుఁగూఁతు రగుక్షత్త్రియ తరుణికి తగినవరులు దొరకక పోరు. త్వరలోనే రాజా జయసింగు నుద్యోగులలో నొకఁడు దొరకెను. ఈవార్త చెవి సోఁకఁగా, నామె యదరిపడి చెలికత్తియలతో "నాయనగారితో మీ రిట్లు చెప్పుఁడు: వారు ఇంకొకరికి వాగ్దానము చేసి యున్నారు. ఆయనయే నాభర్త." అని సిగ్గు విడిచి పలికెను.

జనార్దనుఁడు కుపితుఁడై సరయువును చీవాట్లు పెట్టి, తరువాత మనోవ్యథకోలఁది రోదనము చేసెను. కొమార్త మాట పరిగణింపక బ్రాహ్మణుఁడు ముహూర్తనిర్ధారణ చేసి, రాజాజయసింగునకుఁ దెలియబఱిచెను. ఎట్లో యీసంగతి సరయూబాలకర్ణముఁ జేరఁగా, నామె జనకునిపాదములపైఁ బడి, ఎలుఁగెత్తి యేడ్చుచు "ఈవిషయములో నాయనగారు నన్ననుగ్రహింప వలయును. కానియెడల ఈదౌర్భాగ్యవతి మీ కీజన్మలో మఱలఁ గనఁబడదు" అని పలుకఁగా జనార్దనుఁ డామెను కౌఁగిలించుకొని, మనసు పట్టలేక క్రందనము చేసెను.

కాని, పుత్త్రికలమాటలు వినువా రెవ్వరు? నల్గురు పెద్దలు చెప్పినప్రకారము ప్రవర్తింపవలసియుండును. ముహూర్త వాసరము సమీపించుచుండెను. జనార్దనుఁ డామె కనేకవిధముల

బుద్ధి చెప్పెను, తా నేడ్చెను, ఆమెను చీవాట్లు పెట్టెను; తుదకు సహింపలేక వివాహమునకు వెనుకటిరోజున, పాపాత్మురాలా! నీమూలమున నే నీముసలితనమున నిందపాలు కావలయునా? స్వేచ్ఛ మగు నీజననీజనకులవంశమునకుఁ గళంకము నాపాదించెదవా?" అని పలికెను.

కన్నులవెంట బాష్పములు జాలువాఱ, మెల్లఁగా సరయు యిట్లనెను: "బాబా, నేను మూర్ఖురాలను. నాదోషములను క్షమింపుఁడు. నామూలమున మీకు అవమానము కలుగఁబోదు!"

ఈవాక్యములయర్థము జనార్దనుఁడు గ్రహింపలేదు; కాని మఱునాఁడు స్పష్ట మయ్యెను. ముహూర్తమునాఁడు వధువు కనఁబడ లేదు!

## ౩౦

అది శరత్కాలము. బాలభానుఁడు లోకమునకు వికాసము నొసఁగు చుండెను. నీరానది వడిగాఁ బ్రవహించుచుండెను. ఆనదికి రెండుప్రక్కల సస్యక్షేత్రములు కలవు; కృషీవలుల ప్రార్థనలచే మిగుల సంతుష్టిఁ జెంది వసుంధరాదేవి పచ్చని వస్త్రము దాల్చెనో యన్నట్లుండెను.

ఆనదీకూలంబున శ్యామలక్షేత్రపరివేష్టితం బగుగ్రామము వెలుపల కాఁపువానిగృహముచెంగట నొకబాలిక యాట

లాడుచుండెను. దగ్గఱ నొకపరిచారిక యుండెను. కాపుభార్య యింటిపనులు చేయుచుండెను.

ఆ యిలు చూచుచో గృహస్వామి మర్యాద కలవాఁడని తోఁచును. ముంగిట నడ్లకొట్టు కలదు; పార్శ్వమున పశువులను కట్టివేయు కొట్ట మున్నది. గృహస్వామి సేద్యకాఁడై నను పెద్దమనుష్యులలోఁ జేరినవాఁడు. అతఁడు కొలఁదిగా వర్తకము, కుసీదము కూడ చేయుచుండును.

ఆబాలిక యేడేండ్లది, చామనిచాయ ఒకమాఱు ఆకన్నియ నదీతీరమునకుఁ బరుగెత్తుచుండును; ఇంకొకసారి వంట చేయుతల్లియొద్దకు గంతు లిడుచుండెను; మఱియొకపర్యాయము పరిచారికచేయి పట్టుకొని యేమో మాటలాడుచుండెను.

"అక్కా! నిన్నటివలె చీరె వేసి చేఁపలు పట్టుకొందమా?" అన్నది బాలిక.

"వలదమ్మా! ఏఁటియొడ్డునకుఁ బోవలదని అమ్మ చెప్పినది కాదా?" అన్నది పరిచారిక.

"అమ్మకు తెలియనీయను లే!"

"ఛీ! వలదు. అమ్మ వలదన్నపని చేయ రాదు."

"సరే: అమ్మ నీకుకూడ అమ్మయేనా?"

"ఔను."

"కాదు. నిజము చెప్పవా?"

"నిజముగానే."

"కాదు. నీవు రాజపుత్రస్త్రీవి; మేము కాము గాదా!"

పరిచారిక కిశోరిని ముద్దు పెట్టుకొని "అయిన ఎందుల కడిగితివి ?" అని ప్రశ్నించెను.

"అడుగరాదా ? అయిన నీవు అమ్మమ్మ అమ్మా ! అని పిలుచుట యెందులకు ?

"నాకు తినుటకు అన్నము పెట్టి, కట్టుకొనుటకు బట్ట యిచ్చి, ఉండుటకు చోటిచ్చి, కన్నతల్లివలె నన్ను రక్షించుచున్న యామెను అమ్మా అనవలయునా ? యింకే మైన ననవలయునా ?"

"ఛీ ! నీకనుల వెంట నీ ళ్ళెందులకు ? మాటమీద ఏడుపు సిద్ధము కావలయునా ?"

"లేదమ్మా ! ఏడు పెందులకు ?"

"నీకనుల వెంట నీరు వచ్చినప్పుడు నాకును ఏడుపు వచ్చును."

క్రమ్మఱ పరిచారిక బాలికను ముద్దాడి "నీకు నా మీఁద మిక్కిలి ప్రేమ" అని పలికెను.

"మఱి నీకు నామీఁద ప్రేమ లేదా ?"

"లేకేమి ?"

"ఎప్పటికి నన్ను మఱచిపోవుగా ?"

"మఱచిపోను. మఱి నీవు కూడ నన్ను మఱచిపోవ కుందువా ?"

"నేను మఱచిపోను."

"కాదు లే! ఒకనాఁడు నేను జ్ఞప్తియుంచుదును."

"ఎప్పుడు ?

"నీకు మగఁడు వచ్చినప్పుడు."

"నిన్ను ఎన్నఁటికి మఱచిపోను. మగనికంటె నీ మీఁదనే నాకు ఎక్కువప్రేమ ఉండును. అయిన నీవో అక్క మగఁడు రాఁగానే నన్ను మఱచిపోవా ?"

పరిచారికనేత్రములనీరు క్రమ్మెను. ఆమె "నిన్నెన్నఁటికిని మఱవను" అని చెప్పెను.

"మగనిమీఁదనా ? నామీఁదనా ? నీకు హెచ్చుప్రేమ ?"

"ఇద్దఱిమీఁదను సమానము."

"ఆయన యెప్పుడు వచ్చును అక్కా ?"

"ఏమో, భగవంతునికే యెఱుక ! ఇఁక పోనీ. వంట వేళ అయినది."

దిక్కులేనిసరయూబాల కృషీవలునియింట నేరి, దాసీవృత్తి నవలంబించెను. అతనిపేరు గోకర్ణనాథుఁడు. గోకర్ణుఁడు మంచివాఁడు, దయాళువు. అతనిభార్యయు గుణవతి; దిక్కులేని రాజపుత్త్రియగుదానిని తనపుత్త్రికవలెఁ జూచుచుండెను. సరయువు కృతజ్ఞతతోఁ బ్రవర్తించుచు, ఇంటి పనులు చేయుచు, బాలికను కనిపెట్టి యుండుటచేత యజమా

నకు భారము తగ్గెను. క్రమముగా భార్యాభర్తలు రాజపుత్రి యువతియెడఁ బ్రసన్నులు కాఁ జొచ్చిరి.

రఘునాథుఁడు లేనప్పుడు సరయూబాలను సుఖ మను మాట యుండునేని, అది యిప్పుడే యుండును గోకర్ణునకు నలువదియేడు సంవత్సరము లుండును; కాని నిరంతరపరిశ్రమచే నతనిశరీరము గట్టిపడి, బలిష్ఠమై యుండెను. అతని కుమారుఁడు శివాజీసైన్యములోఁ జేరి, చాలదినములక్రిందట నిలు వెడలెను. అప్పటినుండియు పుత్త్రికయే వారలకు కుమారుఁడు, కూఁతురు! ప్రాతఃకాలమున గోకర్ణుఁడు పొలమునకో, యేపనిమీఁదనో పోవును. సరయువు గృహకృత్యములు నిర్వర్తించును. యజమానురాలు సరయువుతో "అమ్మా, నీవు గొప్పవారిపడుచవే, ఇట్టిపనులు చేయునప్పుడు నీశరీరము నొవ్వకుండునా? నీవు చేయవలదు, నేనే చేసెదను" అని పలుకును. సరయూబాల "అమ్మా, నీవు మేలునకుఁ బ్రతిఫల మీయఁగలనా? ఈపనులవలన నాకు శ్రమ కలుగదు. జన్మజన్మాంతరములకు నీసేవ చేయుచుందును. నాపై ననుగ్రహ మున్న చాలదా?" అని ప్రత్యుత్తర మిచ్చును. అప్పుడా దయామయి కన్నులనీరు గ్రమ్మ "సరయూ, నీవంటి దాసిని చూడలేదు. నీవంటియువతి మాజాతిలో దొరకుపక్షమున నాకుమారునకుఁ బెండ్లిచేయుదును" అని పలికి, కొడుకుసంగతి జ్ఞప్తికిరాఁగా కొంతతడవు దుఃఖించును.

ఈప్రకారముగా కొన్నిమాసములు చనెను. ఒకనాఁటి సాయంకాలమున గోకర్ణనాథుఁడు భార్యదగ్గఱఁ గూరుచుండి యుండెను. ఇంచుక దూరమున సరయువు బాలిక నొడిలో నుంచుకొని, ఆసీనయై యుండెను. అట్టిసమయమున గోకర్ణనాథుఁడు భార్యతో "శాంతింపుము. నేఁడు సువార్త వచ్చినది" అని చెప్పెను.

"అబ్బాయి భీమజీవృత్తాంత మే మయినఁ దెలియ వచ్చినదా?"

"ఔను: మనవాఁడు శివాజీప్రభువుగారితో ఢిల్లీనగరమునకుఁ బోయినాఁ డఁట. పాదుషాచేతినుండి రాజుగారు తప్పించుకొని వచ్చినా రని నేఁడే తెలసినది. మన భీమజీ తప్పక వారివెంట వచ్చును."

"అమ్మయ్య! మనవానిని జూచి రమారమి సంవత్సరము గడచినది. నామనస్స్థితి దేవునకే యెఱుక!"

"భీమజీ రఘునాథజీ హావల్దారుగారిక్రింద నున్నాఁడు. ఆయనసంగతి కూడ తెలిసినది.

సరయూబాలహృదయము నాట్య మాడెను. ఆమె యూపిరి బిగఁబట్టి గోకర్ణునిమాటల నాకర్ణింపఁ జొచ్చెను.

"రఘునాథజీ రాజద్రోహి యని రాజుగా రాయనను వెడలఁగొట్టిననాఁడు మనవాఁడు చెప్పినమాటలు జ్ఞప్తియందున్నవా?"

“మా వలిబానికి నాకు అన్నమాటలు జ్ఞాపకమున్నవా?”

“అబ్బాయి ఈలాగునఁ జెప్పినాఁడు: “నాయనా, నేను హావల్దారుగుణములు బాగుగా నెఱుఁగుదును. ఆయనవంటి శూరుఁడు సైన్యములో లేఁడు. ఏమో గాని ప్రభువుగారు భ్రమపడి, ఆయన నవమానించి, వెడలఁగొట్టినారు. ప్రాణము తీయునంత పని జరిగినది. కాని కొన్నాళ్ళకు ప్రభువుగారికి ఆయన గుణములు తెలియఁగలవు” అని నేఁటికి మనవాని మాటలు యథార్థము లయినవి.

సరయూబాల హృదయము కొట్టుకొనెను; ముఖమునుండి స్వేదబిందువులు రాలెను.

“ఏలాగున?” అన్నది భార్య.

“రఘునాథజీ మారువేషము వేసికొని, రాజుగారి వెనుకనే ఢిల్లీనగరమునకుఁ జని, తన బుద్ధికుశలతచే వారిని రక్షించి, తన నిర్దోషిత్వమును దృఢపఱచుకొనె నఁట. ప్రభువుగా రాయన నొక్క సారిగా అయిదువేలసేన కధిపతిని జేసినా రఁట. ఎక్కడ విన్నను ఇవే మాటలు. మహారాష్ట్రప్రభువును రక్షించిన రఘునాథజీని ప్రశంసింపనివారు లేరు.”

## ౩౧

అప్పటినుండి సరయూబాలకు వెనుకటి యాకారము మరల రాఁ జొచ్చెను. చాలదినములకు సంతోషము, ఆశయు నామె హృదయమున స్థానము నొందెను. నేత్రద్వయము విప్పారఁ దొడఁగెను. వదనమునందు, గండస్థలములందును రక్తిమ తల

యెత్త సాగెను. మునుపటికంటె నామె యుల్లాసముతోఁ దిరుగు చుండెను.

గోకర్ణునిప్పటికి కూడ ఈపరివర్తనమును కనుఁగొనఁ గలిగెను. ఒకనాఁటి సాయంకాలము నదీఘట్టమునందుఁ గూరు చున్నప్పుడు బాలిక సరయువును సంబోధించి "ప్రతిదినము నీచక్కఁదనము హెచ్చగుచున్నది సుమా !" అని పలికెను.

"ఎవ రన్నారు ?"

"ఎవ రనవలయును ? నేను చూచి గ్రహింపలేనా ?"

"గ్రహింప లేదు. నీచూపులో పొరపా టున్నది."

"పొరపాటా ! అదివఱకు జడలో పూవు పెట్టుకొనని దానవు ఇప్పుడు పూలు పెట్టుకొనుచున్నావు. ఇందులోకూడ పొరపాటు పడుచున్నాను కాఁబోలు !"

"ఛీ, పో !"

"మఱి, రహస్యముగా ముత్తెములదండ మెడలో వేసికొను చున్నావు. ఇది కూడ పొరపాటేనా ?"

"ఛీ ! ఊరకుండుము."

"ఏటియొద్దనుఁ గూరుచుండి, చాలసేపు మొగము నీటిలో చూచుకొనుట కూడ పట్టిదేనా ?"

"దొంగమాటలు చెప్పఁబోకు."

"చెట్లక్రింద నక్కి, సన్నగొంతుతో పాటలు పాడుట కూడ నిజము కాదా ?"

సరయువు బాలికనోరు మూసెను. కిలకిల నవ్వుచు బాలిక ,,నే నీసంగతుల నన్నిటిని అమ్మతోఁ జెప్పెదను" అని యామెను బెదరించెను.

,,చెప్పవద్దు: నీవు మంచిదానవు !"

"అయిన, ఒకమాట: పూలు, హారము, సంగీతము— యెందులకో చెప్పవా ?"

"అమ్మ నీకు తల దువ్వి, సొమ్ములు పెట్టునే, అవి యెందులకు ?"

కొంచెము సిగ్గుతో "వచ్చుసంవత్సరము నాకు పెండ్లి యగు నఁట. వరుఁడు వచ్చు నఁట." అని బాలిక పలికెను.

"నాకును వరుఁడు వచ్చును."

"నిజముగానా ?"

"ఔను. నిజముగానే."

అప్పుడు దీర్ఘకాయుఁ డగు సన్న్యాసి 'హరహర, మహాదేవ' యనుచు, నదీతీరమున నిలిచెను. సంజకెంజాయలో విభూతిభూషిత మగు దీర్ఘాంగము కన్నులపండువుగా నుండెను. అతనిని జూచి బాలిక బెదరి పాఱిపోయెను. సరయూబాల అతనిని పరికించి చూచెను. అతఁడు గోసాయీ సీతాపతి.

ఆమెగుండెలు తటతటఁ గొట్టుకొనెను, భావోద్రేకముచే శరీరము వణకుచుండెను. సరయువు మనస్సు చిక్కఁబట్టి, లజ్జాభయములను విడిచి సన్న్యాసితో నిట్లనెను : "మహాత్మా,

ఆనాఁడు మీరు జనార్దనునింటఁ జూచిన దౌర్భాగ్యవతిని నేఁడు పరిచారికా వృత్తియందుఁ గాంచితిరి. మనఃపూర్వకముగా వరించిన భర్తయెడ విశ్వాసముచే నా కీగతి పట్టినది. నా హృదయము దైవమే యెఱుఁగును !"

కన్నుల నీరు గిఱ్ఱునఁ దిరుగ, నతఁడు "రఘునాథుని కొఱకు నీ విట్టికష్టములను సహించు చున్నావా ?" అని యామె నడిగెను.

"పతినామమును స్మరింపఁ గలన్ని దినములును కష్టములు కష్టములుగాఁ దోఁపవు."

ఇచ్చట సన్న్యాసి నిట్టూర్పు విడిచెను.

"మహాత్ములకు ఆదివ్యపురుషుఁడు కానిపించెనా ?"

"ఆ !"

"ఈసేవకురాలి వాక్యములు తమ రాయనకుఁ దెలిపితిరా ?"

"తెలిపితిని."

"ఆయన ప్రత్యుత్తర మిచ్చెనా ?"

"రఘునాథుఁడు బదులు పలుకలేదు. కేవలము నీ మాటలను మతియందుంచుకొని, కీర్తి సంపాదించుట కనేక కష్టములను సహించెను"

నరయువు ఆకసమువంక దృష్టి నిలిపి, చేతులు జోడించి "దైవమునకు పదివేల నమస్కారములు !" అన్నది.

"దేవీప్రసాదమున కార్యసిద్ధి యయినదిమ్మట రఘునాథుఁడు నీ కొకసంగతి చెప్పుటకు నన్నుఁ బంపినాఁడు"

"ఏ మది?"

"ఇంతకాలమువఱకు సరయువు నన్ను జ్ఞప్తియం దుంచుకొనునా? నే నామెదగ్గఱకుఁ జనినపుడు న న్నామె యానవాలు పట్టునా?" అని యతఁడు పలికినాఁడు.

"ఈజన్మలో నే నాయనను మఱచిపోఁగలనా?"

"నీయనురాగ మూతనికి విశదమే; కాని నారీహృదయము చపల మగుటచే ఎన్నఁ డెఱుఁగును నీ వాతనిని విస్మరించినపక్షమున?—"

గోసాయిచాపలతను, మందహాసమును గాంచి, సరయూబాల చిరాకు నొంది "నారీహృదయము చపల మని నాకుఁ దెలియదు" అని పలికెను.

"నాకును దెలియదు; కాని యేలనో నేఁడు ప్రత్యక్షముగా నున్నది."

"కొంచెము విప్పి చెప్పుఁడు."

"నా ప్రియురాలు నన్ను మఱచినది, చూచియు ఆనవాలు పట్టలేకున్నది!"

"ఆదౌర్భాగ్యురా లెవరు?"

"తోరణదుర్గమున జనార్దనదేవునిగృహమున మొదటి పారి నే నామెను జూచి, మానసమును గోల్పోయితినో,

ఆమెయే ఆసౌభాగ్యవతి. ఏయమకంఠమున నొకనాఁడు ముక్తా హారము వైచి, జీవితము సఫల మయ్యె నని తలఁచితినో, ఆమెయే ఆసౌభాగ్యవతి. ఏయమదర్శనము నాకన్నులకు సూర్యోదయమో, కంఠధ్వని నాకర్ణములకు సంగీతమో, స్పర్శ నాశరీరమునకు చందనప్రలేపమో, ఆమెయే ఆసౌభాగ్య వతి ఏయమ నానుస్మరణము చేయుచు, ఉపదేశము మదియం దుంచుకొని మరల కీర్తి సంపాదించితినో ఆమెయే ఆసౌభాగ్య వతి. ఇప్పు డామె నన్ను గుఱుతింపలేదా?"

ఆకంఠధ్వని సరయూబాలహృదయమును కలచివైచెను నక్షత్రముల వెలుతురులో నాదీర్ఘకాయు నామె గుఱుతు పట్టెను. ఆమెశిరస్సు తిరుగఁ జొచ్చెను, కన్నులు మూతఁపడెను. ఉద్రేకము నణఁచుకొని "క్షమింపుఁడు!" అని కేక వేసి, సరయూబాల చేతులు చాఁచెను. పతనోన్ముఖ మగుచుండి యు రాలిదేహము రఘునాథుఁడు నిజహస్తములతోఁ బట్టుకొని, మెల్లనఁ దనయుక్కునఁ జేర్చుకొనెను.

కొంతవడికి తెలివి రాఁగా నామె కన్నులు తెఱచెను. హృదయేశ్వరుఁడు తన్ను గాఢాలింగనము చేయుచుండెను!

ఆమె సంతప్తహృదయము రఘునాథునిశరీరస్పర్శచే శీతల మయ్యెను; ఇరువురనిశ్వాసము లొక్కటి యయ్యెను; చలించుచున్న యామె పెదవులను మొదటిసారి రఘునాథుని పెదవులు స్పృశించెను.

అనంతరము మహారాష్ట్రమున నలుదేశములనుండి యిచ్చ టికి విచ్చేసెను. ఆపురుషునివంకఁ జూచినతోడనే జయసింగి ట్లనెను: ,,సుహృద్వర, శివాజీప్రభూ, నేను మరణించుటకు ముందుగా మిమ్ముఁ జూచుభాగ్యము నా కబ్బినది. కృతార్థుఁడ నైతిని. లేచి, స్వాగత మనుటకు శక్తి లేదు. క్షమింపుఁడు."

సజలనయనుఁడై శివాజీ ,,తాతగారూ, వెనుకటిసారి మీసన్నిధానమున సెలవు తీసికొని పోయి, మిమ్ము నింత త్వరగా నిట్టియవస్థయందుఁ జూతు నని నే నెన్నఁడు ననుకొన లేదు" అని పలికెను.

,,రాజా, మానవదేహము క్షణభంగురము. మనము వెనుకటిసమయము కలిసికొన్నప్పుడు మీరు మొగల్ సామ్రాజ్యగౌరవమును జూచి యుంటిరి గదా, ఇప్పు డాగౌర వము మీకుఁ గాన్పించుచున్నదా?"

,,ఎప్పుడు మహారాజుగారు రాజ్యమునకు ప్రధాన స్తంభ మై యుండిరి; ఇప్పుడో మొగల్ రాజ్యమునకు నెవ్వఁడు?"

"వత్సా, అది కాకు రాజస్థానము వీరభూమి; జయ సింగు కాలధర్మము నొందినచో నింకొక జయసింగు బయలు దేఱును. నావంటి యోధులు అనేకు లున్నారు. నేఁ బోయినంత మాత్రాన రాజ్యమునకు నష్టము లేదు."

"తమరు పోవుటకంటె రాష్ట్రమున కింక నేగొప్పనష్టము సంభవించును?"

"ఒక యోధుఁడు పోయిన నింకొక యోధ సంసిద్ధుఁడగును. కాని అధర్మమువలనఁ జెడురాజ్యము, మఱల బాగుపడనేరదు. అధర్మమునకు జయము కలుగ దని యిదివఱకే చెప్పితిని. ఇప్పుడు మీకు ప్రత్యక్షప్రమాణము లభింపలేదా?"

"చిత్రము!"

"నేను మిమ్ము రాజధానికిఁ బంపినపుడు మీహృదయము బాదుషాహావైపునకు మొగ్గినది మీయెడ నతఁడు సరిగాఁ బ్రవర్తించి యున్న పక్షమున నతనికి దక్షిణదేశమున మహాపరాక్రమశాలి యగు మిత్త్రుఁ డుండెడివాఁడు; కాని, యతని కపటవర్తనమువలన నిప్పుడు బలవంతుఁ డగు శత్రువు వెలసినాఁడు."

"మహారాజా, మీబుద్ధి యసాధారణము. మీరు దూరదర్శులరు. జయసింగు మహారాజుగారు విజ్ఞులని లోకులు పలుకుట యుక్తమే!"

"షాహాజహాన్ నాఁటనుండియు నేను ఢిల్లీసేవకుఁడను. చేత నయినంతవఱకు బాదుషాహాల కుపకారము చేసితిని; స్వజాతి విజాతిభేదము నెంచ లేదు; నే ననియు, ఇంకొకఁ డనియు వివేచింప లేదు. నాపనుల, నెంతటికష్టముల కయిన నోర్చి, నెఱవేర్చు చుంటిని. ఈ వార్ధకమున ఔరంగజేబ్ మొదటిసారి నాకు నష్టము కలిగించినాఁడు. అంతతోఁ బోవక, అవమానము కూడ ఘటించినాఁడు. అయినను, నాచేసిన

చెడిపోయినది. ఇఁక మనము నానాదోషములకుఁ బ్రతిఫల మొసంగుదము: ముసల్మానులతో మఱల యుద్ధము ప్రారంభింతము.

“ఔరంగ్‌జేబ్ ప్రధానదండనాథుఁడు, మహానుభావుఁడు రాజా జయసింగు మృతి నొందెను గదా! దీనికిఁ గారణమేమి? ఆదుర్మార్గుని యసత్ప్రవర్తనమే సుఁడీ! సైనికులారా, ఢిల్లీయందు నాకారాగారనివాసమునకును, హిందూకులతిలకమగు రాజా జయసింగుమరణమునకును తగినప్రతిఫల మొసంగుదము.

“అధర్మము ప్రబలి యీమొగల్ రాజ్యము కొలఁది దినములలోఁ గూల నున్నది. ఢిల్లీసింహాసనము త్వరలో ననాథము కానున్నది. రండు, సైనికులారా, రండు! మహారాష్ట్ర గౌరవనక్షత్రము ప్రకాశించుచున్నది; పృథురాయనిసింహాసనమును హిందువుల మగు మనము శీఘ్రముగా నాక్రమింతము!”

“అదిగో, ప్రభాత మగు చున్నది! ఇది మనపాలిట సామాన్యప్రభాతము కాదు. మహారాష్ట్రులారా, ఇది మన జీవనప్రభాతము!”

ఎల్లరు నీయుత్సాహజనకవాక్యముల నాలకించి, ఒక్కపెట్టున “ఇది మన జీవనప్రభాతము!” అని సింహనాదము చేసిరి.

అనాఁటిసాయంకాలము రఘునాథుఁ డొంటిగా నదీతీరమున విహరించు చుండెను. తనకుఁ గలిగినయభివృద్ధి, సరయువును జూచుట, మొసల్మానులతో మరల యుద్ధము ప్రారంభమగుట, హిందువులయౌన్నత్యము ఈతలంపులు రఘునాథుని హృదయమును వికసింపఁ జేసెను. ఇంతలో నాకస్మికముగ వెనుక నుండి యెవ్వరో 'రఘునాధజీ!' అని పిలిచిరి.

అతఁడు వెనుకకుఁ దిరిగి చూడ, చంద్రరావు జుమ్లాదార్ దృగ్గోచరుఁ డయ్యెను. కోప మంకురించి, రఘునాథుని శరీరము వణఁకఁ జొచ్చెను. కాని ఈశానీమందిరమున తాఁ జేసినసమయము నతఁడు విస్మరింప లేదు.

"రఘునాథ్, ఈప్రపంచములో మన ముభయులము నిలుచుటకు వీలు లేదు. ఒకఁడు చచ్చి తీఱవలయును" అని చంద్రరావు కేక వేసెను.

కోపము నాఁపుకొని రఘునాథుఁడు మెల్లన "చంద్రరావ్, మిత్రద్రోహీ, నీకుఁ దగినశిక్ష శిరశ్ఛేదనమే. కాని, నిన్ను క్షమించినాను. పశ్చాత్తాపము నొంది, భగవంతునిఁ బ్రార్థింపుము" అని పలికెను.

"బాలుని క్షమనా కభ్యాసము లేదు. నీ వింక విశేషకాలము బ్రదుకవు. కాఁబట్టి నావాక్యములను సావ

ధానముగా వినుము. నీవు నాగర్భశత్రువవు, నేను నీపరమ శత్రువను. చిన్నతనమునందే నీతల శిలాఖండముపై బ్రద్దలు చేయ నెన్నిమాఱులో ప్రయత్నించితిని; కాని దైవవశమున నిన్నుఁ గడతేర్పక, నీకు సంపద లేకుండఁ జేసితిని దేశదిమ్మ ఱిని గావించితిని. నీపై ద్రోహము నారోపించి, దేశము వెడలఁ గొట్టించితిని. చంద్రగుప్తమౌర్యప్రతిజ్ఞ నెఱవేఱుటను మహాగ్రహము కొంతవఱకు శాంతించెను. నీవు మఱల నధి కారము నొంది, సైన్యములోనికి వచ్చితివి. చంద్రహాసు చేసిన ఘోరప్రతిజ్ఞయు నింతవఱకు నిష్ఫలము కాలేదు. ఇతరోపాయము లను విడిచి ఈయుద్ధములో నీహృదయమును వ్రక్కలించి, రుధిర పానము చేసి, భీమునిపగను కొంత చల్లార్చుకొనుచున్నాఁడ. ఇఁక నాచేతినుండి తప్పించుకొని పోలేవు రా!"

రోషవశంబున నేత్రములు నిప్పులు గురియుచుండ, రఘునాథుఁడు కఠోరస్వరముతో "పాపకుఁడా, ఎదుటినుండి దూరముగా పో; పోవేని, పవిత్ర మగుశపథము నతిక్రమించి, నీపాపములకు సముచితదండనము విధింపవలసి వచ్చును జుమీ!" అని యఱచెను.

"ఇంకను వెనుదీయుచున్నా వేమి? ఉజ్జయినీయుద్ధమున నీతండ్రిజీవమ్మును దూసికొనిపోయినబాణము శత్రువు విడిచినది కాదు; చంద్రరావే నీపితృహంత!"

రఘునాధుని కన్నుల కేమియుఁ గానరాలేదు, చెవు లకు వినరాలేదు. రోసముతోఁ గత్తి దూసి సరభసముగ నతఁడు చంద్రరావుం దాఁకెను. చంద్రరావు దుర్బలుఁడు కాఁడు. చాలవఱకు ద్వంద్వయుద్ధము జరిగెను. ఖడ్గాఘాతము లతో నిర్వుర డాలులును గీట్లు పడెను; కాయముల గాయములు తగిలెను. రక్తము స్రవించుచుండెను. చంద్రరావు తక్కువ వాఁడు కాఁడు. కాని, ఢిల్లీనగరమున విచిత్రఖడ్గయుద్ధమును నేర్చికొని యున్నరఘునాధుఁడు త్వరలోనే వానిని నేలపైఁ గూలఁ ద్రోసి, వక్షమున మోఁకాలు నిలిపి, "పామరుఁడా, ఇదియే నీపాపములకు శాస్తి నాయక్కగారిమరణమునకుఁ బ్రతీ కారము." అని యఱచెను.

మరణకాలమునను భయపడక, చంద్రరావు వికటాట్ట హాసము చేసి "ఇఁక నీచెల్లెలు విధవ యగును. ఈతలంపుతో నిఁక నేను సానందముగాఁ బ్రాణములు విడిచెదను" అని పలికెను.

విద్యుద్వేగమున రఘునాధునకు సమస్తవిషయములు గోచరించెను. లక్ష్మీబాయి భర్తనామమును బేర్కొని యుండ లేదు. చంద్రరావునకుఁ బ్రాణహాని చేయువల దని తన్ను వేఁడెను స్వామిద్రోహియు, రక్తపిశాచము నగుచంద్రరావు బలాత్కారముగాఁ దనసోదరిని బెండ్లి యాడెను. రఘునాధుఁ డు, పై కెత్తినకత్తిని చంద్రరావువక్షముమీఁదికి దింపక, మెల్లమెల్లన వానిని విడిచి, నిలువఁబడెను.

ఇర్వురుయోధులు నొకరివంక నొకరు దృష్టి నిలిపి, మండుచున్నహుతాశనులవలె నుండిరి. ద్వంద్వయుద్ధమున పరాజితుండై, ధూళిధూసరితాంగుండై, ఆరక్తనయనుండై, వికటరాక్షసునిచందమున చంద్రరావు రఘునాథు నవలోకించుచుండెను. పితృవధచేఁ గలిగినరోషమునను, భగిని కవమానము జరుగుటచేఁ గలిగినచిన్నఁదనమునను దహ్యమానమానసుండై, పగ తీర్చుకొనుటకును, ఏమి చేయుటకును వీలు లేక, చిత్తరువు నందలి మహేంద్రునివలె రఘునాథుఁడు చంద్రరావును విలోకించుచుండెను. అట్టిసమయమున చెట్టుచాటునుండి యొకపురుషుఁడు చప్పున ముందునకు వచ్చెను. ఇర్వురు నులికిపడిరి. ఆపురుషుఁడు శివాజీమహారాజు !

శివాజీ యేమియు ననక, తనవెంట నున్న నల్వురు సైనికులకు సైఁగ చేసెను. తోడనే వారు నిశ్శబ్దముగా చంద్రరావును సమీపించి, వానిచేతులనుండి కత్తిని డాలును లాగివైచి, చేతులు విఱిచి కట్టి తీసికొని పోయిరి. శివాజీ యదృశ్యుఁడయ్యెను. రఘునాథుఁడు ప్రాన్పడి యుండెను.

మఱునాఁటియుదయమున విచారణ. చంద్రరావు రఘునాథునితండ్రిని జంపె నని కాని రఘునాథునితో వెనుకటి దినమున నధర్మయుద్ధము చేసె నని కాని విచారణ జరుగుట లేదు. రుద్రమండలదుర్గాక్రమణమునకు ముందుగా నతఁడు రహ్మత్ ఖానునకు రహస్యపత్రమును బంపె నని ప్రమాణము లభించుటచే విచారణ జరుగుచున్నది.

ఆఫ్గన్ సేనాపతి రుద్రమండలదుర్గమున చెఱసాలయం దున్నకాలమున శివాజీ యతనిని గౌరవించెను. రహ్మత్ ఖాన్ స్వాతంత్ర్యము నొంది, తనయేలిక యగుబీజపూర్ సుల్తాన్ సన్నిధి కరిగెను. జయసింగు బీజపూరు నాక్రమించినపుడు రహ్మత్ ఖాన్ అతనితో యుద్ధము చేసెను. ఒకసారి యుద్ధములో నతనికి గాయము తగులుటచే రహ్మత్ జయసింగుచేఁ జిక్కెను. జయసింగు అతనిని తనశిబిరమునకుఁ గొనిపోయి, అనేకవిధముల నుపచారములు చేయించెను. కాని రహ్మత్ ఖాన్ మరణించెను.

రహ్మత్ మఱునాఁడు మృతి నొందు ననఁగా జయసింగతనితో ని ట్లనెను: "ఖాన్ సాహేబ్, మీ కిఁక విశేషాయుర్దాయము లేదు. నేఁ జేసినప్రయత్నములు నిష్ఫలము లయినవి. ఇప్పుడు మీ కేయాటంకము లేనియెడల మి మ్మొకసంగతి అడిగెదను."

"మృత్యుసంకోచము నా కెంతమాత్రము లేదు. మీరు శత్రువు లయినను, నాయెడ విశేషాదరము చూపినారు; దానికిఁ బ్రతిఫల మీయఁజాల కుండుటే గొప్పయాతంకము. అయిన, తమ రడుగఁ దలఁచినయంశము నడుగవచ్చును. మీకుఁ జెప్పఁగూడని దేదియు లేదు."

"రుద్రమండలదుర్గమును ముట్టడించునాఁడు మీకు ముందుగా నొకఁడు రహస్యముగా ముట్టడిమాట తెలిపినాఁడు

గదా. వాఁ డెవఁడో మాకుఁ దెలియలేదు. అన్యాయముగా నిఁకొకనికి దండనము జరిగెను."

"నేను జీవించి యుండఁగా నా పేరు పరులకుఁ దెలుప నని ప్రతిజ్ఞఁ గైకొంటిని. రాజపుత్త్రా! తమరు నన్ను ఘనముగ సమ్మానించితిరి. కాని పాఠాన్ తనశపథము నతిక్రమింప లేఁడు."

"యోధుఁడా, మీ ప్రతిజ్ఞను నిమన్నఁ డని నేఁ జెప్ప లేదు. ఏదయిన నిదర్శన మున్నపక్షమున దానిని నాకుఁ జూపుట కాక్షేప మున్నదా?"

"కొన్ని పత్త్రిక లున్నవి. నామగౌరవమునకుఁ బాధ్యము మీ రా పత్త్రికలను జదువఁ గూడదు."

జయసింగు శపథము చేసెను. అప్పుడు రహ్మత్ ఖాన్ కాగితములను జయసింగుచేతి కిచ్చెను. అతఁడు మృతి నొందిన తరువాత జయసింగు పత్త్రికలం జదివి చూడఁగా, నవి చంద్రరావు లిఖించినవి!

స్వహస్తలిఖితము లగుపత్త్రికలను చంద్రరావు రహ్మత్ ఖానునకు పంపెను. చంద్రరావు మసల్మానులవలన లంచము గ్రహించినట్లు కాకితములలోఁ గనఁబడెను. జయసింగు మృతి నొందునాఁడు ఆయనమంత్రి శివాజీ కాకాగితముల నొసఁగెను.

విచారణ కధికకాలము పట్ట లేదు. రఘునాథపంత్ న్యాయశాస్త్రి వాని సన్నిధిని బిగ్గరగాఁ జదివెను. చంద్రరావు

రాజద్రోహి ముసల్మానులవలన లంచము తీసికొని, మీఁదు మిక్కిలి నిష్కళంకుఁ డగు రఘునాథజీపై దోషము నారోపించి, యతనియునుఱు దీయఁ బ యత్నించె నని అచ్చటివారు గ్రహించి, రోషావేశముచే హుంకారము చేసిరి.

అంతట శివాజీ వానిం జూచి, "రాజద్రోహీ, నీమరణము సమీపించినది. ఏ మయినఁ జెప్పుకొందువా ?" అని ప్రశ్నించెను.

మరణసమయమందును చంద్రరావు భయ మనుమాట నెఱుఁగఁడు. ఇప్పటికి పూర్వాభిమాన మణఁగ కుండుటచే చంద్రరా విట్లనెను: "తమవిచారణాసామర్థ్యము సుప్రసిద్ధము! ఈదోషము నారోపించి రఘునాథజీని శిక్షించితిని. ఇప్పుడు నన్ను శిక్షింప నున్నారు. ఇంకఁ గొన్నాళ్ళకు మఱియొకనిని శిక్షింతురు. చంద్రరావు నిర్దోషి యనియు, ఈకాగితములు కల్పితము లనియు నప్పుడు మీకుఁ దెలియఁ గలదు."

ఈయుల్లసంపుఁబలుకుల కెంతయుఁ గసలి, శివాజీ యిట్లు లాజ్ఞాపించెను : "జల్లాద్, లంచము పుచ్చుకొన్నందులకు వీనిచేతులను ఖండించి, తప్తలోహముతో మొగముమీఁద రాజద్రోహి యని ముద్రింపుము."

శూలారోపణకుఁ డీపనులు చేయఁ బోవుచుండ, రఘునాథుఁడు, చేతులు జోడించి "మహారాజా, ఈదానునివిన్నప మొకటి కలదు" అని పలికెను.

"రఘునాథా, ఈవిషయములో నీప్రార్థన ముఖ్యముగా వినవలసినదే. ఈదుర్మార్గుఁడు నిన్ను నాశము చేయ యత్నించెను. దానికిఁ బ్రతిఫలముగా నీయిచ్చ వచ్చినట్లు వీనిపై పగదీర్చుకోవచ్చును."

"మహారాజుగారియాజ్ఞ యలంఘ్యము. దేవర వారు చంద్రరావును దండింపక విడిచిపెట్టుదురు గాక ! ఇదియే నా ప్రార్థన."

సభాసదులు విస్మితులై నోట మాట లేకుండిరి. కోపము నాఁపుకొని శివాజీ యిట్లనెను: "వీఁడు నీకుఁ జేసిన నష్టములకుఁ బ్రతిఫల మీయదలఁచి, నీప్రార్థనచే క్షమించితిని. అది పోనిమ్ము రాజద్రోహిని దండించుట రాజధర్మము. వీనికి మరణము తప్పదు. జల్లాద్, నీపని కానిమ్ము."

"దేవా, ఎట్లయినను చంద్రరావును మన్నింప వలయును."

"వీలు లేదు, రఘునాథా, నీవు కావున ఇంతవఱకు క్షమించితిని; ఇంకొకఁ డయినచో క్షమింపను. శివాజీయాజ్ఞను గూర్చి యేమియు మాట లాడవలదు"

"ప్రభూ, కొన్నిపర్యాయములు నీదాసుఁడు దేవరవారికి సేవ చేసినాఁడని తమరు వీనికి బహుమాన మిత్తు మంటిరి. నేఁ డాబహుమానమును వేఁడు చున్నాను. చంద్రరావును విడువఁ దగును."

ఆగ్రహోదగ్రుఁడై, నేత్రములనుండి మిణుఁగుఱులు రాల శివాజీ యిట్లు పలికెను : "రఘునాథా, ఎప్పుడో మాకు మేలు చేసితి వని చెప్పి నేఁడు మాతీర్పు నన్యథా చేయింపఁ గోరుచున్నావా ? రాజునానతి యన్యథా కానేరదు. నీ పౌరుష మును నీవే చెప్పుకొనుట చాలింపుము."

మొగము జేవురింప, రఘునాథుఁడు మెల్లఁగా "ప్రభూ, బహుమానము యాచించుట సేవకున కభ్యాసము లేదు. ప్రభు వుగారీబహుమానము నీయరేని, దాసుఁడు మరల యాచిం పఁడు సైనికవ్రతము విడిచి, క్రమ్మఱ గోసాయీరూపమున బిచ్చ మెత్తుచు, దేశదేశములు తిరుగు చుండును."

శివాజీ శాంతము వొంది, ఆలోచనామగ్నమానసుఁ డయ్యెను. అప్పుడు మంత్రి రాజుతో "చంద్రరావు తన చెల్లెలి పెనిమిటి యగుటచే రఘునాథుఁ డతనిని క్షమింపఁ గోరు చున్నాఁడు" అని రహస్యముగాఁ జెప్పెను.

అచ్చెరువొంది, శివాజీ చంద్రరావును క్షమించి యి ట్లనెను : "పో, చంద్రరావ్, పో ! మహారాష్ట్రమున నీ మొగము కనఁబడనీయకుము. మఱియొక దేశమునకుఁ బోయి చుట్టములను వధింపుము; మిత్రులకొంపలు దీయుము; శత్రు వులవలన లంచములు పుచ్చుకొనుము; దుస్తంత్రములు

పన్నుచు, ద్రోహములు చేయుచు, నీపాపపుజీవితమును ముగింపుము !"

చంద్రరావు ధైర్యవంతుఁడు. శివాజీ పలికినవాక్యము లచే వ్యథ నొంది, చంద్రరావు రఘునాథుని జూచి, "బాలుఁడా, నీదయతో నాకుఁ బని లేదు : నీవు నిలిపినయీనాప్రాణములు తృణప్రాయములు" అని వచించి, చురకత్తితో వక్షస్స్థలమునఁ బొడుచుకొని, గుభాలున సభామధ్యమున విగత జీవుఁడై పడెను.

౩౫

జనార్దనుఁడు సరయూబాలను గోల్పోయి యున్మత్తప్రాయుఁ డయ్యెను. క్రమ్మఱ సరయూబాల లభించినపుడు వానిసంతోష మునకు మేర లేదు. అతఁడు రఘునాథుని బిలువ నంపి శుభ ముహూర్తమున సరయువు నిచ్చి వివాహము చేసెను. నాలుగు సంవత్సరము లామె యెవని నామస్మరణ చేయుచుండెనో యతఁడు తనను అక్కునఁ దాల్చినపు డామె కీలోకములోనే స్వర్గము గానఁబడెను.

సరయూబాల కర్మకసోదరిని మరచిపోలేదు. వివాహా నంతర మామెను తనగృహమునందే నిలుపుకొనెను. రఘు

నాథుని ప్రార్థనే గోకర్ణుని కుమారుఁడు భీమజీకి శివాజీ మహా రాజు హావల్‌దారు ఉద్యోగ మిచ్చెను.

చంద్రరా వాత్మహత్య చేసుకొన్న నాఁడు రఘునాథుఁడు చెల్లెలిని జూడఁ బోయెను. లక్ష్మీబాయి శవముప్రక్క వెంట్రుకలు విరియఁబోసికొని గుండెలు బాదుకొనుచు రోదనము చేయుచుండెను. భర్తృమరణమున ఆర్యస్త్రీలు పొందువ్యథ వర్ణనాతీతము. లక్ష్మీబాయి నయనకౌముది నాఁటితో నంధకారమున లీన మయినది !

రఘునాథుఁ డామె నూరడింప యత్నించెను. ఆసమయమున నామె సోదరు నానవాలే పట్టలేదు ! రఘునాథుఁడు హృదయవ్యథతో వెడలిపోయి సాయంకాలమున మరల వచ్చి చెల్లెలిమార్పున కక్కజ మొందెను. ఆమె దుఃఖించుటలేదు; బాలికలు బొమ్మల నలంకరించునట్లు పతిశవమునకు సుగంధ తైలము రాచి కుసుమములతో నలంకారము చేయుచుండెను.

రఘునాథుఁడు గృహములో నడు గిడునప్పటికి పాద ధ్వనికి భర్తకు నిద్రాభంగ మగునో యనునట్లు మృదుపద న్యాసముతో సోదరుని సమీపించి మెల్లగా "అన్నా, నిన్నుఁ

జూడఁ గలిగినాను. పరమానందము! ఇఁక నాకు వ్యధయే లేదు" అని పలికెను.

కన్నీరు ప్రవహించుచుండ గద్గదస్వరముతో నతఁడు "లక్ష్మి, ఈ సమయమున నిన్నెట్లు చూడఁ గాంచఁగలను!" అని నెమ్మదిగా పలికెను.

లక్ష్మీబాయి చీరచెరఁగున నన్నగారి కన్నీటిని తుడిచి "అన్నా, నీవు సత్యముగా దయాస్వరూపుఁడవు. బావగారి కోసము నీవు ప్రభువును బహువిధముల ప్రార్థించితి వని వింటిని. కాని నాభాగ్యరేఖ యెట్లు లిఖింపఁబడియున్నదో యట్లే యగునది. పరమేశ్వరుఁడు నిన్ను రక్షించును గాక" అని నుడివెను.

"లక్ష్మి నీవు బుద్ధిమతివి. ఈశోకము నెట్లో దిగ మ్రింగితి వని తలఁచితిని. మానవజీవితము దుఃఖమయము నీగీత చొప్పున జరిగినది. శోకము సహించి నావెంట రమ్ము. సోదరుని యనురాగము, ఉపచారము నీకు ముట్టఁ గూర్చెదను. లక్ష్మి, నీ కెంతమాత్రము లోపము రానీయను" అని రఘునాథుఁడు సాంత్వనవాక్యములు పలికెను.

లక్ష్మీబాయి మందహాసము చేయగా నతనిగుండెలు జల్లుమనెను. "అన్నా, నీవు దయామయుఁడవు. కాని భగ

వంతుఁడు నాకు త్రోవ చూపినాఁడు. నేను హృదయేశ్వరుని వెంటఁ బోవలెను" అని వక్కాణించెను.

రఘునాథునిపై పిడుగు పడిన ట్లయ్యెను. ఆమె సహగమనము చేయ నిశ్చయించె నని స్పష్ట మయ్యెను. ఉన్న చెల్లెలు కూడ నిహాలోకమును విడుచు నని యతనికి మహాఖేదము కలిగెను. ఆమె పూనిక విడిపించుట కెంతో ప్రయత్నించెను.

"లక్ష్మీ, ఒకనాఁడు నిరాశ చెంది నేను ప్రాణత్యాగము తలపెట్టితిని. కాని నీయుపదేశమువలననే లోకప్రవృత్తిలో దిగితిని. నామాట వినవా? అన్నమీఁద నీకనురాగము లేదా?"

"అన్నా, నాకు తెలియును నీవానాఁడు చెల్లెలిమాట వినుటచే అప్రతిష్ఠ తొలఁగిపోయి, అదృష్టము పట్టినది. స్త్రీల సంగతి వేరు. నేఁడు పోయిన మాణిక్యము నాకు మరల లభింపదు. నేను బ్రదికియున్న లాభ మేమి? నాప్రయత్నమున కడ్డుపడకుము."

రాత్రి రెండుజాములకు చితి సిద్ధ మయ్యెను. చంద్రరావు శవమును దానిపై నుంచిరి. లక్ష్మీబాయి పట్టుచీర దాల్చి, యెల్లరకడ వేర్వేరుగా సెలవు తీసికొని చితియొద్ద కరిగెను. అక్కడ తన యాభరణములను ధనమును పరిచారికలకు

పుష్కలముగా దానము చేసి, దుఃఖించుచున్న వారిని మృదు వాక్యములతో నూరడించెను.

అంతట నామె రఘునాథుని జూచి "అన్నా, చిన్న తనము నుండియు నీకు నామీద ప్రీతి మెండు. నేను శాశ్వత సుఖమును పొందఁబోవు నాకు సస్నేహముగా సెల విమ్ము" అని వేడుకొనెను.

రఘునాథుఁడు చెల్లెలిచేతులు పట్టుకొని బాలునివలె రోదనము చేయ నామె యతని కన్నీరు దుడిచి "అన్నా శుభకార్యసమయమున నేడువ వచ్చునా? నాయనగారివలెనే నీవు ధీరుఁడవు భావికాలమున ప్రఖ్యాతి గాంతువు. ఈశ్వరానుగ్రహమున నీకు సమస్తశుభములు చేకూరుఁగాక! ఇదియే నాతుదికోరిక. ఇంక పోయెదను" అని పలికెను.

"లక్ష్మీ, ప్రపంచములో నాకు నా యనువారు లేరు. నీవు పోయినపిమ్మట ఈలోకములో నా కేమున్నది!" అని యేడ్చుచు రఘునాథుఁడు భూమిపైఁ బడెను

లక్ష్మీబాయి యతనిని బహువిధముల నూరడించి లేవఁదీసి, "ఇఁక నే నాలస్యము చేయరాదు. స్వామివారు ఎదురు చూచుచున్నారు. నీవు ధీరుఁడవు. ధర్మజ్ఞుఁడవు నీచెల్లెలిని ధర్మమార్గమున వర్తింప నిమ్ము" అని ప్రబోధించెను.

"ఈలోకమున నా కిఁక కనఁబడవు. పరలోకమున నిన్నుఁ జూచువరకు జీవన్మృతుఁడనై యుండును" అని యతఁడు డగ్గుత్తికతో ననెను.

అన్నకు నమస్కరించి లక్ష్మీబాయి భర్తృపాదములు స్పృశించి "హృదయేశ్వరా, మీరు సజీవులై యుండ ఈ దాసిని ప్రేమతోఁ జూచెడివారు. జన్మజన్మలకును మీరే నాకు భర్త కావలెను. ఇదిగో మీవెంట వచ్చుచున్నాను" అని పలికి, చితిపై కెక్కి భర్త చరణాంతికమునఁ గూరుచుండి యతనిపాదములు తన తొడలపై నిడుకొని కన్నులు మూసికొనెను.

వీతిహోత్రము ప్రజ్వరిల్లెను. నిరంతరఘృతధారా పాతమున జ్వాలనము భగభగ మండసాగెను. తొలుఁదొల్త నన్ని జ్వాలాజాలము లక్ష్మిపవిత్రగాత్రమును సంస్పృశించి, శీఘ్రముగా నలుదిక్కులఁ జెలరేగి యామె మస్తకము నంటుకొని భీకర ధ్వానములో నుప్పదమున కెగసెను. ఆమె యవయవ మేదియు సంచలింప లేదు.

సమాప్తము.